కవ్యప్రచారిణి X.

ప్రథమ

# సుజ్ఞానబోధిని

## మూడవ భాగము

గ్రంథకర్త

పూతలపట్టు శ్రీరాములురెడ్డి






Approved by the Text-book Committee

రాయవరమున

మల్లిడి సత్తిరెడ్డిగారి శ్రీ మేరీవక్ముద్రాక్షరశాల యందు

ముద్రింపఁబడినది

# విషయసూచిక

శ్రీరామ

# సుజ్ఞానబోధిని మూఁడవభాగము

## మనుజకార్యమునకు రహస్యములేదు

తే.గీ॥ అణువు మొదలుగ బ్రహ్మ ప ♦ ర్యంతముగల
సర్వవస్తువు లందున ♦ నతఁడునిండి
నడపుచుండంగ దేవుఁడు ♦ నడవనగునె?
యతని మొఱఁగించి యెట్లు ర ♦ హస్యఘటితి.

ఒక కాఁపువాఁ డొక దినమున మడక కాఁడి మూఁపున నునిచికొని యెడ్లఁ దోలికొని పొలమున కేగుచుండెను. అతని యిల్లాలు జొన్నవిత్తుల పుటికను జాకనిడుకొని యతని వెంట నరుగుచుండెను. వారి మార్గమధ్యమున నొక పిళ్లారి గుడియుండెను. ప్రతిదిన మా కాఁపువాఁ డాదారిని వచ్చుచుఁ బోవుచుఁ బంట చక్కఁగఁ బండవలయు ననియు, నెడ్లు రోగ బాధలకుఁ దప్పి బాగుగఁ బాటుపడవలయు ననియుఁ, దన కుటుంబము సౌఖ్యవంతమై యుండవలయుననియు మఱియే విధమో వానికా కాలమునకుఁ దోఁచినవెల్లఁ గోరి వినాయకునకు మ్రొక్కులిడుచుండువాఁడు.

ఎట్టివారికైనను వాడుక యనునది తాను మఱచినను తనకుఁ దెలియనీయకయే చేయుకార్యమును జేయించుచుండును. వాఁడతఁడు వాడుకచొప్పున విఘ్నేశ్వరాలయముకడ నిలిచి గా దేవున కెదురుగఁ దిరిగి "స్వామీ! ఈ నా చల్లఁ బోవు పండుము ధాన్యము పదినూర్ల పుట్లైనచో పుట్టెఁడు గింజలుగొట్టి యంబలిగాఁచి నీ పేరుచెప్పి నీ గుడికడ బీదలకుఁ బోసెద" నని మ్రొక్కెను.

ఆ మాటలు వినిన వాని యిల్లా లదరిపడి "ఓయీ! ఎవ్వరిప్రాణముఁదీయుటకిట్లు మ్రొక్కుకొంటివి. ఒకవేళ పండె ననుకొనుము. పుట్టెఁడు ధాన్యమును గొట్టి విసరుట, అంబలి గాఁచుట, మోచికొని యిక్కడకుఁ దెచ్చుట, అందఱకుఁ బోయుట సాధ్యమగుపనియా? నావలనఁగా" దనెను. అంత నా కాఁపువాఁడు భార్యవైపుదిరిగి, తన యెడమచేతిని వినాయకునకు ముఖ మగపడకుండున ట్లడ్డముగ నిడికొని "ఊర కుండవే! పండనిత్తువు! పిదప వానికి భుభుభుశే" యని నాలుక న ముగ నాడించెను.

భగవంతుఁ డెఱుఁగని దేది గలదు? లోకనాథుని కన్నులు మూయఁగలమా? దేవునియెదుట నసత్యములు చెప్పి తప్పించుకొనలేము. అప్పుడు మనతప్పు లనేకములగును.

# 2. మాతృ భక్తి

రామ:—గోపాలా! ఎక్కడకు వడివడిగా నేగుచున్నావు!

గోపా:—రామా! అంగడివీధికి. కూరగాయలు కొని తెచ్చుటకు.

రామ:—వింతగానున్నదే!

గోపా:—ఏల! మాతల్లి నాకు మూఁడుపైసలిచ్చినది. నీవునురమ్ము. సీతాఫలములఁ గొందము.

రామ:—అదే వింతయంటిని. ఎన్నఁడును రావే! మూఁడుపైసల కూలి కీ పని చేయుచున్నావు కాఁబోలు!

గోపా:—అ ! కాదు. మా తల్లి మిక్కిలిగఁ బ్రార్థించుటచే వచ్చితిని.

రామ:—మఱియును వింతయే;

గోపా:—రామచంద్రా! ఏల యట్లనుచున్నావు? నీ మాటలు నా కర్థమగుట లేదు!

రామ:—ఇంతమాత్రపుఁ బనికి మీ తల్లి నిన్నింత ప్రార్థించి మూఁడు పైసలు కూలి యిచ్చి పంపఁగా నొప్పి కొంటివిగా! నిజముగా నొప్పికొంటివి.

గోపా:—నిజముగా నా కేనొప్పియు లేదు. ఆనందము మాత్ర మున్నది.

రామ:—ఆమెను నీ వేల తల్లియనుచున్నావు?

గోపా:—నన్నుఁ గన్నది కావున.

రామ:—తొమ్మిదినెలలు పూర్తిగ మోసి కన్నదియే కదా తల్లి!

గోపా:—అవును.

రామ:—పిదపఁ జీమకఱచినను, నల్లికఱచినను బాధకు నీ వేడువఁగా నీ బాధ తనదిగ భావించి యాఁకలి యని యడుగనోపు లేక పలవింపఁగా పాలిచ్చి కాపాడినదితల్లియేగదా!

గోపా:—అవును. ఆమె కాక మఱియెవ్వరు?

రామ:—మఱియు నీవు గర్భకోశమున నున్నప్పుడు కారమో యుప్పో యెక్కువగఁదిన్న నీ దేహముమండి బాధ పడుదువని తా నేవైనఁ జెడురూపములఁగన్న నీకంగవైరూప్యము సిద్ధించునని భయమందుచు సురూపములఁ జూచుచు నీ కొఱకై తన సౌఖ్యములఁ గూడ వదలుకొన్నది నీ తల్లియే గదా!

గోపా:—ఇది నిజమా! నిన్న మన యుపాధ్యాయులు కూడ ఈ విషయమునే బోధించిరి. కాని యది పుస్తకములోని పాఠముగదా! అనుకొంటిని.

రామ:—ఈ నీ వయస్సున ననుభవ పూర్వకముగఁ దెలిసికొను విషయములు చాల కొలఁది. కొన్నింటి నుపాధ్యాయులు చెప్పినది నిజమని నమ్మి న నుఱికొంత కాలమున కవి యనుభవమునకు రాఁగలవు.

గోపా:—సర్వవిషయములు దృష్టాంతములతో నిరూ

పించి చెప్పెదమని మన యుపాధ్యాయు లనుచుందురే. అది యసత్యముగా?

రామ: చెప్పుదురు నిజమేకాని సర్వవిషయములు దృష్టాంతములతోఁ జూప వీలుకాదు.

గోపా:—అయిన నీవిప్పు డేమనుచున్నావు?

రామ:—పెద్దలు చెప్పినది వినవలయును. ఆపై నమ్మవలయును. వారు చెప్పినట్లు నడచుకొనవలయును. నీవు పుట్టినప్పటికంటె నిప్పుడు పెద్దవాఁడవైతివిగదా! ఎవ్వరివలన?

గోపా:—తల్లివలన.

రామ:—అట్టి తల్లివలన నీవు కూలిదీసికొని పనిచేయుచున్నావే? ఇది వింతకాదా! మనము జనించినందులకు మాతృసేవకంటెఁ జేయఁదగినది మఱొండుగలదా?

ఆ—వె॥ జనని తన్నుగర్భ ♦ మున మోచికొని యొక
కడపదాఁటినట్టి ♦ కష్టమునకు
బ్రతికినంతదాఁక ♦ పలువిధసేవ లొ
నర్పసమముగావు ♦ నరునకెన్న॥

అని గురువులు చెప్పిరికదా!

పదుగురుపాధ్యాయులకంటెఁ గులాచారుఁడును, నూఱుగురచార్యులకంటెఁ దండ్రియు, వేవురుతండ్రులకంటెఁ దల్లియు గౌరవవిషయమున నధికులని మనపెద్దలు చెప్పుదురు.

గోపా:—అవునవును. ఇంతవఱకు నీవిషయ మెఱిఁగి యు నట్లు ప్రవర్తింపకుంటి. ఇఁక దైవసమముగఁ గాంచెద.

రాము:—కాదు. ఆదిమదైవముగ నను. ఉదయమున, సాయంకాలమున నాటపాటలకంటె మాతృసేవ మహత్తరకార్యమని యెంచుము. పొమ్ము. వేళమీఱక తల్లి చెప్పిన పనులు నెఱవేర్చి బడికిరమ్ము. శ్రీరాముఁడు పినతల్లి మాట నిలుపుటకై పదునాలుగేండ్లడవులకు వెళ్లెననుమాట మఱవకుము. గణపుని మాతృసేవాకార్యము మఱవకుము.

ఇరువురు వెడలుదురు

## 3. సోదర ప్రేమ

కోసల దేశమును పాలించుచుండిన దశరథమహారాజునకు ముగ్గురు భార్యలుండిరి. అందు పెద్దభార్యయగు కౌసల్యకు శ్రీరాముఁడును, రెండవయామెయగు సుమిత్రకు లక్ష్మణుఁడు, శత్రుఘ్నుఁడు నను నిరువురు కొమరులును, కడపటి యిల్లాలగు కైకేయికి భరతుఁడను సుతుఁడును గలిగిరి. ఆ నలుగురుకుమారులు పెరిఁగి పెద్దవారైనప్పుడు దశరథుఁడు శ్రీరామునకుఁ బట్టాభిషేకముచేయ నిశ్చయించెను. ఆ సమయమున మంథర యను కైక దాసి తన రాణికడకేగి చెడు బుద్ధులు గఱపెను. దాని మాటలువిని కైకేయి దశరథుని

కయొద్ద ముందుగ మాటదీసికొని, శ్రీరాముఁడు నారచీరలఁ గట్టి జడలుదాల్చి మునివేషముతోఁ బదునాలుగేండ్లడవుల లో సంచరించునట్లును, భరతునకుఁ గోసలరాజ్యము పట్టము గట్టునట్లును గోరెను. పిడుగులుపడినట్లు ఆ మాటలు తన చెవిని బడఁగనే దశరథుఁడు నేల కొఱఁగెను.

ఆవార్త రాముఁడు విని సంతోషముతోఁ దల్లిదండ్రుల సెలవు గైకొని యడవులకు బయలుదేఱెను. పతిసేవయే పరమసౌఖ్యకరమని నమ్మిన సీతాదేవియు భర్త వెన్నంటి నడచెను. భ్రాతృసేవ ముఖ్యకర్తవ్యమని తల్లిచేఁగూడఁ బ్రేరేపఁబడిన లక్ష్మణుఁడు సీతారాములకు ముందుగఁబోవు చుండెను. సీతా రామ లక్ష్మణు లిట్లు వనుల కేగిరను దుఃఖ వార్త వీనులఁబడ దశరథుఁడు క్రుంగి క్రుంగి శీఘ్రకాలముననే మృతిఁజెందెను. మేనమామయింటి కేగియుండిన భరతుఁడయో ధ్యకువచ్చి జరిగిన వృత్తాంతమరసి తల్లికడ నిలిచి యిట్లనియె.

"పాపినీ! ఎంత పాపమును కొడిగట్టితివి! నాకంటె రాముఁడు నీకేవిధమునఁ దక్కువయ్యె? అతఁడు నీకేమి తె గ్గొనరించె? నీ కడుపునఁ బుట్టినంతమాత్రమున నాకు నీకున్న చెనఁటిగొనములు పట్టువడు ననుకొంటివే? తండ్రికి మాఱు తండ్రియగు శ్రీరామచంద్రుని, నాప్రత్యక్షదేవుని, సకలసద్గు ణ గరిష్ఠుని, మునివృత్తిని గానకంపి, నీ మగని జంపి, నీవేమి వారుకొన నెంచితివి? రాముఁ డతి శాంతమూర్తి గావున

నీ మాటకు యొడంబడక పోక తల్లివని యెంచి కొలుసేవలకు నడచె. లక్ష్మణుండైన నీకుత్సిత మెఱింగి యేల నీతల దెగ నఱకఁడయ్యె? కులవినాశినీ! నా ప్రేమైక నిధాన మగు రాముఁ డడవుల నిడుములు పడుచుండ నేనిటఁ బట్టము గట్టుకొని సుఖింతుననుకొంటివా? క్రూరాత్మురాలవగు నీ కడుపు మండునట్లుగ రాముని సింహాసనమున నిలిపి మునివేషమునఁ బదునాలుగేండ్లడవులలో నేనే సంచరించెద”

అంత భరతుఁడు దశరథునకుఁ బారలౌకిక క్రియలు నెఱవేర్చి సర్వసేనలతో బయలుదేఱి రాముని వెదకుచుఁబోయెను. అటఁ జిత్రకూట పర్వతమునఁ బర్ణశాల నిర్మించుకొని సీతా లక్ష్మణులతో నివసించుచుండిన రాముఁ డొకనాఁడొక కలకలము విని కారణమరసి రమ్మని లక్ష్మణు నంపెను. లక్ష్మణుఁ డొక తరువరము నెక్కి వచ్చుచుండిన సేన నీక్షించి “అన్నా! మోసము వచ్చినది. లెమ్ము. లెమ్ము. విల్లెక్కుపెట్టి సిద్ధముగ నుండుము. భరతుఁడు సకలసేనలతో మన మీఁదికెత్తి వచ్చుచున్నాఁడు. ఆలసింపఁదగదు. నా కుత్తర మిమ్ము. నా బాణపుమొన కఠినమైనదియో భరతుని జోము కఠినమైనదియో కనుగొందుఁగాక” యనుచుండ రాముఁడు వారించి ‘నాయనా! భరతుఁడు నీకంటెను నాకుఁ గూర్చువాఁడు. నీవంటి యాత్రగాఁడుకాఁడు. తొందఱపడకుము’ అని వారించె. అంత భరతుఁడు రాముని సమీ

పించెను. రాజ్యము గైకొమ్మని పలువిధములఁ బ్రార్థించెను. తల్లిదండ్రులమాట దబ్బఱ గావించి యీరాజ్యముం గైకొనఁజాలనని రాముఁడు భరతుని మాట త్రోసిపుచ్చెను. తుదకు భరతుఁడు చేయునదిలేక, అన్నమాట జవదాఁటఁజాలక రాముని పాదుకలఁ గొని, యయోధ్యకుఁ బోనొల్లక నంది గ్రామంబునఁ బాదుకలకుఁ బట్టాభిషేకము చేసి, తాను రామునివలె జడలుదాలిచి, నారచీరలుగట్టి, దర్భలపైఁ బరుండుచుఁ గాయలు దుంపలు దినుచుఁ, బాదుకలకుఁ బ్రతినిధియై పదునాలుగేండ్లు గడపెను.

తే. గీ. రాఘవుల సోదర ప్రేమఁ ♦ రహిని నెంచి
పాండవుల సోదర ప్రేమఁ ♦ బరిగణించి
యన్నదమ్ము లన్యోన్య ప్రి ♦ యంబు మీఱ
వర్తిలిన నంతకన్నను ♦ స్వర్గమున్నె?

## [illegible]. పొగరు తగదు

క. కుల, మాచారము, ధనమును,
విలసిత విద్యయును, రాజ్య ♦ విభవము, రూపం,
బెలఁ బ్రాయముఁ, దపమును, వ
ర్ధిలఁజేయును మదమునంద్రు ♦ స్థిర విద్యార్థీ!

అన్నివిధముల సౌఖ్యము లొకచో నుండెనేని దానిని విభవమందురు. అట్టి విభవములలో మహేంద్ర విభవము

గొప్పది. మన పూర్వపు రాజు మహేంద్రవైభవము కోరి యాగములు చేసెడువారు. సుఖములఁ గోరనివా రెవ్వరు? మహేంద్రునకు శతక్రతువని పేరు. అనఁగా నూఱుయాగములు చేసినవాఁ డని యర్థము. అట్లు చేసినవా రెల్ల నొకరి వెనుక నొకరుగ నింద్రులయ్యెదరని మనవారి నమ్మకము.

స్వర్గము, మర్త్యము, పాతాళమను మూఁడులోకములకు నింద్రుఁ డధిపతి. స్వర్గలోకమున నమరావతీ పట్టణమతని ముఖ్యపట్టణము. అతని కొలువుకూటమునకు సుధర్మమని పేరు. వాహనములు, నాలుగు దంతములు గలదియుఁ దెల్లనిదియుఁ బ్రసిద్ధి కెక్కినదియు నగు నైరావత మను పేరి యేనుఁగును, ఉచ్చైశ్శ్రవమను గుఱ్ఱమును ఇవి రెండును పాలసంద్రమునఁ బుట్టినవి. సభికులు దేవతలును ఋషులును, ఆచార్యుఁడు గురువని ప్రసిద్ధిచెందిన బృహస్పతి, సామంతులు దిక్పాలకులు, కోరినవెల్ల నొసఁగు చింతామణియుఁ గామధేనువు నతనికిఁ గలవు. వనము నందన వనము. అందు వాడని పూవులుగలిగి కోర్కెలొసఁగూర్చు పారిజాతము, మందారము, సంతానము, హరిచందనము, కల్పకమునను వృక్షములు గలవు. గాయకులు గంధర్వులు. నటులు రంభాదులు. ఇట్టి వైభవమును కోరనివా రెవ్వరుందురు?

పూర్వ మొకప్పుడు నహుషుఁడను రాజు నూ ఱశ్వమేధయాగములు చేసి యింద్రపదవి నధిష్ఠించెను. తనకు

మించినవారీ ప్రపంచమున నెవ్వరును లేరని యూతనికి గర్వ మతిశయించెను. గర్వముగలవారలకు మంచిచెడ్డలు తెలియ రావు. నే నింద్రుండ నైనప్పుడు నా కందఱు లోఁబడినవారలే కదా యని మునులను దన పల్లకిమోయ నాజ్ఞాపించెను. వా రోపికతో మోయుచుండఁ దొందఱచేయు నారంభించెను. 'నేను మహేంద్రుఁడను ఇంద్రుని సర్వస్వము నా యధీన మైనది. ఇంద్రుని భార్యయగు శచియు నాయదియె. కాన శచీదేవి యంతఃపురమునకుఁ బల్లకిఁగొని పొం' డనెను. అగస్త్యుఁ డా త్రోవ నెదురయ్యె. అతనిఁగని నహుషుఁడు పాముపామని నవ్వులాడె. ఆ తాపసి వాని దుర్బుద్ధికిం గినిసి "ఓరి దురాత్మా! నీ కింద్రపదవి వచ్చినంతనే కన్నులు గానవయ్యె. నీ యట్టి మదాంధుఁ డింద్రపదవికిఁ దగఁడు. దీర్ఘకాలము భూలోకమున పామువై పడియుండు" మని శపించె.

ఆ. వె. ఎట్టివానికైన ♦ నెంత యైశ్వర్యంబు
వడసియైన గర్వ ♦ పడఁగరాదు
మిన్ను మన్ను గనక ♦ మున్ను నహుషుఁడు చెడెఁ
బొగరుబోతుఁదనము ♦ తగదు తగదు.



## 5. పెద్దలమాట వినవలయును

ఒక గ్రామమున నొక ధనికునకు నిద్దఱు కుమారు లుండిరి. వారు బడికిఁబోయి చదివి యింటికి వచ్చినప్పుడు

తండ్రి వారికిఁ గొన్ని నీతులు బోధించుచుండెను. వానిలోని సారాంశ మిది.

(1) పెద్దలమాట వినవలయును.

(2) విని నమ్మి యా రీతిని బ్రవర్తింపవలయును.

(3) వర్ణాశ్రమ ధర్మముల నతిక్రమింపరాదు.

(4) బయటనుండి యింటికి వచ్చునపుడెల్ల నేదే నొకటి తేవలయును.

బ్రహ్మ చతుర్ముఖములనుండి బయలువెడలినట్టి నాలుగు వేదములవలె నీనాలుగు వాక్యములా జనకుని నోటినుండి మాటిమాటికి బాలురకై బయలువెడలుచుండెను. తాను ధనికుఁడును, సత్కీర్తిమంతుఁడు నగుటకుఁగూడ నీచతుస్సూత్రములే మూలకారణములని తన యనుభవమునుగూడ నప్పుడప్పుడు వెల్లడించుచుండెను. కాని బాలుర కవి యెంత మాత్రము మొదటఁ బట్టినవి?

జ్యేష్ఠపుత్రుఁడు పాశ్చాత్య నాగరకతా వ్యామోహమునఁబడిఁ తండ్రిమాట క్రమక్రమముగఁ బెడచెవిఁ బెట్టుచు వచ్చెను. మొదటఁ గత్తిరింత తలయై పదపడి (Suit boot Hat) నిజారులు, నింగ్లీషుజోళ్ళు, వెడలుపు టోపీ లావశ్యకములై, (Social club) యనంతరము సర్వ జాత్యభేద సమ్మేట సభ తా స్వీకారమై, తండ్రికిఁ దలకంటగింత దెచ్చుచుండెను. తండ్రి పూర్వాచార పరాయణతకుఁ గుమారుని

నవ నాగరకతకు నుప్పు నిప్పునకుంబోలె నభివృద్ధికయగుచుండె
ను. కుమారుఁ డింటికి వచ్చుట నీచమనియు, నింగ్లీషురాని
తండ్రిని దండ్రియని చెప్పికొనుట తనవంటి వాని కత్యవమా
నమనియుఁ దలంచి స్వెన్సరువారి యన్నసత్రములలోఁ దిను
చుఁ బైకముకొఱకు మాటిమాటికిఁ దండ్రికి జాబులు వ్రాయు
చుఁ బట్టణవాసియై యుండెను. విద్యార్థులారా! ఇతఁడాం
గ్లేయ విద్యయందు దారి తేలెనని యెన్నఁబోయెదరు సుఁడీ!
తండ్రిమాటలు వీనులకు వినరానప్పు డుపాధ్యాయుల వాక్య
మెట్లు విన శక్యమగును? ఉద్యోగమా లేకపొయ్యె. తండ్రికా
పనికిరాఁడయె.

ఇంక రెండవవానిఁగూర్చి విచారింతము.

ఇతఁడు తల్లిదండ్రులకు మిగుల గారాబుపట్టియైనను
గారాని గుణము లితనికిఁ బట్టువడలేదు. వేళతప్పక బడికేగి
చదువుకొనుచుఁ దదితర సమయములయందుఁ దల్లిదండ్రులు
చెప్పిన పద్ధతుల నతిక్రమింపక నడచుకొనుచుండెను. ప్రతి
దినము నెటకేగినయు వెడలి యిలుసేరునపు డేదియో యొకటి
తెచ్చుచుండువాఁడు. ఒకనాఁడతఁడు పొలమునకేగి యింటికి
మరలునపుడేదియు దొరకక, కడకొక కట్టెపుల్లయైనఁ గనఁబ
డకపోవుటచే, వట్టిచేతులతోఁ బోరాదను స్థిరబుద్ధిగలిగినవాఁ
డగుటచే మార్గమధ్యమునఁ జచ్చిపడియుండిన నొకసర్పశవము
నీడ్చికొని వచ్చి పెరటికి ప్రక్కనుండు కట్టెలపోవుపై దానిఁ
బడవైచి యింటిలోనికేగి తనపనిమీఁద నుండెను.

నాఁటి సాయంకాలమున వాడుకచొప్పున నతఁడు తన కార్యములెల్లఁ దీర్చి కొప్పుఁజెప్పఁగనుఁ భామ సంగతియు బయలుపడ్డెను. తీర్చి చూలికపట్టి పెరటిలోఁబోయి చూడఁగ నచ్చటఁగన్నులు మిఱుమిట్లు గొలుపు నొక రత్నహారముండెను. పాముకనఁబడలేదు. వారు దైవభక్తులు కావున నది భగవత్కృపయనుచు సంతసించి దానిఁగైకొనిరి.

బాలికలారా! పామెట్లు రత్నహారమయ్యెనో మీ రెఱుఁగుదురా? ఒక కోటీశ్వరుఁడు తనయొక్క స్నానముచేయుతఱిఁ దన హారమునుదీసి యవల నుంచఁ బడ్డాని నాహారవస్తు భ్రాంతిచే నొక గ్రద్ద గ్రహించి యాకసమున నేగుచుఁ గట్టెలమోపుపైఁబడి యుండిన సర్పశవమును గాంచి హారమునటవదలి సర్పముం గొనిపోయెను.

క. మనపెద్దలేది చెప్పిన
మనమేలునకంచు నెంచి ♦ మహితమనమునన్
బొనరించు నతఁడె కనుఁ బ్ర
ఖ్యాతియు మంగళంబు ♦ పృథువిద్యార్థీ!

## అధికాశ ఆపదలకు మూలము.

పాంచాల వంశీయుఁడగు సృంజయుఁడను రాజునకు ధనాశమెండుగ నుండెను. బహువిధములగు నూహాలచే నతని మది పలుపోకలుపోవుచు నెప్పటికి నిండని తుద బుద్ధ

మ లేని యూశా సముద్రమునఁ దరంగ ప్రాయము లగుచుం డెను. కట్టకడ కతఁడొక నిశ్చయముచేసికొని దేవునింగూర్చి తపంబుచేసి యతనిచే నిష్టవరముం గొనివచ్చెను. అతని కో కమేరకుఁ గొన్నాళ్లకొక కుమారుఁడు గలిగెను. ఆతనయుని యుమి, చెమట, మలమూత్రములు ఇది యది యననేల? ఆతని దేహమునుండి బయలువడు సర్వము స్వర్ణ మగుచుం డెను. ఇఁక నతని కేమితక్కువ! సృంజయుండు మహదా నందంబునఁ గొమరునకు సార్థకముగ సువర్ణష్ఠీవియని పేరిడి చేటలు పొరకలు మొదలగు గృహోపకరణములనుండి గోడ లు, ద్వారబంధములు కిటికీలతో సింహాసనమువఱకు సమస్త ముఁ గనకమయముగఁ జేసివైచెను.

అది గని సమీపప్రభువులకెల్లఁ గడు పుబ్బసాగెను. చోరులకు నచ్చటనే కన్నుపడెను. ఒకనాఁడు చోరులు కొం దఱు రాజగృహమును దోఁచిన లాభము లేదని సువర్ణష్ఠీవినే ముచ్చిలి యటవికిఁ గొనిపోయి తెలివితక్కువచే నొకసారిగ వానియందున్న సర్వస్వర్ణముఁ గొన నిశ్చయించి వాని కడు పంజీల్చిచూచి యేమియుఁగానక నిరాశతో బిక్కమొగము తో నా శవము నటఁ బాఱవైచి పోయిరి. సృంజయుండు ఆ చటినాఁడు తెల్లవాఱుకడ సువర్ణష్ఠీవిం గానక పరివార ముచే వెదకించుచుఁ దాను వెదకుచుఁ బోయి పోయి కట్ట డకు నట్టడవిఁ జచ్చిపడియున్న కుమారుం గాంచి పలువిలఁ

గులఁ బలవించి తుదకుఁ జేయునది లేక పట్టణమున కరుదెంచు నంతలో చుట్టుప్రక్కల రాజులు రాజ్యమును స్వాధీనపఱచు కొనియుండిరి. పిదపఁ జాలకాలము సృంజయుఁడు దేవురించు చుండ నెప్పటియట్ల నారదుఁ డనుగ్రహించె.

ఇట్టిదే యగు బంగారు బాతు కథ మీ రెఱిఁగియే యుందురు.

ఆ. వె. అరయ నవరికేని ♦ యత్యాశకూడదు
కలుగుదానఁ దృప్తిఁ ♦ గనుట మేలు
సృంజయుండు చోరు ♦ లేమైరి? యధికాశ
యాపదలకు మూల ♦ మండ్రు బుధులు.

## 7. సత్యము పలుకుము

పాటలీపుత్రమును ధర్మవర్ధనుఁడను రాజు తన పేరు సార్థకమగునట్లు పాలించుచుండెను. లోకవ్యవహారములఁ గని పెట్టుటకును, తనయెడ న్యాయ్యలోపము గలిగినయెడ దానిఁ బ్రజలముఖముగ విని సవరించుకొనవచ్చుననియు నుద్దేశముతోను నప్పుడప్పు డతఁడు మాఱువేసమునఁ బురమున సంచరించుచుండువాఁడు. ఒకనాఁటి రాత్రి యట్లతఁడు సన్న్యాసివేషమునఁ దిరుగుచుండు సమయమున నొక దొంగ యెదుర్పడి నమస్కరించెను. నీవెవ్వఁడవని రాజడిగెను. సన్న్యాసుల యె

కుటఁ గల్లలాడిన మొదటికి మోసమువచ్చునని యో యితని తోఁ జెప్పినంతమాత్రమున రాఁగల నష్ట కష్టములుం లేవని యో యేమో కాని "నేను దొంగ" నని యాతఁడు నిజము చెప్పెను. "నీవు దొంగతన మేల చేయుచున్నాఁడ" వని ప్రభు వడుగ "నావృత్తి యిది" యని చోరుఁడు ప్రత్యుత్తరమిచ్చె. "ఇది పాతక కార్యముగదా! ఏల వదలరాదు?" అని నృపా లుఁడు ప్రశ్నింప "వేఱుమార్గములే"దని హర్త బదులుపలికె. "పోనిమ్ము. నాకేల నమస్కరించితివి?" వని కపట యతి పృచ్ఛింప "మీరు శుభమస్తని దీవింతురు. దానిచే నేఁడు మంచి లాభము పొందవచ్చునని యట్లొనరించితి" ననియె. "సరి. అట్లే దీవించెదను. నాకేమి గురుదక్షిణ నిచ్చెద" వని విభుడనఁ, "చోరత్వము దక్కఁ దక్కిన దేదియడిగిన నిచ్చెద" నని దస్యుఁడు నుడివె.

రాజు కొంతసేపాలోచించి "నీయసత్యము నాకొసఁగుము. దీనిచేఁ నీకు నష్టము లేదుగదా!" యనుడు "నట్లే" యని స్తేనుండు ప్రమాణ మొనర్చి ప్రణామంబొనర్చి తనదారిం బో నుద్యమించె. నరపతి యతని నిలిపి "యీ పట్టణమున రాజుగారింటి ముందు రత్నము లున్నవి. నేను దివ్య దృష్టిం దృష్టించితి. వానిం గొని తెమ్ము. నాకు సగమి" మ్మన దొంగ వల్లెయని రాజు కోశాగారమునకుఁ గన్నమిడి లోనఁ ప్రవేశించి సన్న్యాసి చెప్పినచోట నా రత్నములుండుటం గాంచి

వెల్లడించి తనయొద్దనున్న రత్నమచ్చుటనుండి మూఁడవ రత్నమునకు దొంగయెవ్వఁడని సభ్యులనడిగెను. ఒకరిమొగ మొకరుచూచిరి. కడకందఱ దృష్టి మంత్రిపైకి మరలెను. మంత్రిని బరిశోధింప నతనియొద్ద మూఁడవరత్న మగపడెను. రాజు తక్షణమున వానిని పదవినుండి తొలఁగించి చోరునకొక యున్నతోద్యోగ మొసఁగెను. అతఁడు కొన్నాళ్ళకు సత్యము నూఁతఁగాఁగొని సర్వసద్గుణ సంపన్నుఁడై ముఖ్యమంత్రి యయ్యెను.

ఆ-వె॥ సత్యమొకటెనిలువ ♦ సర్వసద్గుణములు
వచ్చినిలుచుఁగావె ♦ వరుసమీఱ
దుర్గుణంబొకండు ♦ దొరకొన నొకనికి
నన్నిసద్గుణంబు ♦ లడఁగిపోవు.

## 8. విద్యార్థి ధర్మములు

ప్రతి మనుజుఁడు జ్ఞానసంపాదనమునకై చదువు టావశ్యకము. విద్యలేనివాని వింతపశువని చెప్పుదురు. మొట్టమొ బాల్యమున శ్రద్ధతోఁ జదివికొనక సోమరులై యాటపాటల మరఁగి పెద్దవారైన పిదపఁ జదువుచదువు ఫలితమీయక పోవచ్చును. వంటపెట్టి యింటఁబోసికొనని వాఁడాఁకలి గొన్నప్పుడు విస్తరిన పడి వాని నాఁటిమూఁకటిఁ దీర్పఁగల

దా? ఇల్లంటుకొన్నప్పుడు నూతిం ద్రవ్వం బూనిన నా నూతి నీటితో నాయింటి నార్పశక్యమా? కావున బాల్యమందే విద్య నభ్యసింపవలయును. సద్విద్య పట్టుపడుటకుం గొన్ని పద్ధతుల నున్నవలంబింపవలయును.

1. వేళతప్పక బడికిం బోవలయును.

తనకొఱకు కితరవిద్యార్థులు వేచియుండునట్లు తనకే కొంతపాఠము నష్టమగునట్లో పోరాదు.

2. పాఠశాలలో నుపాధ్యాయులకు ముందుగ వందన మాచరించి దైవప్రార్థన గావించి తరగతిలో నిశ్శబ్దముగం గూర్చుండవలయును. ఉపాధ్యాయులకుం దలనొప్పి విసుంగు గలుగునట్టు లల్లరి చేయరాదు.

3. ఉపాధ్యాయుండు చెప్పు విషయమునందే మనసు నిలిపి వినవలయును. పరధ్యానముతోనుండి దూఱినదా యనంగా దోంక మాత్రము దూఱలేదను లోకోక్తికి గుఱి కారాదు. మనస్సచ్చట నిలుపకపోయినచో బడికిం బోయియు నిష్ప్రయోజనమే.

4. గురువుచెప్పినది మన మేలుకొఱకే యని దృఢముగ నమ్మ వలయు.

క॥ ఒకటిచదువు రెండడంకువ

ప్రకటితముగ ముందు తెలివి ♦ భావభావ

ప్రకటనాలు గండుస

మిక్కచతురులుగా వలయుఁ జు ♦ మీ విద్యార్థి!

అః విద్యార్థి శతకమునఁ జెప్పఁబడినది. గురువు 'ఓ' యని యొక యక్షరము వ్రాసినపుడు శిష్యుఁ డది 'ఓ' కాదు 'న' యన్నచో వానికి విద్య రాఁగలదా?

5. ఎఱిఁగినవానివలె నెకసక్కెముగా గురుని ప్రశ్నింపరాదు. ప్రశ్నించుట సులభము. ఉత్తరమిచ్చుట కష్టము. అది బాలుర తలకెక్కుట కష్టతరము. ఆతరగతి బాలురశక్తికి యోగ్యతకుఁ దగిన విషయమే యుపాధ్యాయుఁడు చెప్పును.

6. తెలిసికొన్న విషయమును మరల నింట మననము చేయవలయును. అప్పుడేదేని యందు సందియముదయించిన మఱునాఁడడిగి తెలిసికొనవలయును. గురుఁడు చెప్పినంతసేపు విని పదపడి యుపాఠము వచ్చునాఁటికిఁ జింతింపక యొకచెవిలోఁ జొనిపి యొకచెవిలోఁ దిసివేయరాదు.

7. తరగతిబాలురతోడను, దదితరబాలురతోడను నైకమత్యముగలిగి యుండవలయును.

ఐకమత్యమున్నచోఁ దాను మఱచిన విషయములఁ దోడిబాలుర నడిగి తెలిసికొనవచ్చును. ఎదుటివానికి నాలుగు గుణము (మార్కు) లెక్కువ వచ్చెనని యసూయతో వానితో విరోధించుటకంటె నెక్కువ శ్రద్ధగొని చదివి చదువున వానిని మీఱుట మంచిది.

8. సమబుద్ధి, సాధుసేవ, మంచినడవడి, శాంతము త్రికరణశుద్ధి, సత్యవాక్యము వినయముగలిగి యుండవలయును సమబుద్ధికి నేడ సమర్ధతిం జూపుము. సాధుసేవవలన విద్యను గ్రహింపఁగలము. మంచినడవడి లేకున్నచో సాధువులు చేర్పరు శాంతమున్నచో విద్యపరిపూర్తి నొందఁగలదు ఓర్పు లేక నేర్చినవిద్య యెన్నటికి నలవడదు. మనస్సు, వాక్కు, కాయము అను నీమూఁటి నొకమార్గమునఁ బోనిచ్చుటయే త్రికరణశుద్ధి యనంబడు. వీనిలోనొకటి వికటమైనచో నద్ది కపటమునాఁబడు. సత్యమే పలుకవలయును. సత్యమువలన గలిగిన ఫలమును మునుపటి పాఠమునఁ దెలిసికొంటిమి. వినయము విద్యగలవానికి భూషణము. అదిలేక వానివిద్య ప్రకాశింపదు.

9. విద్యాగర్వము కూడదు.

విద్యావంతుఁడు కల్పవృక్షమువంటి వాఁడు. వానియొద్ద బలువురు వత్తురు. నీకిపోదవంటి గర్వము వాని నావరించియుండినచో నెవ్వరు సమీపింపరు. విద్య యుండియుఁ బ్రయోజనము గలుగదు. ఆవిద్య యడవింగాచిన వెన్నెలవంటిదగు.

10. కాలమువిలువ నెఱిఁగి నిముసమైన వ్యర్థపఱుపకుండవలయు. వ్యర్థముగాఁ గడచిన యొక త్రుటియైనను మన కెన్నఁటికిని దిరిగిరాదు.

11. మృదువుగ మాటలాడవలయును.

మార్దవమునకు మంచివారు చెడ్డవారు కూడ వశ్యులగుదురు. దారుణము, సదారుణము నగును. విజయమును జేకూర్చుటలో దీనికి సమమగు సాధనము మఱొండు లేదు.

12. మాతా పితృ గురు దైవభక్తి కలిగియుండవలయును.

మనము జననమున కాధారభూతయగు తల్లిని గొలుచుచు, వృద్ధికిఁ గారకుఁడగు తండ్రికి వినమితులమై, జ్ఞానదాతయగు గురుని సేవించుచు నుత్తమమగు మానవవేషమిచ్చి సర్వాంగములఁ గొఱతలేక కల్పించి ప్రపంచరంగమునకుఁ బంపిన జగన్నాటక సూత్రధారుని యాజ్ఞానుసారము వర్తించి ప్రేక్షక లోకమునఁ గీర్తిం బడసి పవిత్ర జనులమై యతని సన్నిధిం జేరవలయును.

# 9. శ్రద్ధకొలఁది విద్య

దుష్టకార్యముగాని దుష్టసహవాసముగాని శీఘ్రముగా నొనఁగూడును. సత్సహవాసము క్రమముగఁగాని యలవడదు. సత్కార్య మెన్నో విఘ్నములకు లోనై యుండుండి తుదిముట్టుట దుర్లభము. పైరుపెట్టుట కష్టము. కాల మోర్చియుండవలయును. పాడుచేయుట సులభము. ఉన్నతపదవి యారయుట ప్రయాసకరము. అధోగతి యతి సులభము. సత్కీర్తి

చాలకాలమునకుఁ గాని రాదు. అప త్రి క్షణమాత్రమున సంపాదింపవచ్చును. సద్విద్యా సంపాదనము సంవత్సరముల కొలఁది శ్రద్ధతోఁ బాటుపడినఁగాని రాదు.

పూర్వము గురుకులవాసము చేసి విద్య నభ్యసించుకాలమున నొక బీదబాలుఁడు చంద్రచూడుఁ డనువాఁడు విద్యార్థియై కా ప ణమున నొకగురువు నాశ్రయించెను. వానికిఁ గల శ్రద్ధ యింతయంత కాదు. గురుఁడు నిద్దుర లేవకమున్నే లేచి కాలకృత్యముల నిర్వర్తించి పాఠములు చింతన చేసికొని గురునాజ్ఞ కెదురు చూచుచుండును. గురుశుశ్రూషల యందింతమాత్ర మనస్యావము వాఁడు కాఁడు. తనకు గురువు గృహసంబంధ కార్యములఁ జేయ నాజ్ఞాపించినప్పుడు దక్షుఁడ దక్షిణ సమయములం దెల్ల విధివిరామము లేక చదువుచుండును. తా నెప్పుడు నిదురించునో యెవ్వరెఱుఁగరు. "విద్యాతురాణాం నసుఖంననిద్రా" యనుట వానియెడ నెంతయునొప్పె.

వాని శ్రద్ధ యెట్టిదో కనిపెట్టనెంచి యొజ్జ తన భార్యతో నా శిష్యున కన్నము పెట్టునపుడు నేతికిమాఱుగ వేప చమురు వడ్డింపుమనియెను. ఆమెయు నట్టు లొనర్చెను. చంద్రచూడున కది చేదుగఁ దోఁపలేదు. ప్రతిదిన మట్లే చేయుచుండిరి. రుచులపై మనసు లేని విద్యాభిలాషి కది తెలియదయ్యె. గురువు నిదురించు వఱకుఁ గాళులొత్తుచుండి నిదురించినపిదపఁ జదువుచుండు చంద్రచూడునితో నొకనాఁడు

గురుఁడు, "నాకు నిద్రాభంగమగుచున్నది. ఇచ్చటఁ జదువవల" దనెను. అది మొదలు విద్యార్థి యాయూర నెవ్వరియింట దీపమున్న నచ్చటఁ గూర్చుండి చదువుచుండెను. రేయెల్ల నిద్దుర పోనీయఁడని యెవ్వరును దమ యిండ్ల కతని రానీయరైరి.

ఒకనాఁ డతఁ డూరెల్లఁ గలయఁ దిరిగి యెవ్వరును వెలుతురు సైతము పొడసూపనీక తలుపులు బిగించియుంటచే నూరిబయట నొక వెలుఁగుం గాంచి యచటి కేగి యది శ్మశానభూమి యనియుఁ, గాలుచున్నది శవమనియు గమనింపక యచ్చటఁ గూర్చుండి చదువుచుండెను. అంతఁ గొంతసేపటికి సరస్వతి వానిసమీపమున నిలిచి 'నాయనా' యని పలుకరించెను. "నన్ను జదువనీక శ్మశానమునకు సైతము వెన్నంటి వచ్చిన విఘ్నకారిణీ! నీ వెవతవు? నాతో నీకేమి పని?" యని తలయెత్తకయే యతఁడడిగెను. 'వత్సా! నీశ్రద్ధకు సంతసించి నిన్ననుగ్రహింప వచ్చిన చదువుల వెలంది' యని యయ్యమ నొడివెను. తటాలున నతఁడు లేచి వలగొని పలుతెఱఁగుల స్తుతియింప నిర్ధూతనిద్రు నిరీక్షించి పాణితలంబున నొడలెల్లఁ దడవి సర్వవిద్యావిశారదునిగ ననుగ్రహించి శారద యంతర్ధానగతయయ్యె. తదనంతర మాచంద్రచూడుఁడు గురుగృహంబున కేగి నిదురించెను.

మఱునాఁడు ప్రొద్దెక్కిన పిదపఁ గూడఁ జంద్రచూడుఁడు లేవకుంటఁగని గురుండు 'నేఁడేదో విశేషము' జరిగినది.

లేకున్న నిద్రయనునదియే లేని వీనికింత గాఢనిద్ర పట్టుటెక డ?' యని భార్య జూచి వీఁడు లేచువఱకు లేపక, లేచినపి ట మునుపటివలె నన్నము వడ్డించి యట జరుగు విశేషము నా కెఱింగింపుమని యానతిచ్చి తన పనిమీఁదఁ దా నే ఆనాఁడెల్ల విదురించి మఱునాఁడపరాహ్ణమునకు లేచి "యెం యాలస్యముగ లేచితి? ఎంత యపచార మొనరించితి? గురు కుపచరింపక యెంత మందమతినై నిదురించితి?" నని లే చంద్రచూడునింగని దేశికుండు, "కుమారా! చింతింపకుము మించినదానికి వగవకుము. నీ నిత్యకృత్యముల నిర్వర్తించి కొని భుజించి మఱిర" మ్మని పంపెను. అతఁడు క్రమముగ దన కార్యముల నెఱవేర్చికొని భుజింపఁగూర్చుండెను.

గురుభార్య యన్నము వడ్డించి వేఁపచముఱుపోసి ఒక్కకడి నోటనుంచికొని, "అమ్మా! మిక్కిలి చేదు. తినఁ జాలనే!" అని చంద్రచూడుఁడు క్రింగలేక వమనముచేసె. ఆవల నామె యాయన్నముం బాఱనేసి యించి వేఱన్నమిడ భుజించి గురునికడ నిలిచె. గురుండును నాఁటిరాత్రి జరిగిన వృత్తాంతము నరసి సంతసించె.

మన విద్యార్థులకీ సందర్భమున నింకొక చిన్న హెచ్చ రిక గావలయు. అది క్రింది పద్యమునఁ గలదు.

క॥ ఎందఱు నీకు గురువు? లవ
నెందఱో నెలనెలకుమాటి ♦ యెందో పోఁగా
నందొకరిఁ జెప్పనెటులగు
నందువె? మది నొకని నిల్పు ♦ మా విద్యార్థీ!

## పరులకైనవమానింపరాదు

పాండవు లరణ్యావాసము చేయుకాలమున నొకనాఁడు దుర్యోధనుఁడు దుష్టచతుష్టయముతోఁ గొలువుండి "పాండవులు ప్రాణములతో నున్నంతదాఁక నామదికి నెమ్మది యెక్కడిది?" యనియె. అయిన నిప్పుడ సర్వసైన్యములతో వెడలి వారిం బరిమార్తమని కర్ణుండనియె. అదియు మంచిదని దుశ్శాసనుండు సమ్మతించె. వారసాధ్యులు. ఆలోచించి చేయుట యొప్పునని సైంధవుండు నుడివె. మున్ను జూదంబునఁగాదె సర్వము హరించితిమి. కానలకంపితిమి. ఇప్పుడును గపటోపాయంబునఁ బగర నిర్జించుట కర్జంబని శకుని తనయనుభవంబుఁ దెలుప, సుయోధనుండు శకుని మార్గంబునకుఁ దలయూఁచె. అదియెఱిఁగి కర్ణుఁడు "కౌరవేంద్రా! పాండవులిప్పుడు ద్వైతవనసరోవరసమీపంబునఁ బరమ దుఃఖార్తులై నారచీరలుగట్టి కూరలు గుడిచి తలలు జడలు ముడిచికొని పోషఁ దముఁ దాము నిందించుకొనుచుఁ బరితప్తహృదయులై

యున్నవారు. నీవు నీ దేవులతోడ సమస్తవైభవములతో మెఱసి పగర కన్నులు కమర నగవదగును.

తే॥ గీ॥ అతుల సౌభాగ్య భోగ స ♦ మగ్రమహిమ
నొప్పుచున్న నీ దేవుల ♦ యొప్పుచూచి
ధృతి దఱిఁగి తన్నుఁ దాన నిం ♦ దించుకొనుచు
హృదయమునఁ బాండవాంగన ♦ యెరియవలదె?

నీ విభవంబుచూచి హృదయంబులు క్రుళ్లి క్రుళ్లి లో లో నొగిలి నొగిలి ఖిన్నులై యింతకన్నఁ జావు మేలని వారు తమ ప్రాణంబులు వదల వలదె? కాని మీ తండ్రి మన పయనంబు సమ్మతింపఁడు. ఉపాయంబునఁగాని యాతని యనుజ్ఞఁ బడయఁజాల" మని వాక్రువ్వ, సుయోధనుండు కర్ణుని మెచ్చి ద్వైతవనంబున నున్న గోవ్రాతమును రక్షింప నవసరము వచ్చినని యొక గోపాలకునిచే జనకునకుఁ జెప్పించి యనుజ్ఞఁ గొనఁగోరె.

ధృతరాష్ట్రుఁడు "నాయనా! పాండవులు మీచేఁ గడుంగడు నొచ్చి యటనున్నవారు. ఎటుపోయి యెటువచ్చునో? ఎచ్చరికగలిగి మీ కార్యము చూచుకొని వారి కెంత మాత్ర మపకారము మదినైన దలఁపక విచ్చేయుఁ" డన వల్లె యని గాంధారేయుఁ డందఱకును ఘోషయాత్ర యని పురమునఁ జాటింపించి మఱునాఁడు పయనము సాగించె. ఎనిమిది వేల రథములు, ముప్పదివేల యేనుంగులు, తొంబదివేల

త్రములు, లతు కాల్బలము తన్నుఁ బరివేష్టించిరా రారాజు ైతవనంబు సొచ్చి వేఁటలాడుచుఁబోయి పోయి ధర్మరాజా ున్న స్థలంబెఱింగి యొకసరోవర సమీపంబునఁ గ్రీడా ూంబులు నిర్మింప భృత్యుల కనుజ్ఞనొసంగె.

వారట్లు నిర్మించుచుండ నింద్రునాజ్ఞగొని గంధర్వులే ని వలదని వారించుచు, ఇది మాప్రభుండగు చిత్రసేనున క్రీడార్థంబుగ సంకల్పింపఁబడిన స్థలము. మీరు తొలఁ సమంజసమని బెదరించి మగిడించిరి. సుయోధనుఁ డది కోపించి గంధర్వులతో యుద్ధంబునకుఁ బూనె. గంధ రకుఁ గౌరవులకు ఘోర సంగరంబయ్యె. చిత్రసేనుని కోల్త డి కర్ణుఁడు విరథుండై వికర్ణుని రథంబెక్కి రణభూమికిం ంగె. దుర్యోధనుండు తొలంగక నిలిచి పెనంగఁ జిత్ర ండు వానిరథంబు నుగ్గుసేసి సిగఁబట్టి లాగి నేలంబడవైచి త్రెక్కులు విఱియఁ దన తేరికిఁగట్టె. తక్కిన గంధర్వులు ర్యోధనుని తమ్ములను దనూభవులను నమాత్యులను ంను బట్టి బంధించి తెచ్చి తమ ప్రభున కొప్పగించిరి.

చెల్లాచెదరై పాఱిపోయినవారు కొందఱు సమీప మున్న ధర్మరాజుకడ కేగి యతని పాదములంబడి సుయో ముల విడిపింప బతిమాలిరి. మనపని గంధర్వులే తీర్చిరి. లఁ జులకన యయ్యెనని భీమసేనుండు పలుకుచుండ ధర్మ "అన్నా! అట్లనుట యుచితముగాదు. ఏకవంశజాతుల

కొకొక్కప్పు డొప్పులు సంఘటిల్లినను సహజస్నేహంబు విడనాడి యన్యుల వలనఁ బరిభవింపఁబడునప్పుడు చూ యూరకుండరాదు. అది కులహాని. శరణాగతరక్షణము మనకు ముఖ్యధర్మము. మాఱుమాటాడక నీ తమ్ములం గలసి దుర్యోధనుని విడిచి పుచ్చుమన, నన్నమాట జవదాటలేక విజయ నకుల సహదేవులం గలిసి ఖుండు గంధర్వులపై నడిచె వారికిని వీరికిని బెనుపోరయ్యె. అంతఁ జిత్రసేనుం డర్జును గనుంగొని 'మిత్రమా! మనకు మత్సరంబువలదు. మిమ్మవమానింప వైభవముతోఁ జనుదెంచిన సుయోధను నవమానించి నా యొద్దికిఁ గొని తేవలయునను నింద్రునానతిఁ గొని యిట్లొనరించితి. మీ యిష్టంబెట్లో యట్లగుఁగాక!' యని యతఁడు దుర్యోధనాదుల వదలి ధర్మజాదులచే ననుజ్ఞాతుండై తన త్రోవంబోయె. ఇకెన్నఁడు నిట్టి సాహసకార్యము లొనర్పకుమని బుద్ధిదెప్పి యుధిష్ఠిరుండు సుయోధను నంపెను. అతండును తా నొకటితలఁచిన దైవ మొకటితలఁచెనను సామెతగాఁ దనకోరిక విపర్యాసము నొందుటకు వగచి ప్రాయోపవేశముచేయనిశ్చయించి కర్ణాదులచే వారింపఁబడి పురముచేరె.

తే॥ గీ॥ పరుల కవమాన మొనరింపఁ ♦ బాటుపడినఁ
దమకెగలుగుట తథ్యంబు ♦ దానిఫలము
మన్ననలుసేయ వారి ♦ మన్ననయగు
జొన్నవిత్తిన వరి పండు ♦ టున్నె చెపుమ?

# సాధుల బాధింపరాదు

వెతపెట్టఁబోయి వెతచివచ్చినన్న లోకోక్తికి దృష్టాంతముగ దుర్యోధనుఁడు, పాండవుల నవమానింపఁబోయి యవమాన మొంది చింతాకులిత చిత్తుఁడై గాలవుఁడను పేరుగల యొకముని నాశ్రయించి శుశ్రూష లొనర్చి యతని మెప్పు వడసెను. గాలవుఁడును నీ కేమివలయునని యడుగ దుర్యోధనుఁడు పాండవులు నశించు నట్లొక మారణహోమము చేయవలయునని కోరెను. గాలవుఁ డులికిపడి "దుర్యోధనా!

క॥ చెడువానిఁ జేరనివ్వఁడు
జెడుగే నాటిల్లుఁగాని ♦ చెందవు శుభముల్
చెడఁగాలుచు సంగారమె
కడునలుపిడుఁ బిడప మట్టఁ ♦ గద విద్యార్థీ!

అనుట నీ యెడ సమన్వయించు చున్నది. సాధువుల బాధింపఁబూనిన వాని వంశము నశింపకమానదు. వలవ దుడుగు మీకోర్కి. వేఁడెదనుగోరు" మన ధార్తరాష్ట్రుం డతని పాదములపైఁబడి కనికరింపవేఁడి యెట్లైన నీ నా కోరిక నెఱవేర్చుఁడని దైన్యముతో బతిమాలెను. చెప్పిన మాట తప్పలేక గాలవుఁడు తుదకు సమ్మతించి హోమము వ్రేల్చెను. అందుండి యొక కృత్తి పుట్టి యేమియాజ్ఞ యని గాలవు నెదుట నిలిచె. పాండవులం జంపిరమ్మని యా ముని యానతీయఁడ, వారలు దొరకరేని నిన్నే యాహారముగాఁ

గొంకుమని చెప్పి యా శక్తి వెడలె. పాండవు లీ వాటితో, దీఱుకురని దృఢమనస్కులై దుర్యోధనుఁడుండె.

ఈ విద్యజ్ఞాతకాలమున ద్వైతవనమున నొక బ్రాహ్మణుఁడు సిద్ధముగ నుంచియుండిన యరణి నొక హరిణి తన కొమ్మునఁ గ్రుచ్చికొని పరువెత్తసాగెను. బ్రాహ్మణుఁడు కొంతదూరము వెనుదవిలిపోయి యలసి పాండవుల సంగతి యెఱింగించి యరణిం గొనితేరఁ బ్రార్థించె. వారు వల్లెయని యేవురు నరణ్యమునంబడి తిరిగితిరిగి విసిఁగి వేసరి తేడిఁగానక యందొకచోటఁ జేరి చదికిలఁబడిరి.

ధరు వృదవ్వని మన యాజడి రానేల యని నకులుఁడు ధర్మజుం బ్రశ్నింప, 'సుఖదుఃఖములకుఁ బూర్వజన్మసుకృత దుష్కృతంబులు కారణంబులగు' నని యతఁ డుత్తరమిచ్చె. 'కాదు కాదు పాంచాలిం గొలువులోనిఁ దెచ్చినప్పుడే ధార్తరాష్ట్ర శతంబును నీ మాటం జేసి నుఱుమాడమి నింత పుట్టె' నని వృకోదరుం డనియె. 'సభలోఁ గర్ణుఁడు ద్రౌపది నాడినపలుకులకుఁగినియక కానకువచ్చుటం జేసి యింతలయ్యె' నని కిరీటి యనియె. 'మత్తశీలుని దుర్ద్యూత కితవుని శకునిం బట్టి జూదంబునాఁడె చంపకునికి మనకిన్ని పాటులు సంభవించె' నని సహదేవుండు పలికె.

అంత ధర్మరాజు నకులుం జూచి 'నీ సోదరులెల్లఁ బిపాసితులైరి. జలంబున్నచోటెఱిఁగి నీవు పోయి తృష్ణదీఱ

జలపానంబుసేసి మాకును గొనఁదెమ్మన, నతఁడగుఁ గాకని చని చని ముందట నొక జలాశయంబుం గని జలంబుం గ్రోలం బోయిన నకులుండు విన నశరీరవాణి యిట్లనియె. "ఈ తటాకము నాయది. నీకు జలంబు వలసిన నా ప్రశ్నంబులకు నుత్తరంబు లిచ్చి పిదపఁ గొను" మను నా పలుకులయెడ మాత్రేనియుం దనాదరంబు చేసి తజ్జలంబులం ద్రావి నిశ్చేతనుఁడై తత్తీరమునం బడియె.

నకులుండు శీఘ్రమ రానికారణం బారసి నీరుదే సహదేవు నజాతశత్రుండనిచె. సహదేవుండును నకులుని జాడనరయుచుఁ బోయి నిశ్చేష్టితుఁడై పడియున్న యన్నంగాంచి పరితపించి పెల్లడరు దప్పికోర్వక జలపానంబు సేయంబోవ నప్పటియట్లా భూతం బాక్షేపించె. సహదేవుండును నన్నవలె నమ్మాటల గిటునఁబుచ్చి సలిలంబుద్రావి పరవశుఁడై ధరణింబడియె. తదనంతర మర్జునుఁడు నాతని వెనుక భీముండును వచ్చి గగనవాణిని లెక్కసేయక తమ్ములయట్లైరి. కడకు ధర్మరాజే తెంచి తమ్ముల దుస్థితిం గాంచి "అక్కటా! ఎవరు నిచ్చటికి రారు. యుద్ధము జాడలేదు. తమ్ముల యంగములా యక్షతములు. జలంబులా నిర్మలములు. ఇట్లుగాఁ గతం బెద్ది? పాపులు సుయోధనాదులిటు వంచనచేసిరో! పుడమియు భోగభాగ్యములును వైరులకప్పగించి వనముల నిడుమలు గుడుచుచున్న మా కిట్టి దశ రాఁ జెల్లునే? ఏమి చేయఁబోయి

కాని నేనొక్కరుండ మిగిడిచన మాతల్లి 'సుతులు లేరా' యని ప్రశ్నింప నేమని యుత్తరంబిత్తు? ఈ దురంతదుఃఖసాగరం బేరీతి గడవనేర్తు? తమ్ములతోడి దేవయాన నడిచినాకు స్వర్గసమం" బను ను ధర పుత్త్రుండు మూర్ఛమునింగి పుడమిపయింబడియె.

ఆ తరుణంబున గాలవప్రేరితయైన శక్తి యేతెంచి పాండవులఁ గాంచి విగతప్రాణులఁగా నిశ్చయించి వెనుదిరిగి యరిగి గాలవుం బరిమార్చె. అది గని దుర్యోధనుఁడు బిక్కమొగము వైచికొని తన త్రోవను గజపురిం జేరె.

పదపడి ధర్మరాజుమూర్ఛదెలిసి దుస్తరంబగు పిపాసార్దితుండై కొలఁకునకరిగ నప్పటి యక్షశరీరి ప్రశ్నించె. శాంతమూర్తియగు నతండా భూతంబడిగిన ప్రశ్నలకు సముత్తరంబు లిచ్చి తమ్ముల బ్రదికించికొని దన్నుఁ బ్రశ్నించినది ధర దేవతగా నెఱిఁగి షడ్వరంబులం బడసి యనుజుల గూడి సంతసంబునఁ దన పర్ణశాల కేగె.

తే॥ గీ॥ నుంచి యిడిచెడ్డ యిడి కుని ♦ మోచకొపుకు
దుష్టసహావాసమునఁజేసి ♦ శిష్టజనుల
కపకృతి యొనర్చువారల ♦ కమిత దుఃఖ
చయముఁ, జెప్పంగరాని నా ♦ శమును గల్గు

# 2. సహవాసము

సత్సాంగత్యమో దుస్సాంగత్యమో యేదే నొకటి లేక మన జీవయాత్ర కొనసాగదు. అయ్యది బాల్యమునుండి యే ప్రతిమనుజునకుఁ బట్టువడి ప్రవర్ధన మగుచుండును. బాల్యమునఁ జెడినవాఁడు పెద్దవాఁడై బాగుపడఁడు. పిందెలోఁ జెడినది పండై రుచి నింపదు. పిన్నతనమున సత్సహవాస మలవడినచో వ్యవహారదశకు వచ్చినపిదప దురభ్యాసమునకుఁ బోదమన్నను దన వాడుక యట్లు పోనీయదు. "ఎందు సందేహ వస్తువులయందు నాత్మగతులె ప్రమాణంబు లార్యులకు" నని కాళిదాసు వచించుటకూడ సత్సహవాస మలవడిన వారి విషయమును గూర్చియే.

ఒక తల్లి పిల్లలగు రెండు చిలుకలలో నొకటి ఋషాశ్రమమునఁజేరిగి "రండు శ్రమ పరిహారము చేసికొనుఁడు. ఫలముల భక్షింపుఁడు. సత్యంవద, ధర్మంచర, మాతృదేవోభవ, పితృదేవోభవ, నానృతాత్పాతకం పర" మను వాకముల నేర్చినది! రెండవది కటికివాని యొద్దఁజేరి "మేకమాంసము పావులా. కోడినంజుడు మూఁడణాలు. మూతిమీఁదఁ గొట్టుదును! డబ్బుచ్చిపో! ఎవరబ్బసొత్తు? కడుపున కేమింటివి?" అను నిట్టి మాటలు నేర్చినది! చిన్ననాఁటి యభ్యాస మేకదా యీ రెంటి దశమునకుఁ గారణము. చిన్నవ్వాడు

దొంగతనమునఁ మఱఁగినవాఁడు పెద్దయైనపిమ్మట గట్టుగా నుండుననుట కల్లవార్త.

జగత్ప్రసిద్ధుఁడును, బరమ పవిత్రుఁడును, బ్రహ్మమానస పుత్త్రుండు నగు నారదుండు తానాస్థితికి వచ్చుటకుఁ గారణము బాల్యాభ్యాసము, సత్సాంగత్యము నని తన వృత్తాంతమును వ్యాసునితో నిట్లు చెప్పెను.

"నేను వేదవిదులయింటి దాసీ పుత్త్రుండనై యుండి వారిచేఁ బెంపంబడి వారికిఁ బరిచర్య సేయుచు బాలురతో నేయాటలకుఁబోక యెట్టితగులంబును లేక భక్తిశ్రద్ధలతో వారిని సేవించుచు వారి యెంగిలి హేయమనక తినుచు వారు భగవత్కథలు పాడఁగా నక్కఱతో వినుచుండు. క్రమక్రమంబున నామది భగవంతునియందు లీనంబై యెల్లప్పుడు నితరంబుఁ గోరదయ్యె. ఏడేండ్లవాఁడనయ్యు నిట్లు హరిభక్తి లీలాపరతంత్రుండనై యుండునెడ మహర్షులు నా యెడఁ గరుణించి యీశ్వరతత్త్వంబు నా కుపదేశించిరి. కొన్నాళ్లకు మజ్జననియుఁ బాముచేఁ గఱవంబడి మృతినొందె. తల్లి తల్లడపాటుం గనియు, మరణముం బొరయుట నరసియుఁ గలఁగని మనంబున నెరవలి సొత్తును కొండ్రియుక్కఱ చక్కంబడుపిదప సొత్తు తానికిచ్చి సంతసిల్లునట్టులు సంతసించుచు హరిపద ధ్యానంబు సేయుచు, నుత్తరాభిముఖుండనై దుర్గములు దుర్గమములగు నరణ్యములు పురములు గ్రామములు గడచి చనిచని తుదను

పాసల డస్సి యొక నదీప్రవాహంబునఁ గ్రుంకులిడి శుచినై నీరు ద్రావి విగతశ్రముఁడనై యశ్వత్థవృక్షచ్ఛాయఁ గూర్చుండి భగవంతుంగూర్చి ప్రార్థించుచుంటిని. ఉన్నట్టులుండి నాతలఁపున నొక్కరూపు వాఁడమి మనోలోచన గోచరంబయ్యె. ఆవలఁ గొన్నినాళ్లకు తనువువదలి వేఱొండు శుద్ధసత్త్వ దేహంబుం దాల్చి భగవన్నామస్మరణ మాఅవక యునికిం జేసి మఱుజన్మంబున బ్రహ్మమానసమునుండి యుద్భవించితి. ఇప్పటికిని నాకు దాసీపుత్త్రుఁడనై యుండిననాఁటి హరినామస్మరణము మఱపునకు రాదు”

బాల్యమున దుష్టునకైనను సత్సహవాస మలవడెనేని దుర్గుణములుతొలఁగి సద్గుణములు పుట్టువడుటకు సందియంబు లేదు. మిత్రుల నశీలవంతులంగాంచి తన చెడునడవడులఁ దానె ఱిఁగి లజ్జించి స్నేహబంధంబునం జేసి విడువవలసి వచ్చును. కావున బాలురు సత్సహవాస మలవడఁ జేసికొనుట వారి శ్రేయోభివృద్ధికిఁ బురోభివృద్ధికి ముఖ్యము. దుష్టసహవాసము కంటె నొంటరియై యుండుటయే శుభకరము.

క॥ చెలిమియె కీడునొసంగును
చెలిమియె సద్గుణముఁ గూర్చుఁ ♦ జింతింపంగాఁ
జెలిమియె కీర్త్యపకీర్తులఁ
గలిగించుం గానఁ దెలిసి ♦ కలియుము చెలులన్॥

# 3. పరిహాసము కూడదు

పరిహాసము మొదట బాలుర క్రీడలీలగాఁ దోఁచును. దానివలనఁ గలుగు ననర్థములు మఱిదేనివలనను గలుగదు. ఇది ప్రారంభదశయందు వేడుకగాఁ దోఁచినను రానురాను బరదోషాన్వేషణము పరోత్కృష్టతా సహనము వృద్ధియయి స్వలోపాంధత్వముచే నహంకార మంకురించి తుదకు సర్వదోషములకు నిలయమగును. తోలుతఁ దోడివారి నెగతాళిచేయ మొదలనది తక్కువవారి నెక్కువవారిఁగూడఁ బరిహసింపఁ బ్రోత్సహించును. గొప్పవారని గేలిసేఁత ముప్పునకే కారణము. ఎగతాళిమాటలుగాని, చేష్టలుగాని, కార్యములుగాని తగవు.

పూర్వము యాదవులు బలగర్వితులై యొల్లర కడేయులై యుండిరి. శ్రీకృష్ణుఁడు వారికిఁ బెట్టనికోటయై యొప్పారుటచే వారు దేవతలకు నైనను తేఱిచూడ రాకుండిరి. ఒకనాఁడు కణ్వ నారద విశ్వామిత్రులు కృష్ణదర్శనోత్సుకులై వచ్చిరి. రాజవీధిని వచ్చుచున్న మునులంగని యాదవులు సాంబుండను వాని కంగనాలంకారము గావించి వెంటనిడుకొని యెదురువచ్చి మిథ్యావినయమున వందనమొనర్చి స్త్రీరూపధారియగు సాంబునిఁజూపి "మహాత్ములారా! మీరు త్రికాలజ్ఞులరు? మీ రెఱుఁగనిది లేదు. ఈకాంత యాబభ్రుని భార్య వీరికిఁ బుత్రసంతానముపై నాసమెండు. ఈమెగర్భమున మా సవళికి వృద్ధ్ధిల్లునే?" యని పరియాచకములాడ మునుల

వారి మాఁగడ మెత్తంగి హృదయములఁ గ్రోధానల మగ్గలింప "నీకామినీరూపధరుఁడగు సాంబుఁడొక్క ముసలంబుం గనును. అదియ యీ యాదవవంశవినాశకారకంబగుఁ బొ" మ్మని యాపైఁ గృష్ణసందర్శనముకూడఁ జేయనొల్లక మరలి చనిరి.

మఱునాఁడట్లే సాంబునినుండి యొక రోఁకలిపుట్టెను. దానింగని యాదవులు భయంబంది వసుదేవునికడకుఁ బరుగులిడి యవ్వార్తవిన్నవింప నతండు నివ్వెఱపడి కొంతతడవు చింతించి మీఁదటిరయంబున దానిం బొడిపొడిగఁ జేసి కడలిం గలుపుడని యానతిచ్చె. వారట్లుచేసి కొంత యూఱడిల్లియుండిరి.

కొన్నాళ్లకు ద్వారకయందు మహోత్పాతంబులు పుట్టఁ బురుషోత్తముఁడు యాదవక్షయకాల మూహించి వారి నంబుధి తీరమునకు జాతరసేయ వలయుఁ బదండని పయనించె. అందఱు సముద్రతీరంబు చేరిరి. కృష్ణునియొద్ద సెలవుగైకొని యుద్ధవుఁడు తపంబుసేయ నేగె. అతని వెంబడించి బలరాముఁడును జనె. జాతరసేయు నానందమునకుఁ దొడఁగ యాదవులెల్ల మద్య మమితముగ సేవించి శరీరంబులు పరవశంబులుగా నొంతొంత లెగతాళితోఁ బ్రారంభించి యది ముదురఁగాఁ గొప్ప కలహమున కుపక్రమించిరి. కృష్ణుఁడు సర్వశక్తియుక్తుండయ్యు వారి వారింపఁడయ్యె. వారి కలహము పరిహాసమునుండి తిట్లకుదిగి తిట్లనుండి సిగపట్లకుఁ బ్రాఁకి తన్నులు గ్రుద్దులుగాఁ బరిణమించెను. పొడిగఁ జేయఁబడి కడలిం గలు

పొడిఁబడిన ముసలము తుంగనై మొలచి వారిపోరి కత్యంత సాహాయ్య మొనరించెను. ఆతుంగ బలుగులతో నయ్యాదవులు తండ్రి కొడుకులని, అన్నదమ్ములని, బావమఱఁదులని, మిత్రులని యేవివక్షతయు లేక యొండొరువుల మోఁదికొని యెల్లరుఁ గుప్పఁగూలిరి.

గీ॥ తనకుఁ బరియాచకంబయి ♦ తనరునదియె
యెదుటివానికి నొవ్వియై ♦ యెసఁగుచుండుఁ
బరుల నొప్పించుటయె మహా ♦ పాపమండ్రు
గాన నెవరికేఁ బరియాచ ♦ కంబు తగదు.

## ఆత్రగాని కల్పబుద్ధి

ఎట్టి కార్యమునందును మనుజున కోర్పావశ్యకము. ఓర్పులేక యేపనియు నిరాటంకముగఁ దుదముట్టదు. ఎదుటివాఁడొకప్పుడు కోపించి కొట్టవచ్చిన నోర్పుతో మాటలాడిన వానికోప మణఁగును. ఒక దెబ్బకొట్టిన నోర్చి తర్వాత వానిఁ బ్రస్తావించితిమా యతఁడు "నేనిట్లేల యాత్రపడి చేసితిని" అని పశ్చాత్తాప మొందును. మనము వానితో మాటకుమాట దెబ్బకుదెబ్బ యని నోరు చేయి చేసికొంటిమా కలహము పెచ్చు పెరిగి కష్టముల పాలుచేయును. ఓ . . కవచము. ఓర్పే యనమాయుధము. ఓ . . ధైర్యము.

ఓర్పే కార్యసాధకము. ఓర్పుగలవాఁ డెచ్చటను గౌరవింపఁబడును. ఓర్పు మహాద్భూషణము. దీని యుత్తమ రూపముం గోరువారు దాని ధరింతురు.

ఓర్పునదిలేక యాత్రముతోఁ బనిచేసి వెతుకఁ జింతించిన వా రనేకులు గలరు. ఒక మ్లేచ్ఛుఁ డొక డేగను మచ్చికతోఁ బెంచి దానితోఁ బక్షుల వేఁటాడి జీవనము చేయుచుండెను. ఒకనాఁడు వాఁ డొక యడవిం బడి తిరిగి తిరిగి యలసి నీటిపట్టు నరయుచు నరణ్యమందుఁ గలయఁదిరిగి వేసరి తుట్టతుద కొకచో నొక యెత్తైన నిట్రమైన ఱాతిపైనుండి చుక్కలు చుక్కలుగఁ బడుచుండు జలబిందువులం గాంచి త్రావఁజాలమింజేసి ఖేదమానసుండై యోర్పుమెయి నాలోచించి కొన్ని వెడలుపుటాకులఁదెచ్చి దొన్నెగాఁగుట్టి దానితో నా తోయకణముల నిండఁ బట్టుచుండెను. అది గని యతని డేగ తివ్వన వచ్చి దొప్ప నెగురఁగొట్టి యుత్తెముపై గూర్చుండెను. శ్యేనముపైఁ గల ప్రేమచే మ్లేచ్ఛుఁడు దాని నేమియుఁ జేయఁజాలక మరల నా పత్రపుటము నెత్తి పట్టెను. మరల బైరి దొన్నెయుం బడఁగొట్టెను. కన్నులెఱ్ఱఁజేసి చుఱచుఱ నాపక్షిం గనుచు మరల దొప్ప నెత్తెను. అది మరలఁ దొలఁగఁద్రోసె. అంత మ్లేచ్ఛుఁడు కోపోద్దీపితుఁడై డేగ మెడ నొడిసిపట్టి ఱాత నుదికి చంపి, “నేను దప్పికిఁగుంది యీ యడవి నన్నో కడకండ్లు గుడిచి కడ కొంచెపు నీటిని గని దీనితో దప్పిదీర్చు

కొందమన్న నా కష్టము వచ్చుచుంటివా? నా దప్పి నీకంత యానందమా? చావు చావు" మని విసరి పాఱవైచి జలంబుగొన నుద్యోగించి "యిది యేల యిట్లు మాటిమాటికి నా గొప్ప నగురఁగొట్టవలయు? కారణమేమై యుండు? ఎన్నఁడు నా కార్యముల కడ్డుగానిది నేఁడేలరావలయు?" నని సంశయాకులిత చిత్తుండై దొన్నసటఁ బడవైచి యతి ప్రయాసంబున వెదుక ప్రక్కనుండి తాతిపై కెక్కివచ్చి చూచె. చూచునుగదా! వానికే యేవగలిగించునట్టి యొక పెనుఁబాము చచ్చి క్రుళ్లి యందుండి బయుల్పడి స్రవించుచున్న యుదకధారలవి. ఇఁక వాని దుఃఖ మెంతని చెప్పవచ్చును? దానికంతముండునా?

"అయ్యో! నాముద్దులబైరీ' నన్ను విషజలము ద్రావనీక నా ప్రాణముఁ గాపాడఁదలంచిన నిన్నన్యాయ్యముగాఁ జంపితినే? నీ మేలెఱుంగనైతినే! నీవు నా యొద్దఁ జేరినది మొదలు నా కన్నము పెట్టుచుండియు దప్పి దీర్పనిదానిపని యెంచి యింతపాపమున కొడిగట్టుకొంటినే! నా పాపమునకింకఁ బ్రాయశ్చిత్తము గలదా? ఆత్రగాని కల్పబుద్ధి యను లోకోక్తి నా వలన సిద్ధాంతీకరింపఁబడెఁ గదా! నా ప్రాణమేల? నీయట్టి మహోపకారిని జేతులారఁ జంపికొంటిని!" అని పరిపరివిధములఁ బలవించి యామెంచ తుదకుఁ జేయునది లేక పిచ్చిపట్టినవానివలె దేవురించుచు నింటికిఁ బోయెను.

చుక్కలుచుక్కలుగఁ బడుచున్న నీటిబిందువులఁ బట్టుటకుఁ గలిగిన యోర్పుతోఁడి యాలోచనమును, దేగనుజంపిన పిమ్మటఁ గలిగిన దీర్ఘాలోచనముచు వాని కప్పట్టునఁ గలిగి యుండినచోఁ నంతవంతకుఁ గారణము లేదుకదా!

ఆ॥ వె॥ ఆత్రగాని చేయువు ♦ లన్నియుఁ జెడిపోవుఁ
దుదిని దుఃఖ మొదవుఁ ♦ ఘోరముగను
వానినెపుడు సుఖము ♦ వలవదు దూరమా
నాత్రగానికబ్బు ♦ నల్పబుద్ధి॥

## 5. దురదృష్టవంతున కేది వచ్చినను నిలువదు

లక్షదత్తుఁడను రాజునకు లబ్ధదత్తుఁడను ప్రియభృత్యుఁడుండెను. లక్షదత్తుఁడు తనతోఁ జమత్కారముగ మాటలాడిన వానికి లక్షయిచ్చుచుండువాఁడు. తన్ను సంతోషపెట్టిన నిర్ధనుని గొప్పవైభవయుక్తునిగఁ జేయును. లబ్ధదత్తునకుఁ దోలుగోచి, భార్య, పదునాలుగురు బిడ్డలు నాస్తిగనుండెను. ఇల్లెల్లఁ దనకాంతిచే విధూత తమసముఁ జేయు దీపము, సెమ్మెక్రిందను బ్రక్కలను బ్రకాశింపనట్లులు రాజుగారి దాతృత సేవకునిపై మాత్రము ప్రసరింపకుండెను. లబ్ధ

దత్తుఁడు తన ప్రాణమును తృణప్రాయముగ భావించి యెన్నో సంకట సమయములలోఁ బ్రభున కుపకరించి తన వృత్తిని బవిత్రముచేసికొనినవాఁడు. లక్షదత్తునకు నతనియం దతి ప్రేమయు దయయుఁ గలదు. కాని యతని ప్రేమయు దయయు ధనరూపముగనో ధాన్యరూపముగనో పరిణమించి వెలు వడలేదు. వానికొక్క తోలుగోచియు, వానిభార్యకొక్క నాలుగు మూరల జీర్ణచేలమును వాని బిడ్డలకు దిగంబరత్వ మును గలదనియు నంతకంటె వారికేమియు లేదనియుఁ బ్రభు నకుఁగూడఁ దెలియును. తెలిసి యేమిప్రయోజనము? పౌరు లెల్లరును లబ్ధదత్తుని విషయమున రాజు శ్లేలయున్నాఁడని యాశ్చర్యపడుచుండిరి.

ఒకనాఁడు రాజు లబ్ధదత్తునింగూర్చి చింతించి వీని నిప్పటికైన దరిద్రదేవత వదలినదా? ఆజ్యేష్ఠాదేవి యున్నంత కాలము శ్రీదేవి వానిచెంత నిలువఁజాలకున్నది. కానిము. ఈతూరియైన లక్ష్మి వీనికి దర్శనమిచ్చునో యీయదో పరీ క్షించెదఁగాక! యని యొక పెద్దమాతులుంగ ఫలమును బర తీపలెఁజేసి దానిలో నిండుగ రత్నములుంచి తనచెంత నునిచి కొని యొకనాఁడు నిండుపేరోలగమున నుండునపుడు లబ్ధదత్తుని సమీపమునకుఁ బిలిచి యేదేనొక గీతము పాడుమనెను.

గీ॥ నిండినట్టి జలధి ♦ నిండించుచు నదులుఁ
మిట్టనేలనెండఁ ♦ బెట్టున ను

లబ్ధనిలయ ధనుల కధికంబు గూర్చుచుఁ
బీడనంబు సేయు బీదజనుల॥

అని లబ్ధదత్తుఁడు పాడ, రాజు మరల దాని రెండుసారులు పాడించి రత్నములతో నింపించియుంచిన యామాదీఫలమును వానికి బహుమతి చేసెను. "ఈ రాజెవనినిగూర్చి సంతసించునో వాని దారిద్ర్యము నాశముచేయును. పాపమీతఁడు కేవల మదృష్టహీనుఁడు కావుననే రాజు సంతోషించియు వీనికీ మాదీఫలమునుమాత్ర మిచ్చెను. అదృష్టహీనులకుఁ గల్పవృక్షముగూడ మోడుగుచెట్టగు" నని సభికులు రాజు చేసిన రహస్యవిషయము నెఱుఁగక యొండొరువులు పలుకుచుండిరి.

లబ్ధదత్తుఁ డదిగొని యింటికేగుచు నిట్టులాలోచించెను. "ఈఫలముతో నాపొట్ట నిండునా? కుటుంబ మీపూటయైనఁ గడచునా? దీని నమ్మి నూకలైనఁ గొనిపోయెదఁగాక" అంత నొక రాజ వంది వానియెదుటికి వచ్చి వానికిఁ దనకాటి చ్చి మాతులుంగమును గ్రహించి రాజదర్శనము చేసి దానిని కానుకగాఁ బెట్టెను. ప్రభుండు దానిని గుర్తించి యిది నీకెక్కడి దన లబ్ధదత్తుఁడిచ్చెననెను. ఆహా! వీని దురదృష్టంకను దీఱదాయెనుగదా! యని రాజు పరితాపపడి యా మఱునాఁడు మరల లబ్ధదత్తుని బిలిచి యాగీతమునే మరలఁ బాడించి యదేఫలము నిచ్చెను. సభికులందఱు మునుపటి

యట్లే యనుకొనుచుండెను. రాజానుగ్రహమే చాలును. ఈ ఫలమెంత? యనుకొనుచు లబ్ధదత్తుఁడు పోవుచుండెను. ఒక సామంతరాజు రాజదర్శనాపేక్షియై వచ్చి వానిచేనున్న మాతులుంగమొంగని యది నజరుగానీయఁ దగియున్నదని వానికి రెండువస్త్రములిచ్చి దానినిగొని యోలగంబుసొచ్చి రాజును దర్శించి యాఫలమునే కానుకపెట్టెను. లక్షదత్తుఁ డది గ్రహించి 'యక్కటా! లక్ష్మి యింకను వానిఁ గటాక్షింపఁ దయ్యెఁగదా!' యని చింతించుచు సభచాలించెను. లబ్ధదత్తుఁ డొక వస్త్రమమ్మి భోజనపదార్థములఁగొని రెండవదానిని చించి తన పిల్లలకొసఁగెను.

మూఁడవనాఁడు నరపాలుండు మరల వానిచే నదేగీతమును పాడించి యామాతులుంగ ఫలమునే యిచ్చెను. దానిని గొనిపోయి యా భృత్యుఁడు రాజవిలాసిని కిచ్చెను. ఆ వేశ్య యిచ్చిన సువర్ణమున యతఁడానాఁడు భార్యాపుత్త్రులతో సుఖముండెను. రాజ వేశ్య యా ఫలమును రాజప్రీత్యర్థము లక్షదత్తున కొసంగ నతఁడు "కటకటా! ఈ దౌర్భాగ్యుఁడు నా యీవి నిష్ఫలముగాదని యెఱుఁగఁడుగదా! లక్ష్మి వీని యింట నిలువనోల్లక నా యింటికే వచ్చి చేరుచున్నదిగదా!" అనుకొనుచు నానాఁడుగడపి యా మఱునాఁడు రాజ పేరోలగంబున లబ్ధదత్తుని సమీపమునకుఁ బిలిచి యా గీతమునే పాడించి యా ఫలము నొసంగెను. ఒసఁగునప్పుడు ప్రభుని చేతి

నుండి భృత్యునిచేతఁబడి జాతి క్రిందఁబడి బ్రద్దలై మహారత్నములు చెదరిపోయెను. సభికు లాశ్చర్యపడి ప్రభు కటాక్షమిట్లుండ మూన్నాళ్ళు పరిపరివిధముల భ్రమలపాలైతిమనిరి. "వీని లక్ష్మి కటాక్షించెనో లేదో యని పరీక్షార్థముగా నీ యుక్తి చేసితిని. ఇన్నాళ్ళు కరుణింపక నేఁడు కరుణించినది" అని రాజు పలుకుచు వానికా రత్నములతో ననేక వస్తువాహనాదికము లొసంగి యొక సామంతునిగాఁ జేసెను.

అదృష్టహీనున కెంతవచ్చిన నోటికుండలోఁ బోసిన సీటివలె నగును.

## సత్కార్యములకు విఘ్నములు సలుపరాదు

ఒక బ్రాహ్మణుఁడు ప్రతిదినము నుదయమున నొక కొలఁకున స్నానాదివిధులం దీర్చి యా గట్టున నశ్వత్థవృక్షచ్ఛాయఁ గూర్చుండి నిశ్చలచిత్తుండై పరమేశ్వరధ్యానము చేయుచుండెను. ఒక ధూర్తబాలుఁ డాతనిఁగని సమీపించి నిలువంబడెను. నిమీలితలోచనుండై లోలోన ఫాలలోచనుం గనుఁగొనుచు నానందపరవశుఁడై యుండు నా భక్తవతంసుండు ధూర్తుని గనఁడయ్యె. అంత నా తుంటరిపిల్లవాఁ డాతనివెనుకకు వచ్చి పిల్లజుట్టులాగెను. ధ్యానభంగమునకంటె

సికలాగుట కతనికిఁ గోపమురాలేదు. కాని తన కోపమును దనలో నణఁచుకొని యిట్లాలోచించెను. "వీనిపైఁ గోపముచే నోరు చేసికొంటిమా మాటకుమాట పెరుఁగును. అంతటఁ జిన్న పెద్దయను తారతమ్యము నశించును. నలువురు పెద్దనగు నాకే శాంతవాక్యముల బోధింతురు. అంతియగాక సాధారణముగాఁ దుంటరిబాలు రెంతసాధువునైన నియమనములోఁ బిచ్చివానిఁగఁ జేయఁగలరు. అతఁడూరకున్నను వారూరకుండక వెక్కిరించుచుఁ దిట్టుచు తాలుబువ్వయుఁ గోపము గలిగింతురు. కొందఱు బాలుర కదియొక యాటగాఁ దోఁచును. వారి పోరు పడలేక యతఁడు లేచి వారిని దఱుమఁజూచెనా, అతఁడు వచ్చుచుండ వఱకుఁ బరువెత్తుచు, నిలుచునంత నిలుచుచు, నీకే బాలురు వెడలుదురని వెనుదిరుగునంత మగల వెంబడించుచు, మహోన్మత్తునిగఁ జేసి యాడింతురు. ఇట్టికని మనకు సరిగాదు. ఊరకుంటినా పీఁడూరకుండఁడు. తగినబుద్ధి యితరులు చెప్పునట్లు చేసెదఁగాక"

అని తన చిటికెనవ్రేలనున్న బంగరు టుంగరమును దీసి యా ధూర్తున కందిచ్చెను. వాఁడది గ్రహించి మహదానందమున నాకు ధనసంపాదనమున కిదియొకమార్గముపొడకట్టె. ఇఁక నిట్టికార్యములే చేయుచుండెద నని నిశ్చయించుకొని నాఁటికా భక్తుని వదలిపోవుచుండెను. మధ్యేమార్గమున నొక మహమ్మదీయుఁ డొక యింటియరుగుపైఁ దన పై వస్త్ర

మును బట్టుకొని మోఁకరించి కూర్చుండి వంగుచు లేచుచు నమాజు చేయుచుండుట నాతుంటరిచూచి మఱొకయుంగరము వచ్చు నీశుభసమయము నేల వ్యర్థపఱుపవలయునని వానిని సమీపించి శిఖ లేనివాఁడగుటచేఁ జెవిపట్టిలాగెను. ఆమహా మ్మదీయుఁ డా బాలునటిమిచూచుచుఁ బొడ్లుగొటికి పొమ్మ ని సంజ్ఞ చేసెను. నీకొఱకు మరలవచ్చువారెవరు? ఇప్పుడే యీ చ్చివేయుమని కొంచెము రోషముదెచ్చుకొన్నవానివలెఁ జెప్పుచు వెంటనే మరలఁ జెవిఁ గొంత గట్టిగలాగెను. అంత నా తురక కన్నులెఱ్ఱవాఱలేచి యాబాలుని రెండుచెంపలు వాఁచునట్లు కొట్టి మెడఁబట్టి బయటికినెట్టెను. తుంటరి చేయునది లేకేడ్చుచుఁ గొలని గట్టుననున్న బ్రాహ్మణునొద్దకుఁ జని "అయ్యా! నిన్ను సిగఁబట్టిలాగ నీవుంగరమిచ్చితివి. తురకఁ జెవిపట్టిలాగ నాతఁడు వాఁచునట్లుకొట్టె. మీ యిరువుర భేదమేల?" యని యడుగ నావిప్రుండు, "ఓయీ! బాలకా! నీవుచేసినది చెడుకార్యము. నీకుఁ మొదటఁదగిన నీతులు గఱపిన వినవనియు, నా తురక చేసినపని చేయ నాకు శక్తిచాలమి యుఁజేసి నీవు బుద్ధిమంతుఁడవగు మార్గము నూహించి నేను జేయుఁ దలంచుకొన్నదాని నితరులచేఁ జేయింపఁదలంచి యీట్లొనరించితి. నాకోరిక ఫలించె. నీవును బుద్ధిమంతుఁడవై యెవ్వరి కేయుపకారము చేయక సత్కార్యములకు విఘ్నములు సలుపక భగవత్ప్రీతిగా మను" మని దీవించి తనదారిని దానేగెను. అది మొదలా పోకిరిపిల్లవాఁడును బుద్ధిమంతుఁడయ్యెను.

గీ॥ సాధులకు బాధయగునట్లు ♦ సత్కృతులకుఁ
జెఱుపుసేయుంగఁ దప్పక ♦ చెడుగువచ్చు
నవ్వుచును బిల్లచేష్ట లా ♦ నర్చి పిదప
నేక్కుచనుభవించుటమేలె ♦ యీావ దెప్పుము॥



## . ఋణము వలదు

భార్యలు, పుత్త్రులు, గృహములు, భూములు, గోవులు, ధనము, ధాన్యము మొదలగునవి ఋణమువలననే ప్రాప్తించుచున్నవి. ఋణము తీఱినవెంటనే గట్టిగఁ బట్టుకొన్నను నిలువక తొలఁగిపోవుచున్నవి. మనకు ఋణపడినవానివలన సుఖమును, మనము ఋణపడినవాని వలనఁ గష్టమును మనకు దొరకొనును. కావున మన మొకరివద్ద నప్పుగొని పిదపఁ బోపొమ్మని యెగవేయరాదు. మఱుజన్మముననైన నది వదలదు. ఋణశేషము, వ్యాధిశేషము, శత్రుశేషము నుంచరాదు. ఉంచినవాని నవి ముంచకమానవు. సుమారేఁబదియేండ్లక్రిందట నిందులకు దృష్టాంతముగ జరిగినదని చూచినవారు చెప్పిన యొక విచిత్ర చరిత్రము నిందుఁ బొందుపఱచెద.

చంద్రగిరికి సమీపమున నొక గ్రామమున ధనికుఁడొకఁడుండెను. అతఁడు పెనులోభి. ఆఁకలిచే మలమల

మాడుచు వచ్చిన బిచ్చగాండ్రఁ గసరికొట్టుచుగాని యన్నము
పెట్టఁడు. కూలి చేసినవారికి కూలి సరిగ నీయఁడన్నపు డీతఁ
నతని దాతృత్వ మహిమంగూర్చి వినుతింపవలయునే? తన
యింట బట్టలుతుకు చాకలి కతఁడు మేరగింజ లీయకుండెను.
అడుగుటకుఁ జాకలివానికి భయము. అడుగకున్న నిచ్చువాఁ
డా యతఁడు? కూలిలేక వాఁడెట్లు కడుపుఁగట్టుకొని పని చే
యును? ఒకనాఁడా రజకుఁడెట్లో తెంపుచేసి యడుగ నిశ్చ
యించి యా ధనికుని సమీపించి చేతులు జోడించి వినమ్రుఁ
డై "దేవరా! మనవి. ఏను గింజలు దయచేయవలె. పిల్ల
లు పస్తున్నారు" అని ప్రాధేయపడెను. ఆ పిసిని చాకలివా
నిఁ జిఱజిఱఁ జూచి "ఏమిరా! కండ్రొవ్వునఁ గన్నులు
గానరావా? పొగరు తలకెక్కెనా? ఈయూరి ని రోడలఁ
బట్టదా? తలవెంకి ముదిరినదా? తారతమ్యము తెలియఁగక
ప్రేలుచున్నావా?" యని గద్దించెను. వాఁడు వడఁకుచు
"బుద్ధిబుద్ధి దేవరా! నేనంత పని చేయలేదే! మన్నించవలె.
మేరగింజలు పెట్టింపుఁడని యడిగితిని. మఱేమియు తప్పు
చేయలేదు దేవరా" యని మరల బతిమాలెను. "మరల
మరల నట్లే మాట్లాడుచున్నావా? నీచర్మ మొలిపింతును.
నిన్ను కులమునుండి వెలివేయింతు" నని కొన్ని బూతులుందిట్టి
కొట్టఁబోయెను. చాకలివాఁడేమి చేయఁగలఁడు? ధనికుఁ
డా యూరిలోని పెద్దరైతు. కాన నందఱతనిమాటయే నై

కొందురు. మఱుమాటాడక చాకి వెడలిపోయెను. కాని యు-ధనికుని యింటివని చేయక తప్పినది కాదు. మఱుచటి వత్సరమున మరలఁ జాకలి మేరగింజ లడిగెను. ఆసారి వానికి ప్రాయశ్చిత్తము బాగుగ నయ్యెను. చాకలికి దిక్కు లేదు. సాహుకారి కెదురు లేదు. పెక్కు సంవత్సరము లిట్లే గడచెను. "మేరలేని యుద్యోగము మేరలేక చేయించుకొని నాయింట మఱికిమూటలు మోచుగాడిదవై పుట్టెదవులే" యని యేమేమో వానిలోలోని శాపాలాపములకు మేర లేదు. కొన్నాళ్ళ కప్పిసినిగొట్టు పంచత్వముం బొంది నిజముగ నాచాకలివాని యింటి గాడిద కడుపునఁ బుట్టి వానిమూటలే మోయుచుండెను. ఒకనాఁడా ధనికుని కుమారుఁడు గాడిదపాలు కావలసి యాచాకలివాని యింటికిఁ బోగా నాగాడిద యతనిఁ జూచి కన్నీరు ధారగాఁ గార్చెను. దానిని జూడఁగనే యతనికి చెప్పరాని కలఁత యొకటి మనస్సునఁ బుట్టెను. నాఁటిరాత్రి స్వప్నమున నాగాడిద యగపడి యిట్లు చెప్పెను. "నాయనా! నీ తండ్రిని నేను. చాకలివానికి మేర యీయక వెట్టిచాకిరి చేయించుకొని యాఋణము దీర్ప వానియింట గార్దభమనై పుట్టితి. వానిమూఁటికి మూటలు మోవ లేక నడుము విఱిగినది. దానికిఁ జికిత్సయైనఁ జేయింపక యెప్పటియట్ల పనిమాత్రము చేయించుకొనుచున్నాఁడు. పాఱిపోదమన్న మాటలం మోచు సమయములందక్క జరణబంధములు వదిలింపఁడు. వాని

ననేల? నాయనా! వాని ఋణమింక నెంతో తీర్పవలసి యున్నది. రేపే నీవు వాని నింటికిఁ గొనివచ్చి కణఁజముల న్నిటిం దెఱచివైచి వాని కుటుంబమువారి నెల్లఁ దనివిదీఱ మోచికొని పొండని చెప్పుము. మీతండ్రి ఋణము తీఱిన దని వా రనువఱ కిచ్చుచుండుము. వా రెప్పుడు 'తృప్తియయ్యె' నందురో యప్పుడే నా ప్రాణము పోఁగలదు. ఇదియే నీకును దృష్టాంతము కాఁగలదు. నా కుమారుఁడవైనందుల కిట్టు చేసి నన్నీ ఋణమునుండి విముక్తుని జేసి యుద్ధరింపుమా!" యని పరిదేవనంబు సేయఁ గుమారుఁ డా పలుకు లాలించి మేలు కాంచి "యిది చిత్ర" మనుకొని యతఁడు తండ్రివంటి లోభి కాఁడు గావునఁ జాకలివానిని వానికుటుంబమువారిని మఱుఁ నాఁ డుదయమునఁ బిలిపించి కొన్ని కణఁజములఁ దీయించి వారికిఁ దృప్తియగు దనుక నెత్తికొని పొమ్మనెను. వారిది యేమో యని కైకొన జంకిరి. అతఁడు "నిర్భయముగ నిస్సంశయముగఁ గొంకు జంకు వదలి యెంతయైన సరే కొనిపొం" డని బలవంత పఱచెను. తుదకు వారు శంకదీఱ వలసినంత గొనిపోయిరి. ఇంకను గొనిపొండని వారికి సాయముగ నతఁడు కొందఱఁ గూలివాండ్ర నియమించెను. వా రేడెనిమిది గరిసెల గింజలు కొనిపోయి "యిఁకఁ జాలును. ఉంచుకొనుటకుఁ జోటులే" దనిరి. పెద్దయిల్లిచ్చెదను. మీ యాసదీఱు దాఁకఁ గొనిపొం డని యాగృహమేధి నుడువఁ జాకలివాండ్ర

బ్బురపడి "దేవరా! నాలుగేండ్ల బత్తెము గిట్టినది. ఇఁక మాకు వల"దనిరి. మఱి నాలుగు వత్సరముల గ్రాసమునకుఁ గొనిపొండని యతఁడు నిర్బంధించి కూలివాండ్రచేఁ బంపెను. వారు "వలదుస్వామీ! వలదు. మీవంటి రెండు తరముల వారికిఁ బనిచేయఁదగినంత వచ్చినది. చాలు" నన నతఁడు తనలో "వీరింకను దండ్రి ఋణము తీఱినదని చెప్పరైరి. నే నడుగకయే వారిచేఁ జెప్పింపవలయు" ననుకొని మఱియొక పూరిగుడిసెను వారికి స్వాధీన పఱచి దానికి నిండుగ ధాన్యముఁగొని పొండనెను. వారు దిగులుపడి "స్వామీ! మా యబ్బతోడే యింక మాకు వలదు. మీ తండ్రి నాఁటిదిగూడ ముట్టె" నని చెప్పిరి. ఆ మాట వారి నోటినుండి రాఁగానె యా గాడిద గిఱ్ఱున దిరిగి నేలఁబడి చచ్చెను.

అష్టదారిద్ర్యములలో ఋణము మొదటిదిగాఁ జెప్పఁబడినది. అప్పు దీసికొని యుంచిన వానికి యమదండనము లేదు. వాఁడు మరల ఋణము దీర్ప ననుకూలముగఁ గుక్కగనో, పశువుగనో, కొడుకుగనో, సేవకుఁడుగనో పుట్టి తీర్పవలసియుండును. కుక్కను మన మెంత ప్రేమతోఁ బెంచుచుండినను నొక్కొక్కప్పుడు మన యింట నిలువనొల్లక, పంచను గూడఁ జేరనీయక తెలియువారి యింట నది బలవంతముగఁ జేరి వారు తిండి వేయకున్నను బుల్లెల నాకి వారి యిల్లలి శ్రద్ధతోఁ గాచుచుండును. ఋణానుబంధమేకదా యిందులకుఁ గారణము!

# పెట్టి పుట్టవలయును

శ్లో॥ యేన యేన శరీరేణ యద్యత్క ర్మ కరోతి యః
తేన తేన శరీరేణ తత్తత్ఫల ముపాశ్నుతే॥

ఎవఁడే యే శరీరంబులు ధరియించి యేయే కర్మము లొనరించునో యాయా శరీరంబుల ధరించి యాయా కర ఫలంబు లనుభవించును.

కొందఱు పూర్వజన్మము లేదు. మఱుజన్మమును లేదనుచున్నారు. అదియే లేనియెడ సర్వమానవులు సమ్ముతె యుండవలయును. అట్లున్నారా? భాగ్యవంతులు, నిఱు పేదలు, నీరోగులు, రోగులు, సుఖజీవులు, కష్టజీవులు, సురూ పులు, విరూపులు, సుజనులు, దుర్జనులు, సుజ్ఞానులు, నజ్ఞా నులు మొదలగు తారతమ్యము లేల యేర్పడవలయు? భాగ్య వంతులయింటఁ బుట్టుటకు బీదలయింటఁ బుట్టుటకుఁ బూర్వ పుణ్యపాపములుగాక సరియగు కారణము వేఱొండుగలదా? జన్మముతోనే సురూపులు విరూపులగుటకుఁ దల్లిదండ్రులు హేతుభూతులందురుకాని జననీ జనకుల దోషము తనయుఁ డనుభవించుటయా? చేత నొకరిదియు ఫలానుభవము మఱి యొకరిదియా? పిట్టమీఁదఁ గొట్టిన దవుడపండ్లు రాలుట యా? కుశాగ్ర బుద్ధుల కార్యము చెడుటకును, నకృత ప్రయ త్నులకుఁ దమంతఁ గార్యము నెఱవేఱుటయుఁ, గోరిన యట్లనం

దము దూరమగుటయుఁ, గోరకయే దుఃఖంబులు సంప్రాప్తించుటయుఁ బూర్వజన్మ సంచిత ఫలంబునఁ గాక మఱేఁ దేనఁ గలుగుచున్నది?

శ్లో॥ యస్యరత్నాకర స్తాత యస్యలక్ష్మీ సహోదరీ
శంఖోరోదితి భిక్షార్థీ నాఽదత్త ముపతిష్ఠతే॥

దేనికి రత్ననిలయుఁ డగు సముద్రుండు తండ్రియో; కలుముల వెలఁది తోఁబుట్టువో; యట్టి శంఖము భిక్షార్థియై యింటింటి వాఁకిట నిలిచి రోదనము చేయుచున్నది! పెట్టి పుట్టని వారికి లేదు.

ఉజ్జయినీ నగరమును ధర్మరీతిఁ బరిపాలించు చుండిన సాహసాంక బిరుదాంకుండగు విక్రమార్కుం డొక్కదినమున నిండు పేరోలగంబుండి రాజకార్యములు ముగిసిన పిమ్మట వేఱుపడి యమాత్య వర్గముం గని "నేఁ బూర్వభవంబున నేకులంబున జన్మించి యే యే సుకృతంబులొనర్చి యీ పదవికి రాఁగలిగితినో చెప్పఁగలరేని విస్తరించి నన్నుఁ గృతార్థునిఁ జేయుఁ" డనుడు మంత్రు లొకరి మొగ మొకరు చూచుచుఁ జూపుల నేలకువ్రాల్ప నధిక మేధావంతుఁడగు భట్టి యిట్లనియె.

రాజచంద్రా! మీకోరిక యీయమాత్యులవలన నెఱవేఱునదికాదు. ఆఱు నెలలు గడువిచ్చిన మీ పూర్వజన చరిత్రముంగూర్చి చెప్పఁగల దైవజ్ఞుని దోడితెత్తునన విక్రమార్కుండును వల్లెయని నాఁటి కొలువు చాలించె.

భట్టి, "రాజుగారి పూర్వజన్మ వృత్తాంతమును దృ ష్టాంతపూర్వకంబుగ నాలుమాసములలో వివరించువారికిఁ గూష్మాండంబంత కనకంబును గోరిన గ్రామంబులు నొసంగఁ బడును. అగు నని యరుదెంచి యాలుమాసంబు లాహరించి యావల నావలనఁ గాదను వారును, నసత్యము చెప్పి యను భవ పూర్వకంబుగ విశదపఱుపనివారును శిరఃఖండనమునకుఁ బాత్రులగుదు" రని రాజ్యమం దెల్లమొకలఁ జాటింపించెను.

ఈ ఘోషణమున మొదటి వాక్యము విన్నపుడు చిల్ల రజోస్యు లెందఱో తల్లాభంబునొంద నుత్సహించి యుల్లసిల్లిరి కాని రెండవవాక్యము విన్నయంత నిరుత్సాహులై నిట్టూ ర్పులు పుచ్చిరి. ప్రాణమున్న నందఱకుఁ దీపియేకదా!

ఒక యగ్రహారమున బహు- త్రకుండగు శంకరభట్టు ను బ్రాహ్మణుఁడొకఁ డీచాటింపువిని తన మది నిట్లు తలపోసె ను. "నివ్వరిగింజల నేతి తెచ్చి దినమున కొకపూటయైనఁ గడుపునిండని బీదగంజిని బిడ్డలనోటఁబోయు నది చాలక యాఁకలికి మలమల మాడుము బాలకు లల్లాడఁ గడపు నా దౌర్భాగ్యజీవన మేటిజీవనము?

క॥ ఒడమిగల వెడగునైనను
బుడమిం గలవారలెల్ల ♦ భూషింతురు శ్రీ
వెడవాసిన దూషింతురు
కడుఁ బేదటికంబుకంటెఁ ♦ గష్టము గలదే?

శ్లో॥ శత్రువత్పుత్రదారేషు । బంధువర్గేషుచోరవ-
త్పాతవ త్సభామధ్యే । అహోకష్టం దరిద్రతా॥

దారాపుత్త్రులకు శత్రువువలెను బంధువులకుఁ జోరునివలెను సభామధ్యంబునఁ బాపివలెను దోఁచఁజేయు నీ దారిద్ర్యము ననుభవించుట మహాకష్టము. కష్టము కావుననే "ధనమూర్జః ఖలు కాకుత్స్థ ధనమూల మిదం జగ" త్తని వసిష్ఠుఁడు శ్రీరాముని హెచ్చరించెను.

ఉ॥ ఆఁకొని యేడ్చు లేఁజిఱుత । లన్నముకై తనకొంగులాఁగ బె
ల్లాఁకట సోలుచుండెడు ని । జాంగన దుర్దశఁజూడఁ డేనియా
చ్ఛా కలనావిభంగభయ । సంభృత గద్గద శూన్యకంఠుఁడై
చేకొని దేహియంచడుగ । జేరున కాలినపొట్టకవ్వఁడేఁ।

కానిమ్ము. విక్రమార్కుని పూర్వజన్మచరితముం జెప్ప నరుగు నీదైవజ్ఞుని దైవవిధి యెట్లున్నదో? ఎట్లైననగుఁగాక! చెప్పఁగలిగిన భూతి. చెప్పలేకున్న మృతి. పర్యవసాన మెట్లైన నాయుమానసములు మృష్టాన్నము!" అని వినిశ్చయుండై భార్యతోఁజెప్పి బిడ్డల దీవించి "యిట్లైన మీనోటికి . .రము. అట్లైన మీచేతికి నీరము" అని బయలుదేఱెను.

అతని మార్గము దుర్గమంబగు మహారణ్యముగాన నతఁడు పవలెల్ల నడచుచుఁ గాయలాకులు దిని నీరముం ద్రావి రేలఁ గ్రూరసత్త్వ . .ని దరువులపైఁ బరుండుచుఁ బోయి పోయి యొకనాఁటి రేయి యొక బిల్వవనముం బ్రవేశించి యుఁ

దొక చెట్టుపైఁ బరుండెను. అర్ధరాత్రము కాఁగాఁ జెవులు చిల్లులువోవ నిర్ఘాత నినాదంబుంబోలి భయంకరధ్వని విన వచ్చెను. అవ్విప్రుఁ డదరిపడి మేలుకని మేలునకని బయలు దేఱిన నాకీ నట్టడవిని బిట్ట పిడుగేమి? యని వితర్కించుచుఁ గనులు దెఱచెను. మెఱుపువోలె మిఱుమిట్లు గొలుపు వెలుతు రతని కన్నులఁ గప్పెను. దాఁగఁబోయినచోట దయ్యాల పోరన్నట్లు లిదేమిరా తండ్రీ! శంకరా! యని మెలమెల్లన గనులువిచ్చి మరలఁ గనుసరికి ప్రమథగణంబులతోఁ బార్వతీ పరమేశ్వరు లాదెసకు వచ్చుచుండుటను దెలిసికొని "యాహా! నాపుణ్యమే పుణ్యము. నాజన్మమే జన" మని యానందాతిరేకమున నుప్పొంగి నృత్యావరోహణంబు సేసి మేనఁబులక లెగయ నానందాశ్రు ధారా సమ్మిళితనయనుండై చాఁగిలఁ బడి దండవత్ప్రణామంబు లాచరించెను. ఇట్లైదుపదిచేసిన యువనీసురుం గ్రుచ్చి యెత్తి పురాణదంపతు లిట్లనిరి. "కుమారా! భక్తచూడామణీ! నీ ప్రారబ్ధ పాపఫలము బలవత్తరమై యనుభావమైయుండ నిన్నింతకాల ముపేక్షించితిమి. ఇయ్యది మా విహారవనము. ఇందుఁ బ్రవేశించినవారికిఁ బాపక్షయంబు సిద్ధంబు. ఈ బిల్వ వనవాసులకు మేము నితము దర్శన మిచ్చుచుందుము. ఇవ్వనంబునఁ జొచ్చిల్లుటచే తిను మము దర్శించుకతమునను నీపాపంబులు నశించె. నీయుపాయము నెఱుంగుదుము. నీవు విక్రమాదిత్యుని పూ

ర్వజన్మ వృత్తాంతము నెఱుఁగఁబల్కిన నను నమ్మఁడుగావున నత
నికి నమ్మిక పుట్ట నుపాయ మెఱిఁగించు తెఱఁగునఁ జేయుము.
ఉజ్జయినికిఁ దూర్పున రెండు క్రోసుల దూరమున నొక పల్లి
య గలదు. అందొక తెలికలవాని యింటనొక కనుగ్రుడ్డి
యు మట్టియునైన యెద్దుగలదు. అమావాస్యనాఁటి రాత్రి శివ
పూజచేసి యటకేగి దానినడిగినఁ దెలియఁగలదనుము. తరు
వాతి యుదంతము నీవేయెఱుఁగఁగలవు. పొమ్ము నీకు శుభం
బగుత" మని శంకరీ శంకరులు కింకరులతో నంతర్ధానులైరి.

ఆ రాత్రి యతఁడచ్చటనేయుండి మఱునాఁడు వఱువా
త చి ప్రభాతకృత్యంబులఁదీర్చికొని పయనించి కతిపయదినం
బుల కుజ్జయినిం జేరి యుర్వీనాథుం దర్శించి యతనిచే బహూ
కృతులంది యిట్లనియె. "రాజశేఖరా! నీ పూర్వజన్మ వృత్తాం
తం బాద్యంతంబు నాకుఁ గరతలామలకంబుగఁ దెల్లంబ యై
నను నీవు నమ్మవని చెప్ప సాహసింపకున్నాఁడ. నీ వమవస
నాఁడు భవానీసహితుండైన శివుని షోడశోపచార విధుల
బూజించి తన్నైర్మల్యాక్షతలఁగొని పూర్వదిశను రెండుక్రోసు
లదవ్వుననున్న పల్లెకుఁజని యందు గాండ్లవానియింటనున్న
మట్టిదియు గ్రుడ్డిదియునగు నెద్దుపైఁ బుష్పాక్షతలఁజల్లి యడు
గుము. అది నీపూర్వజన చరిత్రము౦ జెప్పఁగల" దనిన నాప
లుకులకలరి జనపాలుం డా పాఱునిఁగని "నీపలుకులయందలి
సత్యాసత్యము లెఱుఁగు దనుక నీవిక్కడనయుండు" మని

యతఁడు చెప్పినచొప్పున నమవసనాఁడు పార్వతీ పరమేశ్వరు
ల నర్చించి పుష్పాక్షతలఁగొని ఖడ్గధారియై యొంటరియై
యేగి యా గాండ్లవాని వృషభముం గని దానిపై నవి చల్లి
“నాపూర్వజన్మ వృత్తాంతముం జెప్పంగలవేని నుడువు” మన
వుడు నా వృషభంబు మనుజవాక్కుల నిట్లనియె.

“పుణ్యాత్మా! నిన్నుఁ జూడఁగనే నాకొక విచిత్రజ్ఞాన
ముద్భూతమైనది. నీ పూర్వవృత్తాంతము నేఁ జక్క నెఱుఁగుదు.
విన నాజ్ఞానమిప్పుడ దప్పినట్లున్నది. పూర్తిగఁ జెప్పఁజాల
నను నాశయమునఁ జింతించుచుంటి. నీ నగరమునకుఁ బడ
మట నా మామడలదూరమున నున్న యడవి నొకవిశాల వట
వృక్షమున నొక పిశాచము వసించుచున్నది. రేపటి యమవస
నాఁటికి నాయొద్దికే తెంచినట్లే యచటికేగి నన్నడిగినట్టు లా
పిశాచము నడుగుము. అది నీకుఁ జెప్పఁగలదని మౌనము
వహించి మఱి మాటాడకుండెను.

రాజామాటల కాశ్చర్యపడి యాపైఁ జేయునది లేక
మరలివచ్చి మఱుచటి యమవసనాఁడు యథారీతి శివపూజ
యొనరించి యక్షతలు పూలు నీళ్లు తీసికొని వృషభముచెప్పిన
యడవికిఁ బోయి మఱ్ఱిచెట్టును సమీపింపఁగనే యా పిశాచ
ముగ్రభైరవంబునఁ బైఁబడవచ్చెను. విక్రమార్క భూపయం
డు ధీరుండుగాన బెదరక తాఁ దెచ్చిన నీరు పూవు లక్షతలు
చ “ఓయీ పిశాచమా! నా పూర్వజన్మవృత్తాంతము సెవఁ”

మని యడిగెను. ఆ పిశాచము దుశ్చేష్టలుమాని గోడుగోడునఁ గొంతసే పేడిచి కొంతవడి కిట్లనియె. "రాజేంద్రా? భగవత్ప్రసాదముచే నీ వృత్తాంతము నావృత్తాంతము జ్ఞప్తికివచ్చినది కాని రెండు నిముసములకే నా యీ కొంత తెలివి పోవునట్లున్నది. ఆవల నావలనఁ నీకుఁ గీడు మూడును. ఈ క్షణ మీచోటు దాఁటుకొనుము. రాఁగల యమావాస్యనాఁటికిఁ దొమ్మిదేండ్ల యీడుగల నీ పెద్దమంత్రి కూఁతు నేకాంతమున నన్నడిగిన ట్లడుగుము. సర్వ మెఱుకయగుఁ బో" మ్మని తొందఱపఱిచెను. రా జతిత్వరితగతినిమరలి పురంబుసొచ్చి యేమి చిత్రమని పరిపరివిధములఁ దలఁచుచు నారాత్రిగడపి మఱునాఁడుదయమున నమాత్యవరుం బిలిపించి "రాఁగల యమవస రాతిరి నీయింట శివపూజ యొనర్చి నీకొమరిత నేకాంతమునఁ జూడవలయు. తగిన యేర్పాటు గావింపు" మనిన మంత్రి 'చిత్త' మని యంగీకరించి యింటి కేతెంచి యిల్లాలికిం జెప్పెను. కారణమేమైయుండునని వా రిరువు రాలోచించిరి. కడకుఁ బుడమిపతి కన్యకను గాళికి బలియిచ్చునని తీరుమానించుకొనిరి. కోటరాంతర్వహ్నివలె దుఃఖదావానలము వారి హృదయముం దహింపఁజొచ్చెను.

అమావాస్యయు రానేవచ్చెను. నాఁడు మంత్రి కుటుంబమున నొక్కరికేని కత్తివాటువేసిన నెత్తుటిచుక్కలేక మొంగము పేలియుండెను. రాజును గాదనఁగలరా? రాతి

కాఁగానే రాజువచ్చి తనకై శుభ్రపఱచియుంచిన గదిలోని కా కన్యకం దోడ్కొనిపోయి శివపూజఁ బరిసమాప్తి నొందించి యా బాలికపై జలంబు ప్రోక్షించి పుష్పాక్షతలుచల్లి “కుమారీ! నా తొలిబాముకత చెప్పుమా” యని యడిగిన నకన్య యిట్లనియె. “రాజేంద్రా! దేవతల యనుగ్రహముచే నా కెన్నఁడులేని యింత తెలివి యిప్పు డుదయించుచున్నది. మన వృత్తాంతము నా కనులయెదుట నాటకమాడినట్లు నాకుఁ బొడకట్టుచున్నది. దానిఁ జూచి నీకుఁ జెప్పుచుంటి.

గౌతమీతీరస్థమగు నొక మునిపల్లెను రామశాస్త్రి యను బ్రాహ్మణుఁడొకండు నిరుపేదయయ్యు నిత్యసత్యవ్రతుఁడై భిక్షుకుండయ్యు ధర్మమార్గానువర్తియై యుండెను. అతని కొకభార్యయు నొకకొడుకుం గోడలునుండిరి. ఒకప్పుడు మూఁడహోరాత్రంబులు విడువని జడిపట్టి సుడిగాలికొట్టి ప్రజలకు బహు నష్టకారకమయ్యెను. ఆ రామశాస్త్రి కుటుంబ మీ మూఁడుదినంబు లుపవసింపవలసివచ్చెను. నాలవనాఁడు తెఱపి యగుడు నా బ్రాహ్మణుండు భిక్షార్థియై యూరిలోని గెను. పోయిన యిండ్లు గోడలు చక్కఁబఱచుకొనువారును గ్రుక్క తిరుగక యుక్కిరి బిక్కిరియై చచ్చిన గొఱియలమందలఁ జూచి విలపించువారును, చెఱువులు తెగి మిట్టలు పల్లంబు లేకపై పొలములు పాడువడిన వానిం జూడఁబోవువారును, వీధులఁ జక్కఁబఱచుకొనువారును బండినపైరు నీటిపాలయ్యెనే యని

శోకింపుచాయుడునై జనములు బిక్కఁదోఁపక వారి కార్యా లోచనముల మునుము నిమగ్నులై యుండుటచే నితనికిఁ జాలి నంతబిచ్చము దొరకదయ్యెను. దొరకినదానిం గొనివచ్చి భార్యచేతి కియ్యఁగా నామె వండి సిద్ధము చేసెను. దేవతార్చన కాఁగానే యామె నలువురకు నున్నదానిని సమముగ వడ్డించెను. అప్పుడు నలుగురు నిరుపేద అతిథు లతని యింటికి వచ్చి "ఆఁకటిచేఁ బ్రాణము లెగిరిపోవుచున్నవి. బ్రాహ్మణులము. కొంచె మన్నముండిన నిడి ప్రాణరక్షణపుణ్యము గట్టికొనుఁ" డనిరి. వారిమాటలు వినఁగనే యతనింటిల్లాలు తన మగనిగుణము తాఁ జక్కఁగా నెఱిఁగినదికాన వెంటనే లేచి వందివలె ఘుష్టించుచు "నేనీయను. నా కొడుకుదీయను. నీకోడలిది నీది యేమైనఁ జేసికొనుఁ" డని తన విస్తరిని తన కొడుకు విస్తరిని మఱుఁగునకుఁ గొనిపోయి కుమారునితోఁ దానును భుజించెను. ఆ గృహస్థు కోడలిఁగని "అమ్మా! నీయుద్దేశమేమి?" యన నామె "మీకోపాటి కాన" ననియెను. అంత వారిరువురియన్నము నతిథుల కిరువురకుఁ బెట్ట వారు వారించి "ముసలివాఁడవగు నిన్నును ముగుదయగు నీమెనువదలి మేము భుజింపఁజాలము. ఉన్నయన్నము నలువురుభుజింత" మని యా కోడలిచే వడ్డింపఁజేసి నలువురు భుజించిరి. మహీపతీ! ఆ గృహస్థుఁడవే నీవు! కయ్యాళిగండ్లైన పనుల సుఖదుఃఖములఁ జూడింపక కుక్షింభరియైన యాయమయే నీవు మున్ను

చూచిన పిశాచి! స్వబుద్ధిలేక తల్లి యెట్లీడ్చిన నట్లు పోవుచుం డిన మూకమూఢుఁడే నాకు గద్దుగాఁ బుట్టెను. చేసికొన్నవారికిఁ జేసికొన్నంత! పెండ్లి పుట్టవలయునని పెద్దలు చెప్పుదురుగదా" యని యా కన్య యూరకుండెను. అతని కోడలవు నీవేకదా యన సిగ్గునఁ దల వంచి "ఔను" నని తల యూఁచెను.

తదుపరి పృథ్వీపతి మంత్రిపుత్రికతో గదినుండి వెలికి వచ్చి మంత్రితో "నీకొమరితను నాకోడలుఁగఁ బరిగ్రహింతును. నీ వేమందువు?" వని యడుగఁ బోయిన ప్రాణములు మరల బొందిని బొందిన పోలికని సంతసించి 'ప్రభులచిత్త' మని ప్రధానుఁడనియెను. నరేంద్రుండు సుముహూర్తంబున వివాహ మొనరపి యాశంకరభట్టునకు వాగ్దత్తప్రకారము గుమ్మడికాయ యంత బంగారమును గోరిన గ్రామంబుల నొసంగి మఱియు బహువిధముల బహూకరించి పంపెను.

క॥ పెట్టిన దినములలోపల
నట్టడవుల కైన వచ్చు ♦ నానార్థంబుల్
పెట్టనిదినములఁ గనకపు
గట్టెక్కిన నేమిలేదు ♦ గదరా సుమతీ!

## కాలము

కాలము దాఁటరాని ప్రవాహమువంటిది. సమస్తప్రాణులు దీనిలోఁబడి కొట్టుకొనిపోవుచున్నారు. మహాత్ములు

కొందఱే దీనిం దరించి శాశ్వతానందమను నావలిగట్టుం గాంతురు. కాలము నాలుగు గొప్పభాగములు గలది.

అందు కృతయుగము పదునేడులక్షలు నిరువదియెనిమిదివేల సంవత్సరములు గలిగి మత్స్యకూర్మ వరాహ నారసింహావతార ధారియగు భగవంతునిచే ధర్మముద్ధరింపఁబడి నాలుగుపాదముల నిలువ, నస్థిగత ప్రాణిసమూహ మిరువదివేలయేండ్లాయుఃపరిమాణము గలిగి యొప్పారఁ గనుఁగడు ధరకాలమై విలసిల్లె.

త్రేతాయుగము పండ్రెండులక్షల తొంబదియాఱువేలయేండ్లుగలిగి దేవదేవుని వామన, పరశురామ, శ్రీరామావతారములచే విరాజిల్లెను. అప్పటి మనుష్యులు మాంసగతప్రాణులై పదివేలు నైదుమాత్రేండ్లాయువు గలిగియుండిరి. మూఁడుపాళ్ళ ధర్మము నిలిచియుండెను.

మూఁడవదగు ద్వాపరం బెనిమిదిలక్షల యఱువదినాలుగువేలయేండ్ల పరిమితిగలదై బలరామ రామానుజావతారధారియగు పరమేశ్వరునిచే ధర్మము రెండుపాళ్లు నిలుపఁబడినదై ప్రకాశించెను. ఆకాలపు మానవులు రక్తగతప్రాణులై రెండుపాళ్ల ధర్మమున నిలిచి వేయియేండ్లు జీవితకాలముం గలిగి యొప్పారుచుండిరి.

నాలవదగు కలియుగంబు నాలుగులక్షలముప్పదిరెండువేలయేండ్లు పరిమితిగలదై బుద్ధ శ్రీనివాస కల్క్యవతారధారి

యగు నారాయణునిచేఁ బాదమాత్రధర్మ మద్ధృతముకాఁ గాఁ బ్రజ లన్నగత ప్రాణులై నూఱువత్సరము లాయుష్కాల ముకలిగి మెలఁగ వెలుఁగుచున్నది.

ఈనాల్గుయుగములు చేరినకాలమునకు మహాయుగ మని పేరు. మహాయుగములు వేయియైనఁ బదునాలుగు మన్వం తరములగును. అది బ్రహ్మ కొక పగలగును. మఱి యంత కాలము రాత్రియగును. అనఁగా రెండువేల మహాయుగము లైన బ్రహ్మ కొకదినము. అట్టిదినములు మున్నూట యఱు వదియైన నొక సంవత్సరము. నూఱుసంవత్సరము లట్లు జరిగి నచో బ్రహ్మయాయువు పరిపూర్తి. బ్రహ్మ యాయుష్కాల మున మొదటి యేఁబదిసంవత్సరములు పాద కల్పమని వెనుక టి యేఁబదివత్సరములు వారాహకల్పమని యందురు. ముం దటిసగమునఁ బరమేష్ఠి విష్ణునాభి పద్మమున నుదయించి ప్రపంచసృష్టిచేయ నారంభించెను. అందుచే నాకాలము నకుఁ బాద్మకల్పమని పేరుగలిగెను. వెనుకటి సగమున నాది నారాయణుండు వరాహమూర్తియై చెడియున్న భూమి నుద్ధ రించెఁ గావున దానికి వరాహకల్పమని పేరుగలిగె.

ఇప్పుడు వారాహ కల్పమున నేడవవాఁడగు వైవస్వ త మన్వంతరము జరుగుచున్నది. మనకాలము సూర్యచం ద్రాది నవగ్రహముల చలనముం బట్టియు నశ్విన్యాది నక్షత్ర చలనముం బట్టియు గుణింపఁబడుచున్నది. ప్రపంచాదినుండి

యిప్పటి కెంతకాలము జరిగినదో తెలిసికొనవలసినయెడ నిప్పటి గ్రహస్థితులను బట్టి విలోమగణితముచేసి ప్రభవసంవత్సర చైత్రశుద్ధ ప్రథమ ఆదివారము సప్తగ్రహములు మేషరాశి యొక్క మొదటియంశములో మొదటికళలో మొదటివికళలో నెప్పుడుండెనో తెలిసికొను పక్షమున స్పష్టముకాఁగలదు.

మనుష్య సంవత్సరములకుఁ బ్రభవ విభవాది నామములరువది గలవు. ఇదియు నొక గొప్ప పరిమాణమేయగు. సూర్యుని యుత్తర దక్షిణ స్థితులనుబట్టి యుత్తర దక్షిణాయనము లేర్పడినవి. వృక్షాదుల పరిణామములను వర్షాతపాదులనుబట్టి వసంతాది ఋతువులారేర్పఱుపఁబడినవి. ఒకఋతువున రెండుమాసము లేర్పడి చైత్రాది నామములచే నొప్పుచుండు. చంద్రుఁడు పూర్ణిమనాఁడే నక్షత్రముం గూడియుండునో యా నక్షత్రము పేర నామాసము పేరేర్పడు. ఒకమాసమునఁ జంద్రుని వృద్ధిక్షయములనుబట్టి శుక్లకృష్ణములను పక్షద్వయంబు ప్రవర్తిల్లు. పక్షమునఁ బ్రథమ ద్వితీయాదితిథులు పదునైదు గలవు.

తిథిశబ్ద భవమే తేదియని వాడఁబడుచున్నది.

భూమియే తిరుగుచున్నదనుటకుఁ బురాణాదులయందును బ్రమాణములు గలవు. అంతియకాక భూమి సూర్యునిఁ జుట్టివచ్చుచున్నదన్నను సూర్యుఁడు భూమినిఁ జుట్టివచ్చుచున్నాఁడన్నను గణితపరిమాణమునకుఁ జిక్కు రాఁజాలదు.

సూర్యశబ్దము పుల్లింగము. భూశబ్దము స్త్రీలింగము. భూమి సూర్యునిఁ జుట్టివచ్చుకాలమునకే సంవత్సరమని పేరు చంద్రుఁడు భూమిని జుట్టివచ్చు కాలమునకు మాసమని పేరు.

తిథి యనగా నొకదినము. రాత్రింబవలు చేరినది. చంద్రుఁడొక నక్షత్రమునందుండు కాలము. నక్షత్రము లిరువదియేడు. జ్యోతిశ్చక్రమున గణనమున కనుకూలముగ నిరువదియేడు గుర్తులుంపఁబడి వానికి నశ్వినీ భరణ్యాది నామములుంపఁబడినవి. రెండుంబావు నక్షత్రముల కొక రాశియని పేరు. మేషాదిరాసులు పండ్రెండు. సూర్యుఁడొక రాశియందొక మాసముండును. ఒక దినమునఁ జీఁకటిగల సగఁబాలు రాత్రియనియు సూర్యకిరణప్రసారమువలన వెలుతురుగల భాగము పగలనియుఁ జెప్పంబడు. దినమున కఱువది ఘటికలు. ఘడియ కరువది విఘటికలు. ఏడున్నఱగడియ (ఘటిక) లొక యామము. రెండుంబావుగడియ లొక (గంట) హోర. దినమున కిరువదినాలుగు హోరలు.

దినము లేడైన నొకవారము. ఆది, సోమ, మంగళ, బుధ, గురు, శుక్ర, శనివార నామంబుల నా వారసప్తకంబు ప్రసిద్ధంబై యుండు. 1. సూర్యుఁడు. 2. శుక్రుఁడు. 3. బుధుఁడు. 4. చంద్రుఁడు. 5. శని. 6 గురువు. 7. అంగారకుఁడు లేక మంగళుఁడు. ఈక్రమమున దినమున సూర్యోదయమునుండి మఱునాఁడు సూర్యోదయమువఱకు నొక్క హోర

కొక్కం డధిపతియగును. అందుచే మొదటిదినమున మొదటిహోరకు నాదిత్యగ్రహమని యెన్నఁబడు సూర్యుఁ డధిపతి యగుటచే నాదినమున కాదివారమని పేరయ్యె. రెండవ నాఁడు మొదటిగంట (హోర)కుఁ జంద్రుఁ డధిపతి యగుఁ గాన నాఁటికి సోమవారమని పేరుగలిగె. ఇట్లే తక్కినవానిని గ్రహింపఁదగు. భూగోళముచుట్టును జంద్ర బుధ శుక్ర రవి మంగళ గురు శను లనుక్రమముగ దూరదూరముగఁ దిరుగుచున్నారు. ఈ క్రమమున నాలవ నాలవ గ్రహముల లెక్కించుచువచ్చినను వారముల యుత్పత్తి తెలియవచ్చుచున్నది. వారమనఁగా 'వంతు' అని యర్థమున్నది. ఏడుగురు నొక్కవరుస యధికారులైన కాలమునకు వారమని పేరు.

యామములు రెండైన నొక ముహూర్త మనఁబడు. ముహూర్తములు మూఁడుమ్మువ్వాతికఘడియలు లేక రెండునాడులకాలము. నాడికిఁ బదునైదు లఘువులు. లఘువునకుఁ గాష్ఠలు పది. కాష్ఠకు క్షణములైదు. క్షణమునకు నిమిషములు మూఁడు. నిమిషమునకు లవములుమూఁడు. లవమునకు వేధలుమూఁడు. వేధయన త్రుటిశతకాలము. త్రుటికిం త్రసరేణువులు మూఁడు. త్రసరేణువున కణువులుమూఁడు. అణువునకుఁ బరమాణువులు రెండు. పరమాణువనఁగా సూక్ష్మముకంటె సూక్ష్మమైన యణువు తన స్థానమునుండి తానాక్రమించుకొన్నంత స్థలమును దాఁటుకాలము.

కం॥ కాలము జనుల సృజించును
కాలము రక్షించుఁ ద్రుంచుఁ ♦ గాలముచూడన్
మూలము మమ్మూర్తులకును
కాలము సుఖదుఃఖకార ♦ కము విద్యార్థీ!

## 2. ప్రాణులు

ప్రపంచమునఁగల జీవకోటు లెనుబదినాలుగు లక్షలు. అనఁగా నెనుబదినాలుగులక్షల జాతులు. అందు వృక్షజాతు లిరువదిలక్షలును పక్షి తెగలు పదిలక్షలును జలచర సమూహంబులు తొమ్మిదిలక్షలును పశ్వాది మృగకులంబులు ముప్పదిలక్షలును పదునొకండు లక్షలు క్రిములును నాలుగులక్షలు మనుష్యభేదంబులును గలవు. మనుజులలో స్త్రీపురుషులని మొత్తముమీఁద రెండేజాతులున్నను గుణశీల మతస్వభావంబులంబట్టి యన్ని తెగ లున్నవని యూహింపఁదగు. ప్రతి ప్రాణియుఁ దన యాయువు పూర్తికాఁగా మృతిఁజెందునని మన మెఱుఁగుదుము.

మనుష్యుఁడు మృతినొందిన తరువాతఁ బంచభూతములచే నిర్మితమైన యీ దేహము పంచభూతములలో నైక్యమగును. తరువాత వాని పుణ్యపాపములకుఁ దగిన జన్మము వానికి లభించును.

మనకు నూఱేండ్లా యువున్నను, అందఱు నూఱేండ్లు బ్రతుకుటలేదు. మనము చేయు కార్యము ననుసరించి మన యాయుఃపరిమితి మాఱుచుండును. మహర్షులాయుర్వృద్ధికరములగు మార్గములను గనుఁగొని తమ యాయువును వృద్ధిపఱచుకొందురు. కొందఱు మృత్యువునే జయింతురు. రావణుఁడు, దశరథుఁడు, రాముఁడు మొదలగువారు తమ యాయువును వృద్ధిచేసికొనినవారలే. పరశురాముఁడు, హనుమంతుఁడు మొదలగువారు మృత్యుంజయులు. మన దుష్కార్యములవలనను, కాలమునఁ గుడిచి, కట్టి, పరుండి, లేచి, సత్కార్యాచరణముఁ గావింపకపోవుటవలనను మన యాయుష్కాలము క్షీణించుటయే కాక, యకాలమరణముకూడ సంభవించుచున్నది. మనము మృత్యువును జయింపలేకపోయినను, కులశీల మతాచారముల వదలక యనుష్ఠించి యాయుర్వృద్ధియైనఁ జేసికొని మఱుజన్మముననైన మంచి గతి గలుగు మార్గమును వెదకుచున్నారమా? యిది కొంతవఱకు జీవితతత్త్వమును బరిశీలనచేసికొనుట మనకు ముఖ్యధర్మమై యున్నది. మనుష్యజన్మ మెత్తినతరువాత సంపాదింపవలసినవి నాలుగు. అవి ధర్మము, అర్థము, కామము, మోక్షము అనునవి. ధర్మన్యాయ మార్గమును వదలక యర్థసంపాదనముచేసి ధర్మవిరుద్ధముకాని కామంబు లనుభవించి మోక్షయత్నముం జేసి విముక్తుఁ గుటయే యీ పురుషార్థములకు ముఖ్యతాత్పర్యము.

భగవంతుఁడు జగన్నాటక సూత్రధారి. మన మతనిచే లోకమనెడు నాటకరంగమునకుఁ బంపఁబడిన వేషధారులము. సూత్రధారుని యిష్టముచొప్పున వర్తించిన వారినే తనయొద్దకు రానిచ్చును. అక్రమరీతి వర్తించిన వారిని శిక్షించును. దగ్గఱఁ జేరనీయఁడు. కాఁబట్టి భగవదాజ్ఞాబద్ధులమై ప్రవర్తింపవలయుట మన ముఖ్యధర్మము. చావెట్లును దప్పునది కాదు. ఎప్పుడు మనలఁ దన నోట వేసికొనునో యెఱుఁగము. కావునఁ గాలహరణము సేయక సత్కృత్యము లొనర్చి భగవత్కృపకుఁ బాత్రులమగుట మేలు.

ఒక రాజున కొక సేవకుఁడుండెను. వాఁ డెల్లప్పు మృత్యుదేవతా ధ్యానపరాయణుఁడు ఒకనాఁడా రాజు కొంత సేనను దనతోఁ దీసికొని యా సేవకుఁడు వెంటరా నటవుల కేగి పగలెల్ల వేఁటాడి యా రాత్రి యచ్చటనే పటకుటీరంబులు వేయించి విడిసెను. ఆ రాత్రి యా సేవకునకు బొత్తిగ నిద్దుర పట్టలేదు. ఒంటరిగాఁ బరుండిన నేవేళ కేమి తటస్థించునో యని సేనామధ్యమునఁ బరుండెను. సైన్యమెల్ల గాఢనిద్రం దోఁగుచుండెను. వానికి మాత్రము నిద్దుర రాలేదు. కన్ను కొనిన నేమో యని ముఖముపై వస్త్రముం గప్పికొనక, కనుమూసిన నేదివచ్చి నెత్తిపైఁ బడునో యని కనుమూయక మాటిమాటికి లేచి నలుదిక్కులఁ గలయఁ గనుఁగొనుచుండెను. ఇట్లున్న వాని కన్నులకు సమీపపర్వతముపై నుండి దిగివచ్చుచున్న ఘోరసర్ప మొకండు లోచన గోచరమయ్యె

ను వాని భయమునకు మితిలేక పోయెను. అది త
కఱవవచ్చుచున్నదని స్థిరపఱచుకొని యతఁడు నిప్పుద్రొక్కిన
క్రోఁతివలెఁ దహతహపడఁజొచ్చెను. అకాలసర్పము క్రమ
క్రమముగా సమీపించి సేనామధ్యమునఁ బ్రవేశించెను. భీరుఁ
డు దానినే తెప్పవాల్పక చూచుచుండెను. ఆ పిఱికి భయ
ముచేతనో ధైర్యముచేతనో చెప్పఁజాలముకాని దానిని వెన్నం
టి చనెను. అది తటాలున నొక తేలై ప్రభువు పరుండిన
కుటీరమునఁ బ్రవేశించి మంచమెక్కి యతనిఁ గుట్టి మరలఁ
దప్పించుకొని బయటఁబడెను. తేలుకుట్టినదని రాజఱచుచు
లోఁకనెను. అందఱును లేచి చికిత్సలు ప్రారంభించిరి.
కొంతసేపటికి రాజు మరణించెను.

ఇది పామైవచ్చి మరలఁ దేలై రాజును గుట్టి యెట
కుఁ బోవుచున్నదియోఁ గనుఁగొన నుత్సహించి యాయువు
దానిని గనిపెట్టుచుఁ బోవుచుండఁగనే రాజు మరణవార్తయు
వానిచెవింబడెను. ఆ వృశ్చికము కొంతదవ్వేగిన పిదప నొక
తోఁడేలై గొఱ్ఱెలమందలోఁ బ్రవేశించి కొన్నింటిని జంపి,
పదపడి పులియై యొక మాలమూఁగంజొచ్చి కొన్ని పశువులం
బొరిపుచ్చి, యటనుండి బయలుదేఱి యొక స్త్రీరూపము
ధరించి యొక బాటసారి కెదురయ్యెను. ఆ మాయలాఁడి
వానిని వలపించి కౌఁగిలించి యాకౌఁగిలింతతోనే వాని యసు
వులఁగొనిపి, యచ్చటనుండి కొంతదూరముపోయి నాలుగుత్రోవ

లం గలియు సమతలమున నొక మండపాకృతితో నిలిచెను. వెంటనే వర్షము ప్రారంభమయ్యెను. నలువంకలనుండి పదుగురు తెరువరులు పరుగెత్తివచ్చి యామండపముక్రిందఁ జేరిరి. మన వెఱివాని మాత్రము దానిక్రిందికిఁబోవ సాహసింపఁడయ్యె. వాన వెలియక మునుపే యా మండపము కూలఁబడ నందుఁ జేరినవారి కల్లో జీవసమాధి సిద్ధించెను. కొంతసేపు తాళి యొక బ్రాహ్మణుఁడా మండపమునుండి వెలువడి నడచుచుండెను. ఇదే మంచి సమయ మని యా భీరుఁడు పరుగిడి యా బాఁపని గడ్డముగఁ గాళ్ళపైఁబడెను. 'లెమ్ము. నాయనా! నీవేల నా కాళ్ళపైఁబడుచున్నావు? చెప్పు' మని విప్రుఁ డడుగ వాఁ డిట్లనియె.

"అయ్యా! నీవు మొదటఁ బామవై, పిదపఁ [illegible]లవై రాజుంగుట్టి చంపి, పదపడి తోఁడేలవై గొఱియలఁ గొన్నిటిఁ జీల్చి సమయించి, తదనంతర మొక స్త్రీవై యొక బాటసారిని యమపురికనిపి, యాపై నిట మంటపమవై పదుగురఁగూల్చి, బాఁపనవై యిప్పుడెటఁ బో చున్నావు? నీ వ్యాపారము చూడఁ జిత్రముగ భయంకరముగను నున్నది. నీవృత్తాంత మానతీయవే" యనఁ గపటభూసురుండు వాని కిట్టులనియె.

"నేను మృత్యుదేవతను. ఏదేనొక నెపంబిడి ప్రాణుల సమయించుట నా వ్యాపారము. దాని [illegible] లెన్నియేని రూపములం దాల్చుచుందును. నీవు స[illegible] వ్వుడు ధా[illegible]

చుచుంటం జేసి నీ కగపడితి” ననవుడు భీరుండు, వడవడ వడంకి “దైవమా! నీవు ప్రత్యక్షమైన తరువాత నన్ను వదలి పోదు వాయేమి?” యని తొట్రుపాటునం బలుక, “కుమారా! నీకిప్పుడు కాల మాసన్నముకా లేదు. ఇకం బదియవ నెలలోం బదునొకండవ నాండు పగలు పదునైదు గడియలకు నేనుం గు కాలిక్రింద నికుం జావుగలదు పో” మ్మని మాయపాటుం డదృశ్యుండయె.

అటుపైం దొమ్మిది మాసము లిటనటం గాలక్షేపము చేసి యా వెఱపరి పదవ నెల ప్రాపింపంగా దిగులుపడి మిత్తివాత బడక తప్పించుకొను నుపాయమాలోచించి యొక యిఱుకైన ముఖద్వారముగల గుహం జొచ్చి యేనుంగిక్కడ కెట్లు రాంగ లుగునను ధైర్యమునం బ్రొద్దుపుచ్చుచుండె. తన యెదుటనే యన్నిరూపముల ధరించిన మృత్యువు మాతంగ రూపమున నీ గుహం జొరంజాలదా? అను సంశయము మాత్రము వాని మదికి దోంపలేదు. అల్పమతికి దీర్ఘాలోచన మెక్కడిది?

ఆగుహాకు సమీపమునం గ్రోసున కావలంబట్టణ మొకం డుండెను. ఆపట్టణపురాజొక పొట్టేలును బందెమునకై ప్రియముతోం బెంచుచుండెను. ఒక రాత్రి దొంగలు రాజ నగరు చొచ్చి యాతగరునెత్తికొని పోయిరి. రాజభృత్యులు వెంట నే మేలుకాంచి తగరుంగానక నలుదిక్కుల వెదకసాగిరి. కొందఱు భటులు దొంగల యడుగుల జాడం గనిపెట్టుచుంబోయి

మన భీరుఁడు మృత్యుభయమునదాఁగియున్న గుహఁజొచ్చిరి అట వారికిఁ బొ ులు మాంసపు రాశియుఁ జర్మమును వాని మొదుటనే కన్పట్టెను. కాని వానికిమాత్రము కనఁబడినదికాదు. ఆసొత్తులతోడ భటులు వానిఁబట్టికొని తెచ్చి రాజునకొప్పగించిరి. రాజాగ్రహించి వాని నుఱిదీయు ను త్తరువిచ్చెను. మారకు లుఱిదీసిరి. ఉఱిత్రాడు తెగి వాఁడు దిగువఁబడెను. చావలేదు. ఉఱిత్రాడు తెగి చావుతప్పిన వానిని మరలఁ జంప రాదని రాజులకు ధర్మశాసన మున్నది. రాజు వానిసబిలిచి 'నీవేల చోరవృత్తి నవలంబించితివి? ఈ వృత్తిని వదలుము' అని బుద్ధిచెప్పెను. దానికి వాఁడు ప్రత్యుత్తరంబుగాఁ దన యావద్వృత్తాంతమును దెలియఁబఱచెను.

ప్రభుండు వాని మాటలువిని వాఁడు చోరుఁడు గాఁడనియుఁ బిచ్చిపట్టి యారీతియయ్యెననియు నిశ్చయించెను. మృత్యువు ప్రత్యక్షమగుటను మాత్రము నమ్మలేదు. వానికా భయమును దీర్ప నృపతి సంకల్పించుకొని వాఁడుచెప్పిన దినము గడియలు తప్పకుండునట్లుగ నదేవేళకు మూఁడుత్రోవలు గలియుచోటునకు మాంత్రికులతోడ వానిని గొనిపోయెను. ఆయుధపాణులై సైనికులు చుట్టును నిలిచియుండిరి. భయనివారక మంత్రముల జపించుచుఁ దంత్రముల నిర్వర్తింపుఁడని భూపతి మాంత్రికుల కుత్తరువిచ్చెను. ఏనుఁగువలని భయము వానికుండుటవలన మాంత్రికు లొక మ యేనుఁగు

ను దయారుచేసి మంత్రతంత్రములతో వానె నెఱవరి చెప్పిన లగ్నమునకు సరిగా దిగఁదుడిచి పాఱవైచుటకై చుట్టి త్రిప్పి వాని బొమ్మపైనుంచిరి. మృత్యుదేవత తత్క్షణమే యుండాసన్నయై వాని ప్రాణములఁ గొనెను. అందఱు నాశ్చర్యపడిరి.

తే-గీ॥ మృత్యు వెప్పుడు నెత్తిపై ♦ నృత్యమాడు
నాయువల్పంబు కోర్కెల ♦ కంతు లేదు
నిర్మలాంతఃకరణులయి ♦ ధర్మమార్గ
మునను నడచుటే జనులకు ♦ ముఖ్యమగును॥

## 21. కలి మహిమము

తే-గీ॥ కౌరవావళిఁ గదన రం ♦ గంబునందు
రూపడఁగ నొనరిచి హస్తి ♦ నాపురమ్ముఁ
గాఁపురమ్ముగ సకలభూ ♦ కాంతు లెలమిఁ
దమ్ముఁ గొలువంగఁ దమ్ముల ♦ క్రమ్ముదలను
ధర్మజుఁడు పాలనముచేసె ♦ ధర్మఫణితి
భరతఖండము ముప్పది ♦ వత్సరములు
అంత నొకనాఁడు శ్రీకృష్ణుఁ ♦ డరుగుదేరఁ
బాండవు లెదుర్కొనుచు భయ ♦ భక్తులలర
నాసనంబిడి యర్ఘ్యపా ♦ ద్యాదికముల
గౌరవించి యనేక స ♦ త్కథల నతని

వలన వినుచుండి రఘురుకు ని ♦ ర్వచ్చెదడుగఁ
గాలమహిమంబు చెప్పంగఁ ♦ గడఁగె శౌరి
సర్వధర్మప్రపూర్ణమై ♦ జరగుఁగృతము
మూఁడుపాళ్ళు ధర్మంబున ♦ మొనరుఁ ద్రేత
ద్వాపరమ్ములఁ సగఁబాలు ♦ ధర్మమెనయుఁ
గలిని ధర్మదేవత యొంటి ♦ కాలనడుచు
నదియుఁ గొంతకాలమునకు ♦ నటవిఁగలియు
సంతసన్యాయ మెల్లెడ ♦ నలమికొనును
వికమత్యంబుచెడు, రేఁగు ♦ వ్యసనములును
సర్వధర్మకార్యంబులు ♦ సమసిపోవు
నిఖిల పాపకృత్యంబులు ♦ నెగడు నటుచు
లలిత మృదుమధురరసనం ♦ కలితవాక్య
సంతతులఁ బార్థులప్రాదులు ♦ సంతసిల్ల
విందుగుడువంగ వీనులు ♦ వినుచుండె
ధర్మజుఁడు లేచి "మాధవా! ♦ ధరణినిట్టి
చెందుఁగల్గునే? నృపులు లే ♦ కుండరో కృష్ణా!
దండనమ్ములు లేవో! శా ♦ స్త్రములు లేవో!
నమ్మఁగాఁజాల" ననుచుండ ♦ నెమ్మి మీఱ॥ 7

॥ ఇరువురు తెరువరు లురవడి
నరుదెంచి ముకుందునకుఁ బ్ర ♦ ణాత జలకొగి

వరుసక్రమమున్మనఁ జాఁగిలి
మొఱఁగినతరువాత నొక్కఁ ♦ డిట్లనిపలికెన్॥ 8

ఆ-వె॥ "నాకుమారులార! ♦ నావిన్నపంబాల
కింప వేఁడుచుంటిఁ ♦ బాపమండి
గంగ కేగుచుండి ♦ కడఁక నాతపమున
కోడి యొక్క తరువు ♦ నీడ నిలిచి 9

క॥ ఈమాట నచటఁగాంచితి
నామీఁద నిదేఁదొకొక్క! ♦ యిందుమఱచి వా
రేమిగ దుఃఖాతురా! యని
యామాటనుగొంచు వేగ ♦ యరుదేరంగన్ 10

ఆ॥ దారి నితనిఁగంటిఁ ♦ దర్కించి యీతని
మాటవలన నితని ♦ మాటయనుచుఁ
దెలిసి యిటుఁబోవఁ ♦ దీసికొనక వల
దంచు నుడువ నేను ♦ నప్పుడంటి 11

ఆ॥ ఒరులసొత్తుమఱచి ♦ యరిగినయంతనే
యపహరించుటెంత ♦ కృపణవృత్తి?
పరులు మఱచి విడుచు ♦ వస్తువులను వారిఁ
దెలిసి యిచ్చుటరయ ♦ ధీరవృత్తి 12

క॥ ఓపుణ్యాత్మక! నన్నుం
బావంబునఁ గూలఁద్రోవ ♦ బాల్యకుదీనిన్

నీ - ...న్యవృద్ధిఁ గాఁగొని
యావన్నుఁదరింపఁజేయు ♦ మయ్య! మహాత్మా!

సీ॥ ఈ ధనము నీది యని మది ♦ నెఱిఁగి యెఱిఁగి
నీవు వలదన్న నే నెట్లు ♦ నిలిపికొందు
నింతకంటెను నీచంబిఁ ♦ కేది కలదు!
దీనిఁగొని నన్ను ధన్యుఁగాఁ ♦ జేయుమయ్య! 14

క॥ అని పలువిధములఁ బ్రార్థిం
చిన నాతఁడు వినకనన్నుఁ ♦ జిక్కులఁబెట్టన్
ఘనులు నుదారులు మీరయి
నను నిప్పింపుం డతని ధ ♦ నమ్ము నతనికిన్" 15

తే॥ అన ద్వితీయుఁ డిట్లను వాని ♦ "కనఘులార!
యీధనము నాధనంబైన ♦ నేల నన్ను
వదలి యితని కగపడుఁ ♦ బరుని చెంద
వలయు దాని నే నేలీల ♦ వలవఁదగును? 16

క॥ సిరి యతి చంచల; యొకచో
వరుదారఁగ నిలిచియుండ ♦ దరయఁగఁదా నె
వ్వరిఁ జేరవలెనొ వారిం
దఱియును; దదితరులుగోర ♦ ధర్మమిదానిన్॥ 17

తే॥ అతని సొత్తుగావున నది ♦ యతనిఁ జేర
నతఁ కొనిపోవనింపు ♦ ణ్యాత్ములార!"

యనిన ధర్మజుఁ డావల్కు ♦ లాలించి
యొల్లఁ దీర్పఁగఁ దోఁపక ♦ కృష్ణుఁజూచె. 18

క॥ వనజాక్షుఁడు యుధిష్ఠిరుఁ
గని యిట్లను "ధర రాజ! ♦ కడు భ్రమగతిఁ
మన కొంకయొక కరుగవలయు
మనము వారలు దనకు వీరు ♦ మనలుమరిచటన్॥

క॥ వచ్చిన పిమ్మట వీరికిఁ
జెచ్చెర నొకరీతిఁ దీర్పు ♦ చెప్పఁగవచ్చున్
బోద్యంబులేక రమ్మన
నచ్చురువున ధర్మజుండు ♦ వరిగె వతనితోన్ 20.

తే-గీ॥ భూభరణ దక్షుఁడైనట్టి ♦ భోగిరాజు
నిలయమై యుల్లసిలు రసా ♦ తలమునందు
మిగులరమణీయమా బలి ♦ నగరుచొచ్చి
మొదటి వాకిటఁ గురు యదు ♦ ముఖ్యులెలమి

ఆ-వె॥ విస్మృతనిలశాయు ♦ వివృత నుహాపాయు
విశృత వేషు శోషు ♦ వికతరోషు
పింఛశృంఖలాంగు ♦ వేపమానాంగు నా
క్రోశు దీను నొక్క ♦ రుపుని గనిరి. 22

ఉ॥ ఆతఁడు దుఃఖతాతుఁడయి
"యక్కట! దిక్కుగువారు దు నా

కేలటి బంధము క్రియ గు?
నెవ్వరి వేడుచు నెంత యేడ్తు? నా
యాతత దుఃఖ వారినిధి
కంతము లేదు మదీయ మిత్రులెం
తో తపించుచుండిరి వి
ధూత విలాస విశేషగర్వులై. 23

తే॥ పాండవుల బలంబుఁ ♦ బక్తి యూఁతగఁ గృష్ణుఁ
డుండకుండ నడిచె ♦ నుర్వియందు
నిచటి కరుగుదెంచి ♦ యిటులైతి బలి చేత
విడివడంగ నేది ♦ తెరవునాకు ?"

క॥ ఈరీతి నిరంతంబుగ
వారని శోకంబు వలన ♦ వసరెడువాఁడై
రుఁడు ధర్మజుఁడరపి యా
పారవ్యథఁ గుంది పలికెఁ ♦ బద్మాక్షునితో॥

క॥ "అరసితె కృష్ణా! యితని
పరిదేవన దైన - హైన - ♦ పరితాపములన్
గరుణ బెరసి నీతని మొదఁ
బారపాశ్యము లేక విడిచి ద్బద వీన్!"

॥ అనుడు శ్రీకృ డిట్లను ♦ నతనితోడఁ
"పినిఁగ నాతఁడు - ౨బోలి

యేల? యితఁడెవ్వఁడో మన ♦ కెఱుకపడదు
వలదు నీకిట్టియెడల నట్టి ♦ తలఁపు మదిని" 27

పాండవాగ్రజుఁ డిట్లనుఁ ♦ "బద్మనాభ!
ఇతని కొఱకగు శిక్షల ♦ నెన్నియైన
నే ననుభవింతు నోర్పుమై ♦ నితనిపాటు
చూచి యోర్వంగఁజాలను ♦ గాచిపుత్తు" 28

అనుచు హరిమాట మీఱి ధ ♦ ర్మాత్మజుండు
వానివిడిపింప, నతఁడు జ ♦ వంబు మెఱయ
నొక్కగంతున దిగ్భ్రమ ♦ ముప్పతిల్ల
నెక్కడనో దిచ్చుమొగమయ్యె ♦ నెఱుఁగరాక॥ 29

దిగ్భ్రమమునఁ గనులూర్మసి ♦ తెఱచునంత
ధర్మజుఁడు తన కొలువునఁ ♦ దనరుచుండెఁ
దముఁడును దమ్మి కంటియుఁ ♦ దగవుకాండ్రు
నందఱును బరివేష్టింప ♦ నద్భుతముగ॥ 30

చ॥ "ఇది కలయో మతిభ్రమమొ
యీశ్వరుమాయయొ నిక్కవంబొ నా
మదికెఱుఁగంగరాదు మధు
మర్దనుఁ బృచ్ఛయొనర్తునాకి కసా
ఱుదకిట వ్యాఘ్రాండ్రు నదఁ
దొందఱసెందుచు మ–వారు నే

నది యిటు నాకయుండెదఁగ బ
అంగ గనుపట్టెడునేమొ చూచెదర"

క॥ అని ధర తనయుఁ డూహిం
చెను; ముందటి తగవుకాఁడు ♦ చెచ్చెరలేచెఁ
"గనుఁడయ్యా! యీన్యాయ్యము
ధనమిమ ని వాదులాడఁ ♦ దగవె యితనికిఁ?

తే॥ మానవులు మున్ను చేయు క ♦ ర్మంబు కొలఁది
ధనమొ దారిద్ర్యమో వారిఁ ♦ దవిలివచ్చు
మత్పూర్వకృతపుణ్య క ♦ ర్మంబువలన
దొరకుదాని నేనేల యి ♦ తరుల కిత్తు?"

అనుడు, రెండవవాఁడు "ధ ♦ ర్మాత్ములార!
ఆదమఱచిన వాని సొ ♦ త్తపహరించు
వానినేల దండింపరు? ♦ వసుమతీశు
లిట్టులైన నా-యంబు మా ♦ కెచటఁగల్గు?
వసువునకు మతికి సుకథ ♦ మొసఁగువారి
•వసుమతీశ పదంబు న ♦ స్వామగును
వసుమతీశులై వంతన ♦ వఱలఁబోదు
ధరణిపుల [illegible] ధమునఁగాక"

అనఁ గొం యు [illegible] తు
పునఁ గ [illegible] నిమోషముఁజూచి ♦ "పురుషో [illegible] మ!

మనము గలంగెను వీరికి
మనము లతివిచిత్రముగను ♦ మూర్ఛలుసెందెన్॥

క॥ కతమెయ్యది? వివరింపఁగ
మతిమంతుఁడ వీవుదక్క ♦ మఱియెవ్వరు లే
రితరు" లనఁగ శ్రీకృష్ణుఁడు
హితమతిఁ జిఱునగవుతోడ ♦ నిట్లనిపలికెన్. 37

తే॥ "ధర మున కధర్మమునకుఁ ♦ దగవుపెట్టి
యడఁచితి రసాతలమున క ♦ న్యాయసమితిఁ
దివిరి యటవాని బలియు బం ♦ ధించివైచె
వానిము ... రినే కలి యని ♦ ప్రజ్ఞలంద్రు
కలి యటులు గట్టువడినట్టి ♦ కారణమున
పలికి రారీతి మొదట వీ ♦ రలం గడంకఁ
గలి యిపుడు విడివడినట్టి ♦ కారణమున
నిటులం బలుకుచునున్నార ♦ లింతసుజనము
కలియుగము వచ్చెనింక ము క్తి ♦ కాములగుచు
నుండుఁ" డని వారిచనె; ధర ♦ జందు సా
మ్రాజ్యమిచ్చి పట్టముగట్టి ♦ పౌత్రునకును
సోదరులతోడ మోక్షంబు ♦ చూఱఁగొనె

శ్రీ రామార్పణమస్తు

శ్రీ శ్రీ శ్రీ

౧ -
3155
8 -

తే. గీ. అఖిల దుఃఖరోగార్తున కౌషధంబు
సుసుచిరంబుగ భార్యయె చూడ నొకటి
నొనర భార్యాసమేతుఁడై యున్నవాని
కెట్టి యాపదలయ్యును నెఱుకపడవు"

అనెడు సపార ప్రేమపూరిత దీనాలాపంబు లాలించి నైషధుండు, "కాంతా! సర్వముం గోలుపోయినను నీవు నాయందు నుండుటచే నెట్టి యిక్కట్టులనైన నెట్టఁగలుగుదు. కాంతిహీనుండగు శీతభానుండును, గాంతాహీనుండగు దీనుండును గొఱగానివారు. నిన్ను విడువఁజాల. చింతింపకుము. నీవ సూర్యాంపశ్యవు. కోమలాంగివి. కష్టముల నెఱుంగనిదానవు. గోలవు. బేలవు. అరణ్యావాసశ్రమము నోర్వఁజాలవని యిట్లాడితిఁ గాక వేఱొండుగాదు. రమ్ము నావెంట" అని దారసహితుండై కాఱడవులఁ బ్రవేశించెను. ఆటక్షుత్తృష్ణలఁ బాపికొన ఫలజంబులు సైతము గోచరింపకుండెను. కనఁబడిన యొకపిట్టం బట్టఁబోయి కట్టుబట్టం బోఁగొట్టుకొని దమయంతి చీరనే చుట్టుకొని మాపటివేళ నొక పాడు గుడిం బ్రవేశించి భార్యతోడ ధూళిధూసరిత భూశయ్యం బవ్వళించె. ఆయాసముచేఁ దత్క్షణమె దమయంతికి గాఢనిద్ర పట్టె. నలునకుఁ గూరుకు రాలేదు. ఏల? అతఁడు తన పూర్వస్థితిని ప్రకృతస్థితిని భవిష్యత్స్థితిని గూర్చి చింతించుచుండెను. "అక్కటకటా! నావలన దమయంతి కెట్టి యిక్కట్టులు వాటిల్లె.

అంచయాఁకలపానుపున మేనొత్తు మృదులాంగి నేఁడెట్టి కఠినోర్వని గాయంబు గాయంబుగాఁ గందికుందఁబడినది. ఇంతలో నెంత గాఢనిద్రం జెందినది. నన్నువీడి పుట్టినింటికిఁ బొమ్మన్నను బోకున్నది. నేనెక్కడ చింతింతునో యని తన బాధల లెక్కింపక యణఁచుకొనుచున్నది. మృగరాజ గర్జనమున కులికి నన్నుఁ గౌఁగిలించికొన్నప్పుడు 'దమయంతీ భయపడితివా?' యన 'నాథా! లేదు. కంటకమంటె' నన్నది. 'తీయుమనా' యన .'నేనే తీసివేసితి' నన్నది. నాకై పలు బాములఁ బడు నీపడఁతిని జూడఁజూడ నాగుండియ నీరగుచున్నది. ఈయమ కష్టముల నిఁకఁ జూడఁజాల. చూడఁజాల. వదలి యెటకేని పోయెద. తరువాత మేల్కని 'నన్నుగానక కొంతసేపు పలవించి తుదకొక మార్గముపట్టి పుట్టినిల్లు చేరఁగలదు. ఇది మంచి యుపాయము" అని నిశ్చయించి లేవఁబోయెను. ఇరువురకొక్కచీర యగుటచే నాచీర "రాజేంద్రా! సహధర్మచారిణిని వదలి పోఁదలంచుట ధర్మ్యమ్ముగాదు. పోకు పోకు" మని యంకిలిసేసెనో నాఁగఁబట్టి యీడ్చెను. దమయంతి మేల్కనునేమో యని నలుఁడు తటాలునఁ గూర్చుండి యామె మోముఁదమ్మింగాంచి నెమ్మన మూఁపలేక పోయెను. వేడి జలధారలు కన్నులనుండి యనర్గళముగా వెలువడెను. ప్రేమబంధము మఱింత క్రుంగించి సూకాంత మినుమునుంబోలె నాకర్షించుచుండెను. ఎట్టట్టో కొంతకొంత

దిటవుపూని లేవ నుంకించెను. నేలకుఁ గేలూనుచు నంత నొక కత్తి చేతికిఁ దగిలెను. దానిం గనునంత నతని కాచీరఁ గత్తిరింప నెడంద తత్తఱించెను. "ప్రియా! శరధిపరిధాన పరీవృత ధరామండలిం బరిపాలించిన నరపాలున కిప్పుడు కట్ట బట్టయుఁ గఱవయ్యెనే? యని నేఁజింతింప "జీవితేశా! ప్రేమబంధము నకుఁదోడు వస్త్రబంధంబుం బొందించి పరమేశ్వరుండు మనకుఁ బరమానుకూలుండయ్యె" నని నన్ను సమాశ్వాసించెనే! అట్టి నిరవధికప్రేమమ్ము వమ్ముగా నిమ్మగ్గియు చేలమ్ము నెమ్మోమ్మడిక్కఁ ద్రెంపనేర్తు" నని యెదకొంపి కొందనడఁ గత్తిని జార్చెను. విధిప్రేరణముచే "మగువను దిగనాడకున్న లోనెగులు మిగులఁ బొగలుఁగదా! కొలఁది తాపంబున కోర్చినఁ బడతి యిడుమ లుడుగుఁగదా!" యని మగుడఁ దెగువవహించి చుట్టియుఁగొని పటాలునఁ జీరచెఱఁగుఁజించికొని లేచి నిలువంబడి చెలువ మోముఁ దిలకించెను. అదివఱకుఁ గలిగిన కాఠిన్యము మరలఁ బటాపంచ లయ్యెను. మరలఁ గూర్చుండెను. "స్వయంవరకాలమునఁ బురందరాదుల నైతము తిరస్కరించి నన్నపారప్రేమను జేపట్టిన యోసుగుణమణీ! నిన్ను విడినాడవలయు నను కఠినబుద్ధి నాకేల గలుగుచున్నది? అదేలొకో నామతి నాకవశ మగుచున్నది. ఎంత వలదన్నను నిను విడనాడు మనియే యుద్బోధించుచున్నది. తీవరించుచున్నది. నేనేమిచేయుదును? నాతోడ నీవుండిన నాకునిర్భరానందమే

కాని, నీకింక నెన్ని పడరాని పాటులు వాటిల్లునో యని భ
తవ్య మూహించినకొలఁది నాహృదయము బీఁటలు వాఱు
చున్నది. దమయంతీ! మత్ప్రాణాధికా! నీకు దైవమే శర
ణము. కఠినమతినై నిన్నుఁగానలపాలుచేసి పోవుచున్నాఁడను.
దైవముకరుణింపకుండెనేని యిదియే కడసారిచూపు. ఈపాపా
త్మునిని మన్నింపుము" అని యొక ముద్దిడుకొనఁబోయెను.
దమయంతియు "నాథా!" యని కలువరించి నలుని గాఢముగఁ
బరిష్వజించెను. నలునిగూడ నీరయ్యెను. ఆమె కర మృదు
మృణాళములలో నలహస్తి కట్టుబడిపోయెను. పొంగిపొరలి
వచ్చు సుఖతరంగములను ధైర్యమను నానకట్టుచే నిలుపఁ
జూచెను. కాని యవి నిలిచినవికావు. మరల నెట్లో కొంత
సేపటికిఁ బూనికతో మెల్లన నామె కరపల్లవంబుల వదలించి
కొని లేచి నాలుగడుగులు నడచి మఱి నడవఁజాలక నిలిచి
తిరిగి చూచెను. పోవ బుద్ధి పొడమదయ్యెను. సమీపింప
మనసొప్పదయ్యెను. బుద్ధికి మనస్సునకుఁ గొంత పోరాటము
జరిగెను. బుద్ధి గెలిచెను. అతఁడు మరల దమయంతిని సమీ
పించెను. మైమఱచి నిద్రించుటనుజూచి కలిప్రేరితుఁడై ధీరత
నూని తిరిగి కొంతదూరము పోయెను. అంత నొక ఘోర
గర్జన మతనికి వినవచ్చెను. సతీమణి యెంత కాతరనందెనో
యని పరుగున వచ్చెను. ప్రేమలత యంత సులభముగఁ దెగు
నదియా? వైదర్భి మేల్కాంచలేదు. మరల భైమిం బరిత్యజించు

ముకట్టెను. దమయంతి నిదురలో వేశోకప్రకర్షకుఁ బొరలెను. "దమయంతి మేల్కొని నాయత్న మెఱిఁగెనా నన్నే యని భావించును? తుదముట్టున్నా? ఇప్పుడే నవలి కడఁగుట మంచి" దని మెదఁ బదిలపఱచికొని పథము సాగించెను. ఇరువది యడుగులు నడచెను. దమయంతి భయభ్రాంతయై తన్ను బిగ్గఱగఁ బిలిచినట్లు లాతని మనికిఁ దోఁచెను. ఆప్పుడు మెఱపుఁదీగె యంత వేగముఁ బరుగెత్తి వచ్చెను.

చ. కలి దమయంతిఁ బాప సమ
కట్టు, నతఁ డబలవాయనోపఁ, డా
లలనను దీర్ఘ సౌహృదబ
లంబున నట్టులు వెంటఁ జేసి య
న్నలుఁడు విమోహపాశముల బె
నంగిన తా గతకారియైన యు
య్యెలయునుబోలె నూఁగడక
యెంతయుఁ బ్రొద్దు వినిశ్చితాత్ముఁడై.

దమయంతి కదలలేదు. నిదురించుచునే యున్నది. ఎట్టులైన దిటవుగాని యకుటిలకుంతలి దిగవిడిచి పోవనెంచి యామె ముఖచంద్రమండలమును గన్నుల కఱవుదీఱ విలోకించెను. అశ్రుధారలు చూపుల నడ్డుపెట్టెను. అపగత భాగ్యునకు సంకల్పసిద్ధి యెక్కడిది? బాష్పవారి వారింపలేక మరల నొక ముద్దిడి లేచి "వనదేవతలారా! దిక్పాలులారా!

పంచభూతంబులార! భూమ్యాకాశంబులారా! సూర్యచంద్రులార! మత్ప్రాణనాథికను నిషధరాజపత్నిని నిష్కరుణుఁడనై పరిత్యజించుచున్నాఁడ. ఈ నారీమణికి మీరే దిక్కు. నా కష్టమున కెంతయు నోర్తుఁగాని యీ బిడ పడు నిడుమలఁ జూడఁజాల. వదలిననే యీమెకు క్షేమము గలుగఁగలదు" అని కొంతదూరము పోయెను. దుష్టమృగ మొక్కండు ప్రక్కనుండి తన వెనుకకుఁ బరువెత్తెను. దమయంతి కీమెక మేమికీడుచేయునో యని తానును వెనుదిరిగి పరుగులువాఱె. కాని మృగమును గానరాదయ్యె. కాంతామణియుఁ బొడకట్టదయ్యె. పాడుగుడిసెకూడఁ దోఁతేరదయ్యె. దమయంతీ! దమయంతీ! యని వనమెల్ల నలుఁడు క్రుమ్మరిలనయ్యె.

చూచితిరా! విధికిఁ బ్రేమకుఁ గలిగిన పోరాటము!

దమయంతి కొంతసేపటికి మేలుకని నలుని గానక యిటు నటు చూచి, పిలిచి, నాథుఁడు లేమికి దిగులొంది వగం గందిన డెందంబున "నాథా! నను విడిచి యెటకేగితివి? పల పిలిచినను బలుకకున్నావు? నా మొగ మాలింపకున్నా వేల? నా కిఁక యీ కీకారణ్యమున దిక్కెవ్వరు? నన్నేల వదలితివి? నే నేమితప్పు చేసితిని? ఈ నట్టడవిని నను డించి పోవఁగలవని కలనైనఁ దలఁపనైతిఁగా! ఇంత సాహసమా! ఇంత యుగ్రభావమా? నా యందు నీవు చూపుచుండిన యపారప్రేమమ్మున కిదియా ఫలితము?

నే నేదో మహాపరాధ మొనర్చియుంటి. కాకున్న నన్నేల త్యజింతువు? మనోనాథా! నాకై నేను వగవ. భవదీయ దుస్సహక్షుత్పిపాసా శ్రమాకులత్వంబులకై వగతు.

క. అలయు నెడ డయ్యునెడ నాఁ
కలియుఁ దృషయు నైనయెడలఁ గ్రొ గడఁ కొని ధరణీ
తలనాథ! పురుష నకు ని
మ్ముల భార్యయ పాచుఁ జత్తగ మునఁ దుఃఖంబుల్.

నన్నుఁ బరిశోధింప నెందేని దాఁగియుంటివా? నీ దర్శనభాగ్యంబు లేని నాకీ తనువేల? జీవితమేల? వలదు. రమ్ము. దర్శనమిమ్ము. కరుణస్వభావము పూనకు" మని పలు వగల వగలఁ బొగలుచు నెలుగెత్తి పిలుచుచుఁ బొదలదూఱి వెదకుచుఁ బల్లంబుల దిగుచు మిట్టలెక్కుచుఁ దిరిగి తిరిగి చేది పురమ్ముఁ జేరి రాజగృహమున సైరంధ్రీవేషమున మలినార్ధవసనయై భోగంబు లొల్లక కాలము గడపుచుండె.

నల దమయంతులు విపినముల కేగిరను వార్త భీమరాజు చెవులఁ బడినతోడన మిగుల దుఃఖించి వారల వెదకఁ దగినవారలఁ బంపెను. వారు వెదకి వెదకి తుదకుఁ జేదిపురమున రాచనగరిని సైరంధ్రియై యున్న దమయంతిని గనుఁగొని విదర్భకుఁ దోడుకొనిపోయిరి. అచ్చటఁ గొమిరె కొమరులఁ గలిసికొనుటచే నామె శోకము కొంత వాసెఁగాని భర్తృవియోగ తాప మాఱెను బెను వితముల వేఁచుచుండెను.

తదనంతరీ కర్కోటక విషంబునఁ గబ్జుఁడై వికృతవేషంబునఁ బ్రాకృతుఁబోలె నయోధ్యాధిపతి కొలువునఁ బాచకుండై యుండిన నలుని రప్పించుకొని పరితాపముం బాపికొనెను. నలుఁడు లబ్ధప్రాభవుండై సతీసుతులతో సమితానురాగమున సుఖంబుండెను.

విద్యార్థులారా! గమనించితిరా నల దమయంతుల ప్రేమావిశేషమును! అనలంకప్రేమ యన్న నిదియ! పరస్పర మిట్టి ప్రేమయే యుండవలయును. పెద్దలయెడఁ జిన్నలు చూపు ప్రేమ భక్తి యనంబడు. సములయెడఁ గనఁబఱచు ప్రేమ స్నేహమని చెప్పంబడు. పిన్నలయెడ నిలుపు ప్రేమ దయనాఁబడు.



# 4. పెద్ద లెవరు?



మన నడవడి మంచిదగుటకుఁ బెద్దల సేవింపవలయును. పెద్ద లెవరు? వయస్సునఁ గొందఱు పెద్దలు. విద్యలోఁ గొందఱు పెద్దలు. జ్ఞానమునఁ గొందఱు పెద్దలు. ఇం దెవరు సేవింపఁదగినవారు?

తే. గీ. విప్రుఁ డధ్యయనముచేతఁ బృథివి పతి ప
రాక్రమముచేత, వైశ్యుఁ డర్థమున, శూద్ర

జనుఁడు విబుధసేవాకృషి, సర్వజనులు
సుగుణమున, విద్యవలనఁ, బూజ్యులగుచుండ్రు.

వయస్సునఁ బెద్దవారగువారికంటె విద్యచేఁ బెద్దలైనవారెక్కువ పూజ్యులు. విద్యావృద్ధులకంటె జ్ఞానవృద్ధులు పూజ్యాధికులు. వారికంటె ననుభవవృద్ధులు పూజ్యతములు. అనఁగా విద్యనేర్చి జ్ఞాన మార్జించి యనుభవపూర్వకముగ నుపదేశింపఁ గలవారు బాలకులైనను సేవింపదగినవారు.

ఆ. వె. అంకిలెఱిఁగి మాట లాడ నేర్చినపుడు
పిన్న పెద్దతనము లెన్న నేల?
పిన్నచేతిదివ్వె పెద్దగా వెలుఁగదా?
విశ్వదాభిరామ వినురవేమ.

ప్రహ్లాదుఁడు, మార్కండేయుఁడు, ధ్రువుఁడు, చిరకారి, అష్టీకుఁడు సనకసనందాదులు వయసున బాలురయ్యును జ్ఞానసంపాదనంబునంజేసి పూజ్యులుకారే!

శ్లో. యేరామనామామృత పానమత్తా
యేభక్తలీలా సునివిష్టచిత్తా
యేవేదవేదాంత విచారసక్తా
స్తేభ్యోమహద్భ్యోనమ అర్భకేభ్యః.

ఎవరు భగవన్నామామృతపానమున మత్తులై యుందురో, యెవరు భక్తుల లీలలయందు లీనచిత్తు లగుదురో, యెవరు వేద వేదాంత విచారమునం దాసక్తులై యుందురో,

యట్టివారు పెద్దలైనను బిన్నలైనను మనకు నమస్కరింప నర్హులు.

అట్టి మహాత్ములు మన కెట్లు లభింతురు?

చిత్తశుద్ధి గలవారికి మహాత్ములు తమంతఁ దామే దర్శన మిచ్చి పరమార్థ ముపదేశింతురు. శుకుఁడు పరిక్షితు నకు, నారదుఁడు ధ్రువునకుఁ బ్రహ్లాదునకు, వ్యాసుఁడు పాం డవులకుఁ దమంతఁ దామే పోయి యుపదేశించి ధన్యులఁ జేసిరి కాదే!

ధర్మరాజును దుర్యోధనుఁడును దమ కార్యసాహాయ్య మునకై యొకప్పుడు శ్రీకృష్ణునిఁగోరి పిలువవచ్చిరి. కృష్ణుఁడు సర్వజ్ఞుండు గావున వారి యభిప్రాయ మెఱింగి ధర్మజునితో 'నీవొక దుష్టునేరి తోడితె' మ్మని పంపెను. దుర్యోధనునితో 'నీవెచ్చటనైన నొకసజ్జను నేరితె' మ్మని పంపెను. ఇరువు రును బల్లెలు పట్టణములు తిరిగి తిరిగి యూరక కృష్ణునొద్దకు వచ్చిరి. అందు ధర్మజుఁ డిట్లనియెను. "కృష్ణా! ఒక్కొక్క పల్లెయందును బట్టణమందును బదుగురచే దుష్టుఁ డనిపించు కొన్నవాని నెఱిఁగి యతనిఁ జేరి పరీక్షింపఁగా వానియందు నొక సుగుణ మున్నది. అట్టివాని నెట్లు దుష్టుఁ డనవచ్చును. నాకంటె కొక దుష్టుఁడు నగపడలేదు" దుర్యోధనుఁడును 'బలువురచే సజ్జనుఁ డనిపించుకొన్నవారియందుఁ బరిశీలింప నొకదుర్గుణమున్నది. నాకంటెకి సుజనుఁడగపడలేదు' అనియెను.

చూచితిరా! దుష్టునికంటి కందఱు దుష్టులే. సజ్జనుని కంటి కెల్లరు సజ్జనులే. తన మనస్సునం బూర్ణీభవించి యేది యుండునో యదియే యితరులయందుం దనకుం దోంచుచుండును. కాంబట్టి మన మనస్సు నిర్మలమైనపుడే యట్టివారు మనకుం గానవత్తురు. మఱియుం బెద్దల మనము సేవించుట వారియొద్దనుండు మంచిని గ్రహించుటకేకదా! వారియొద్ద మనకు దుర్గుణమని తోంచిన దేదే నొకటి యుండుంగాక! దానితో మనకుం బనియేమి?

రాక్షసకుల గురుండగు శుక్రాచార్యునకు 'మృత సంజీవిని' యను నొక గొప్ప మంత్రము తెలిసియుండెను. అది దేవతలకును వారి గురువునకును దెలియదు. దాని నేర్చుకొందమన్నం జిరకాల మతని సేవించినంగాని యుపదేశము పొందుట దుర్లభము. చాలకాలము వారితోం వారి శిష్యులగు రక్కసులతోం గలిసి మెలసి యుండినయెడల వారిదుర్గుణములు పట్టువడునని భయము. సహవాసమునం బట్టువడని గుణములెవ్వి? తుద కందఱును జేరి యోజించి ధీరచిత్తుండగు గురుకుమారుని గచుం డనువానిం బంపిరి.

కచుండు శుక్రునొద్దం జేరి యతని మదిని, దనయంతం దనపై వాత్సల్య ముదయించునట్టులు నడచుకొనుచుండెను. కచునిపై శుక్రునకుం బ్రీతి మెండయ్యెను. అది రాక్షసులకుం గిట్టదయ్యెను. వారొకనాండు మంతనమున నాలోచించి దర్భ

లకై పోయి వచ్చుచుండిన కచునిజంపి వానిశవము నటఁబాఱ వైచి వచ్చిరి. అసలే రాక్షసులువారు! ఎట్టి దుష్కర్మముల నైన జేయ నేల వెనుదీయుదురు?

సాయంకాల మయ్యెను. కచుఁ డింటికిరాలేదు. శుక్రు నకు సంశయము గలిగెను. వెదకుచు నడవులఁబడి పోయి తుద కొకచోటఁ జచ్చి పడియున్న కచుని కళేబరముంగని మృతసంజీవిచే నతని బ్రతికించుకొని యింటికిఁ దోడ్కొని వచ్చెను. రాక్షసు లది యెఱిఁగి మఱియొకనాఁడు కచుని బట్టి కొని చంపి కాల్చి యాబూడిదను గల్లులోఁగలిపి తమ గురు నకే త్రావనిచ్చిరి. మద్యపాన ప్రియుఁడగు శుక్రుఁడు దానిఁ ద్రాగివేసెను. సాయంకాలమునకుఁ గచుఁ డింటికి రాఁడయ్యె. అతఁడు మరల వెదకసాగెను. అడవులెల్లఁ దిరిగి వేసరి యెంతనుగానక మత్తు తగ్గినవెనుక దివ్యదృష్టిం దిలకించి భస్మ రూపమునఁ దనలో నున్నాఁడని తెలిసికొనెను. మృత సంజీ విచేఁ దనశిష్యుని బునర్జీవితుని జేసి యామంత్ర మతనికి నేర్పి "నాకడుపుఁ జీల్చుకొని బయటికి వచ్చి నన్ను బ్రదికింపు" మనియెను. కచుఁ డట్లే చేసెను. రాక్షసులు చేసినకార్యము తన కార్యసాఫల్యమునకే తోడయ్యెను.

పూర్వము మహమ్మదీయులు మన దేశమునకు రాక ముందు వారి దేశమున జ్యోతిశ్శాస్త్రము ప్రబలియుండెనఁట. దాని నెట్లైన గ్రహించిరావలయు నని మన దేశస్థు లాలో

చించి యధిక మేధావంతుఁడగు బ్రాహ్మణబాలకు నొకనిఁ బంప నిశ్చయించిరి. అతఁడు స్వకులస్థులయొద్దను సాంఘికుల యొద్దను గొన్ని యేర్పాటులు గావించుకొని యెన్నిపాటులు పడియైన నా విద్యను గ్రహించి వచ్చెదనని బయలుదేఱెను. నౌకాయాత్రచేసిన విప్రుని, నితరజాతులవారి యన్నముగు తిన్న వానిని మరలఁ దమ జాతిలోఁ జేర్చుకొనరు. కావున నా బ్రాహ్మణబాలకుఁడు మున్నే కొన్ని యేర్పాటులు చేసికొన వలసి వచ్చెను.

అట్లతఁడు బయలుదేఱి పలుకష్టములకోర్చి చాలకాల మునకు యవనదేశముం జేరెను. ఏమహాత్ముయొద్దఁ జేరబోయి నను దురుష్క-సాంప్రదాయము ననుసరించి వసుగుముండనము మొదలగునవి చేసికొనకుండుటచే నతని నెవ్వరును జేర్చుకొన రైరి. తుద కాతఁడు వారి మతమును స్వీకరించి విద్య నభ్య సింపఁ బ్రారంభించెను. తనకుఁ గావలసిన విద్య ప్రారంభింపఁ బడకముందే యవను లతనికొక కన్యను నిక్కా-చేసిరి. ఆమెతో నాతఁడు కాఁపురమొనర్చుచు జ్యోతిశ్శాస్త్రము గ్రహించు వఱకే ముగ్గురు బిడ్డల తండ్రి యయ్యెను. కావలసినది పూర్తిగ నేర్చుకొనెను. దేశాభిమానము మెండుగఁ గల యా బ్రాహ్మణపురుషుఁడు భార్యను బిడ్డలను దాత్కా లిక బంధువులను దేశస్థులను మోసగించి యొకనాఁ డర్ధ రాత్రంబున నొక్కండ బయలుదేఱి తెల్లవాఱునప్పటికి రెండా

మడలు దాఁటెను. ఉదయమున నా యూరివా రందఱు తురుష్కబ్రాహ్మణుని గానక పరిపరివిధముల నాలోచించిరి. మౌల్వీలు మోసముజరిగెనని గ్రహించి వానిని వెదకి కనిపట్టి కఠినముగ శిక్షింపవలయు నని యమీరున కెఱింగించిరి. ప్రభువు సేనాసమేతుండై వానిని బట్టుటకు వెడలెను. శాస్త్రవేత్తలు దివ్యదృష్టిచే భారతీయుని పోకడ యెఱింగి చెప్పుచు వచ్చిరి.

ఆ యుదంతము మన బ్రాహ్మణుఁడు తెలిసికొని వడివడిగ సాగుచుండెను. కాని నాల్గవనాఁడు వార లతని సమీపమునకు వచ్చిరి. ఆ సమయమున నతఁడు వారు సమీపించుట నెఱింగి తప్పించుకొను వెరవు యోజించుచు నొండు కొండయెక్కి యందొక గుహలోఁ బ్రవేశించెను. ఆ గుహయం దొక శార్దూలము చచ్చి పడియుండఁగా దాని చర్మమొలిచి కప్పుకొని గొంతుకూర్చొని దైవధ్యానము చేయుచుండెను. తురుష్కులా కొండక్రిందికివచ్చి విడిసి హైందవుఁ డెచ్చటనున్నాఁడో యని దివ్యదృష్టిం బరికించిరి. పులిచర్మమతఁడు కప్పికొనియుండుటచేఁ బులికడుపున నతఁ డున్నాఁడని నిర్ధారణచేసిరి. పులికడుపునఁ బడినవానికిఁ బుట్టుగతులు గలవా? వాఁడు నిజముగఁ జచ్చెనని వారు భావించి వాని పీడ దీఱెనని వచ్చినత్రోవను మరలిరి.

బ్రదుకుదేవుఁడా యని యతఁడు కుధరకుహరమునుండి

యీావలికి వచ్చి వారి తెలివిలేమికి లోలోన నవ్వుకొనుచు మన దేశమునకు వచ్చి చేరెను.

కఠినప్రాయశ్చిత్తము చేయించుకొనినంగాని తమ జాతిలోఁ జేర్చుకొనమని యతనితో బ్రాహ్మణులు ఖండితముగఁ జెప్పిరి. అతఁ డంకుల కొడంబడక మునుపటిమాట యేమని యడిగెను. కాని, కులపుఁ గట్టుఁబాటు లెక్కువ గల మనవారియొద్ద నతని యత్నమునకు ఫలము లేకపోయెను. తుద కతఁడు బ్రాహ్మణద్వేషమూని వారికా విద్య చెప్పక విరుద్ధముగ నడవనెంచి యొక మాలదానిని బెండిలియై జ్యోతిషికవృత్తితోఁ దన జీవితముం గడపెను. అతని సంతతివారే యిప్పుడు "వళ్లువర్" అని పిలువఁబడు నొక తెగవా రని కొందఱు చెప్పుచున్నారు.



# 5. స్వల్పమని కూడనిపని చేయరాదు



కొఱగానివస్తు వీ భువి నెద్దియు లేదనియు సర్వవస్తువులుఁ బరమాణుపూరితములనియు మీరు రెండవభాగమునఁ జదివి గ్రహించియున్నారు. స్వల్పమని నిర్లక్ష్యముచేసి యకార్యము లొనర్చువారు మనలో ననేకులు గలరు.

ఒకఁడు మనయొద్ది కొక కార్యార్థియై వచ్చెనను కొనుఁడు. "ఏలవచ్చితి" వని మనము ప్రశ్నింపఁగ "నూరక వచ్చితి" నని యతఁ డుత్తరమిచ్చును. వచ్చినది కార్యార్థియై. ఊరక వచ్చితిసని యతఁ డేల యనవలయు? ఇట్టి యసత్యములు మనలో సర్వజనసహజములైనవి. అవి యర్థాలంకార సమాజములోఁ జేర నుంకించుచున్నవి. వీనివలన స్వపరబాధకము లేదుగాన నటు పోనిత్తమనుకొన్న మితభాషిత్వమునకు స్వస్తిచెప్పుచున్నది.

క. మనమునకు హితంబును బ్రియ
మును బథ్యముఁ దథ్యమును న మోఘము మధురం
బును బరిమితమును నగు పలు
కొనరఁగ బలుకునది ధర్మ యుతముగ సభలన్.

అను సూక్తికి హానివచ్చుచున్నది. అణువులు ఘనములైనట్టులు స్వల్పాకార్యములు ఘనీభవింపకుండునా? నేఁడు వంకాయకు వచ్చినది రేపు టెంకాయకు వచ్చునను సామెత గలదు.

ఒక కాననంబున నత్యంతశ్రద్ధమెయిఁ దపంబు గావించుచుండిన యొక ముని మనఃపరిశోధనంబు గావింపందలంచి శచీపతి యొకనాఁడు తత్పరిసరప్రదేశంబున నొక ఖడ్గంబు విడిచి వచ్చె. స్నానార్థియై గౌతమి కేగుచుండిన ముని యా నరాజింగని "యెవరో యాఁదమఱచి దీని నిట విడిచిపోయిరి.

మరల వెదకుచు వచ్చిరేని వారి కప్రయాసకరంబుగా భద్ర పఱచి, యొసంగెదఁగాక" యని యా కరవాలముం గొని పోయెను. స్నానానంతర మాశ్రమభూమికి మరలి వచ్చు నపుడు నారచీర ముండ్లపొద కంటుకొని చినిఁగెను. చేతఁ గత్తి యుండుటచేఁ 'దీనిఁ గొట్టివైచిన నిటు మాటిమాటికిఁ దగులకుండుఁగదా' యనుకొని యా కంటకగుల్మమును నఱ కెను. నాలుగు మొదళ్లొక్కవ్రేటున సరాలున తెగుటచేఁ గత్తి వాఁడి కచ్చెరువడి యా మార్గమున నుండిన పొదలనెల్ల వేడుకదీర ఖండించుచుఁ బ్రొద్దెక్కఁ బర్ణశాలఁ జేరెను. కత్తి తెగుదలకుఁ గడుంగడు నచ్చెరువందినవాఁడును నాశ్రమ మందలి కంటకభూజములఁ దెగనఱుకఁ దత్తరించు మనస్సుగల వాఁడును నగుటచే నాతఁడానాఁడు నిత్యకృత్యములయెడ మనస్సు సడలించి వడివడిగ ముగించి, యైనదనిపించి, కంటక తరు నిర్మూలన కార్యారంభుఁడయ్యెను. జగదీశుని చింత యహరహము సేయువాని కా రాత్రి కత్తి పదనుం గూర్చిన చింతయే మెండయ్యెను. నేఁడు యోగమున భూచరి నవలం బించితి. రేపు ఖేచరి నభ్యసింపవలయు నను నాలోచన యుండఁదగినవాని కిప్పుడు నేఁడు ముండ్లపొదలఁ జెండాడితి. రేపు రేపకడ లేచి ముంటిమ్రాఁకుల మూలము ముట్టఁజెలఁగ వలయు నను నత్తరపాటు గలిగెను. ఆ రాత్రి యతనికిఁ గూరుకు రాక స్వప్నములు కూడ వచ్చెను. అవియుఁ గంట

కోద్భిజ్జములఁ గూర్చినవియుఁ గత్తివాదరఁ గూర్చిన ప్రశంస యున్నైయే యుండెను. ఎట్లో తెల్లవాఱెను. వేకువనే లేచి కొన్ని చెట్లఁ గొట్టి పిదప స్నానమునకుఁ బోయెదమని యెన్ని యవ్విధిం జేయుచుండ నొకపుట్టనుండి యాకస్మికముగఁ గోడె త్రాఁచొకండు బుసకొట్టుచు బయల్వెడెను. ఖడ్గపాణియైన యా విరాగి నాగసంహారణమున కేలజంకును? వెంటనే దానిని దుండెములుగ ఖండించివైచెను. పదపడి స్నానముచేసి వచ్చి మునుపటి కార్యము కొనసాగించెను. ఇట్లు దినక్రమం బున స్వకృత్యంబులు సన్నగిలుచుఁ దరువిచ్ఛేదక కృత్యంబులు బలియుచు రాఁగా నట్టె యట్టె దుష్టమృగధ్వంసనమున కుపక్ర మించి నానాఁటి కతఁ డప్పుడు వేఁటకాఁ డయ్యెను. తపశ్చర ణంబు నట్టేటఁ గలిసెను.

చూచితిరా! ఆ మునీంద్రుఁడు మొదటఁ దా గ్రహింపఁ దగని యాయుధమును ‘భద్రపఱుత’ మను నుద్దేశమున గ్రహిం చుటయు, ముండ్లచెట్టేకదా యని దాని నఱకుటయుఁ, గత్తి వాదరం బొగడ్తయు నతని నెంతకుఁ దెచ్చె!

ఒక విద్వాంసుఁ డైహికసుఖంబుల నిస్స్పృహుండై సర్వసంగ పరిత్యాగియై కౌపీనమాత్రధారియై యొక పర్వత గహ్వరంబుఁ జొచ్చి యందు ధ్యాననిష్ఠాగరిష్ఠుండై యాము ష్మిక సుఖాభిలాషియై పరమాత్ముని జింతించుచుండెను. ఒక నాఁడు తత్కుహర పరిపాలకుఁడగు మూషకచక్రవర్తి నూత

నాగత విరాగిం గాంచి "మా సంచారంబున కభ్యంతరాయం బుగా వీఁ డెటనుండివచ్చె? వీని నిచ్చటినుండి తొలఁగించు నుపాయ మెద్ది?" యని తన పరివారంబుతోఁ బర్యాలోచ నము చేసి "యొకానొక రోకొరుకపరి తమ యోచినకొలఁది నతని తపమునకు భంగము గావించినచో నతఁడు మన పోరు పడలేక గుహానివాసము ం బాసిపోఁగలుగును. ఆ కార్యము చేయువా రెవ్వరని సంవియముంటఁబని లేదు. అతఁడు శమ దమ సంపన్నుండును శాంతుండును గావున నాయనను సమీ పించినఁ గలుగు సిలుగు లేదు" అని నిర్ధరించి యట్ల యొనరింప నాజ్ఞయిడెను.

జాముస కొకొాక యెలుక యా తపస్విని సమీపించి యతని గోచిని దిగలాగ నారంభించెను. అతఁడా యెలుకల రాయిడి పడలేక వసతియైన గుహను వదలిపో మనసురాక నిలువరింపనుజాలక యెటకో పోయి యొక పిల్లికూనను దెచ్చెను. మూషికోపద్రవము తగ్గెను. ఆఁకలిచేఁ బిల్లి రోద నము హెచ్చెను. అతని మదియు నిలువరము లేకపోయెను. పిల్లిని వదలెనా యెలుకల యుపద్రవము మెండు. పిల్లి నుంచు కొనెనా దాని కాహారముపార్జింపవలయు. ఏది చేయఁదగి నది? పిల్లికిఁ బాలకుఁగా నొక పాడియావును గొనితేర భిక్షు కుండై ధన మార్జించి గోవును గొనితెచ్చెను. గోవును గాపాడ గొల్లఁ డొకఁడు వలదా? గొల్లని నొకనిఁ గూడఁ

దోడ్కొనివచ్చెను. వానికి జీత మీయకున్నను గడకు భుక్తికైన జరపకున్నవాఁ డుండఁగలఁడా? కొన్నినాళ్లు గడచిన పిదప 'నిల్లాలులేనివాని బ్రదుకు కేటిబ్రదుకు' కని తన కొక ముడి వెట్టింప యజమాను నా గొల్లండు తొందరపఱచెను. ఆ సత్కార్య మొనర్పకున్న సతనికి విధిలేదయ్యెను. కొన్నాళ్లకా గోపదంపతుల కొక కొమరుఁడు పుట్టెను. బిలేశయముల తొందర తగ్గెను. మార్జాలరోదనము శాంతించెను. గొల్లని పెండ్లియుబ్బసము కుదురుపాటు వహించెను. గొల్లత సంసారము క్రమముగనే సాగుచున్నది. కాని మన గోచిరాయని తపస్స్రోత నిర్విఘ్నముగ సాగుచున్నది? గోపిక యింటిపనులు నెఱవేర్చుకొనునప్పుడు పోరు పెట్టనీక నిసుఁగు నెత్తిపెట్టుకొని యోదార్చు సేవకుఁ డెవఁడు? ఆ యున్నతోద్యోగ మా యతికే కుదిరెను. వానిని వదలినచో నెలుకల రాయిడి పిల్లిఱాపు మెఱుఁగనిపించుచున్నాఁడు. కులదైవము పేరని తల్లిదండ్రులును, స్మరణీయమైన భగవన్నామమని మన యోగిశేఖరుఁడును గలిసి యా బాలకునకుఁ గృష్ణుఁడని నామకరణ మొనర్చియుండిరి. ఆ బాలకృష్ణుఁడు తన్నోదార్పనికటి సాక్షాత్కృష్ణుఁడై వారి నే పనియు జేయనిచ్చువాఁడు కాఁడు.

ఒకనాఁడే తత్సంసారనిర్వాహణ దక్షుఁడగు సన్న్యాసి యా బాలుని మూఁపుపై నిడికొని గుహాద్వారమున నిటునటు

దిరుగుచుండ నాముదము ద్రాగిన కృష్ణుడు పలుచపలుచని మలము నతనిపై జారవిడిచెను. ఆసమయమున నింకొక సన్న్యాసి యక్కడ కతిథియై వచ్చి "యిదియే" మని యడిగెను. 'ఇదియే సంసారములోని సార' మని మన తపస్వి యాతని కుత్తర మిచ్చి యప్పుడు నిజముగ సర్వసంగ పరిత్యాగియై యాగోచినిసైతము వదలి యెటకో పోయెను.

కనుగొంటిరా! గోచికైవచ్చిన తగులు గోలకొండ దాక నీడ్చినది! స్వల్పమని చేసిని భావింతుమో యందే ఘన కార్యములు విలీనములై యుండును.



## 6. అన్నియుఁ దెలిసినవాఁడు లేఁడు



ప్రకృతివైచిత్ర్య మనంత విస్తృతము. సర్వజ్ఞుఁడొక్క పరమేశ్వరుఁడే. తదితరు లల్పజ్ఞులు. పరిమితజ్ఞానులు. ఆలోచనా నైశిత్యము హెచ్చుకొలఁది బుద్ధి వృద్ధినొందుచుండుఁగాని పారము నొందఁజాలదు.

ఉ. ఒక్కొక వస్తుతత్త్వముఁ బ్ర
యోజనముం దెలియంగలేము; యం
దొక్క విభాగతత్త్వమును
యోచనసేయఁగ శక్తిచాలకే

యిక్కరణిం గుతర్కముల
నెప్పుడు సేయుట సిగ్గుచేటు కా
కెక్కడి గౌరవంబను మ
నెంచెదు నాతఁడె ధన్యుఁ డిమ్మహిన్.

శాస్త్రము లనేకములు. విద్యలు పెక్కులు. వాని నెఱుఁగ నరుని కాయువు లేదు. కాఁబట్టి హంస నీరంబును విడిచి క్షీరంబును గ్రహించు భంగి నుత్తముఁ డగువాఁడు "ఉత్తమం తత్త్వం చింతాచ మధ్యమం శాస్త్రచింతన" మ్మను న్యాయ్యసూక్తి ననుసరించి తత్త్వమ్ముగ్రహించి జన్మతారక కార్యంబు నెంటఁ జరింపవలయు. కాక దంతపరీక్షచేఁ గలుగు ఫల మేమి?

శ్లో. పఠకాఃపాఠకాశ్చైవ । యేచాన్యే శాస్త్రచింతకాః
సర్వేవ్యసనినోమూర్ఖా । యఃక్రియావాన్ సపండితః.

చదివించువారు, చదువువారు, శాస్త్రచింతనముసేయు వారు, మూర్ఖులును వ్యసనము గలవారును నగుచున్నారు. క్రియావంతుఁడగువాఁడే పండితుఁడు. పండితులు కొందఱు శ్రీరంగనీతుల నెన్నియో యేకరువుపెట్టి యితరులకు నూఁటి పోయుచుందురు కాని తాముమాత్ర మనువర్తింపక పప్పులో నడుగు వేయుచుందురు.

ఒకపండితుఁడు తన యింటియరుగుపైఁ బ్రతిరాత్రము పురాణప్రసంగము గావించుచుండువాఁడు. గ్రామస్థులునువచ్చి

శ్రద్ధతో వినుచుండువారు. ఒకనాఁడతఁడు "సొరకాయఁదిన్నఁ బాతకము; కాఁకరకాయఁదిన్న దోష" మని ప్రస్తావవశమునఁ జెప్పెను.

మఱునాఁ డాయన యంగడికిఁజని సొరకాయ యొకండు విలిచికొని యింటికిఁ బంపి యితరకార్యములఁ జూచికొని భోజనవేళ కేతెంచెను. నిత్యకృత్యములు నిర్వర్తించికొని యాహారింపఁ బీటపైఁ గూరుచుండెను. అతని గృహిణి వట్టి చారన్నము వడ్డించెను. పండితుఁ డామెను జుఱచుటఁజూచి "యోసీ! పచనమునకై పంపిన తుంబము నేమిచేసితివి? వట్టి చారన్నము నా కెత్తినిబోసి పులిమెదవా?" యన నా సాధ్వి మణి శాంతచిత్తంబునఁ దత్తఱపడక యిలుతేని కిట్టులనియె. "నాథా! మీరిలు రాతిరి సొరకాయఁ దిన్నఁ బాతక మని సెలవిచ్చితిరి; ఉదయమునఁ బొరపాటునఁదీసి పంపితిరని భావించి యాసొరకాయను బొరుగింటి పుల్లమ్మకుఁ బులుసుఁ గూర కొసఁగితి" ననవుడు నతఁడు తనకోప మేమయ్యెనోగాని భార్య యమాయికత్వమునకుఁ గాఁబోలుఁ బక్కున నవ్వి యిట్లనియె. "ఓసిరండా! నేఁజెప్పినది యిరుగుపొరుగులకే గాని మనకుఁ గాదని గ్రహింపకపోయితివే? ఊరివారినోట మట్టిగొట్టనేనేర్పడ నానోట మట్టిగొట్ట నీవేర్పడితివా? నేయి చెప్పినది పుస్తకములోని సొరకాయ; పంపినది అంగడిలోని సొరకాయ"

క్రియావంతు లేపండితులు. తదితరులు పండితమ్మన్యులు.

నాలుగు వేదము లాఱుశాస్త్రములు పెక్కుస్మృతులు

పదునెనిమిది పురాణములు మఱియు నుపపురాణములు పదు నెనిమిది చతుష్షష్టికళలు తంత్రము లఱువదినాలుగు సాకల్య ముగ నేర్చిన పండితుఁడుకూడ నొక్కొక్కప్పుడు సామాన్యు నిచే నోడింపఁబడు.

సర్వదేశములు తిరిగి పండితుల ననేకులఁ దర్కమున నోడించి వీరఘంట గండపెండేరము మొదలుగాఁగల పెక్కు బిరుదులఁ బడసిన సర్వతోముఖ పండితుఁ డొకఁ డొకనాఁ డొక ప్రభుని సన్నిధికి విచ్చేసి తన విద్యానైపుణ్యముఁజూప రాజునను జ్ఞ వేఁడెను. ఆనరపాలుఁడును విద్యాప్రియుఁడగుటచే మఱునాఁటి సభకు రా నాజ్ఞ యొసఁగి, యాస్థానపండితున కవ్వార్తఁ బంపి సభ చాలించి యంతఃపురమున కేగి రాణి కా పండితుని యుదంతంబు తెలియపఱచెను. ఆస్థాన విద్వాం సుఁడు గెలుచునని రాజ్ఞియు వచ్చిన పండితుఁడు గెలుచునని రాజును గొంతసేపు వాదాడి పంతములు వైచికొనిరి.

ఆస్థానవిద్వాంసుండు ప్రభుఁడు పంపిన వర్తమానమును బ్రతివాది భయంకరుఁడై వచ్చిన పండితుని వృత్తాంతంబును విని భయంపడఁజొచ్చెను! ఆరాత్రి యతని కన్నుమూయక మనసు చొరక కూరుకురాక యేకాంతస్థలమునఁ గూర్చుండి "రేపటికి నాకాపండితునిచే సభాస్థానంబున నవమానంబు ప్రాప్తించుటనిక్కంబు. అతని గెలుచు నుపాయంబు తోఁపదు. ఏదేనొక సాకుచెప్పి సభకుఁబోక తప్పించుకొనుట యుక్త"

మని లోలోఁ దలపోయుచుండ నాతని శిష్యుఁ డొక్కరుం డటకేతెంచి యతని విన్నఁదనము నవలోకించి ముకుళీకృత కరకములుంగ్రై యిట్లనియె. "గురువర్యా! మీాముఖవైవర్ణ్య ముందిలకింప వచ్చిన పండితునితోడవాదింప జంకినట్లు నాకుఁ దోఁచెడిని. అది కారణముగాదేని నాయవజ్ఞను మన్నింపుఁడు. అదియ యగునేని సావచన మించుక యాలకింపుఁడు. కలకాలము రాజు నన్నము దిని సమయము వచ్చినపుడు వెనుకంజ వేయుట ధీరలక్షణమ్ముకాదు. మీాయోగ్యత మీారెఱుంగక యిట్లు కుందుచున్నారు! మీాకేల? నన్ను నియోగింపుఁడు. సదస్యులయెదుట నతని నవలీల నోడించి మీాకును రాజుగారికిని గీర్తి నాపాదింతు.

గురు:—వత్సా! జగములగెలిచిన పండితుని డీకొందు ననుట నీపడుచుబుద్ధిని వెల్లడించుచున్నది. నిజముగ నేనేజంకుచుండ నీవెంతవాఁడవు?

శిష్యుఁడు:—ఆచింతమీాకేల? నిశ్చయముగ జయింపఁగలను.

క. విదళింప నుఱుకు సింగపుఁ
గొదమయు మదమలినగండ కుంజరములపై
నిది బలశాలికి నైజము
గద! తేజోనిధికి వయసు కారణమగునే?

గురు:—నీ ధైర్యమున కచ్చెరువందితి. కాని నిన్ను నియోగింపఁజాల. నామాటవిని నీవేగి ప్రభునితో "గురుఁడు కడుపునొప్పిచే మిగుల బాధనొందుచున్నాఁ" డని విన్నవించి రమ్ము. పండితుఁ డని పేరుగొన్నవానికి సభలో నవమాన మొందుటకన్నఁ జావుమేలు. కావున నీపనికి సాహసింపరాదు.

శిష్యు:—దైవాధీనము లైన జయాపజయంబులకై యింత చింతింపనేల? నామనవినంగీకరించి నన్నాజ్ఞాపింపుఁడు. అవశ్యము జయింపఁగల నను దృఢవిశ్వాసము గలదు. అంతియు సభలో మీకెఱుకపడు. కుసుమజన్మంబు సుజనమస్తక ప్రదేశంబున వాసించుటచేతనే సార్థక మగుచున్నది.

గురు:—కాదేని వనంబునజీర్ణభావమందుచున్నదిగదా!

శిష్యు:—దేశికోత్తమా! మీరు సభకు దయచేయకున్నఁ బ్రతిపక్షి జయధ్వజము గొనిపోవుట నిక్కువంబు. పరకృత తిరస్కారంబు మానవంతుఁడు సహింపనోఁపఁడు. ఈ యల్పుని ప్రార్థన మంగీకృతి చేసి వీని నియోగింపుఁడు.

అని గట్టిపట్టు పట్టి గురునానతి వడసి మఱునాఁడు నియుక్తసమయమున దేశికునితో ఛాత్రుండును సభ నలంకరించెను. ఆసభ కనేక విద్వాంసులును, పౌరులును విచ్చేసిరి. రాజు సింహాపీఠనధిష్ఠించుపిదపఁ దదితరులుచితాసనాసీనులైరి. అంత నాశిష్యుఁడు లేచి దేశాంతరాగత పండితు నుద్దేశించి సభికులతో "మాగురు నను జ్ఞఁబొంది యీవిద్వద్వర్యునితోడఁ

దర్కమునకుఁ గడఁగుచున్నాఁడ. ప్రశ్నించుట సులభమనియు నుత్తరమిచ్చుట కష్టమనియు నే నెఱుఁగుదు. ఐన నితండు పండిత జిగీషుండై జైత్రయాత్ర సేయుచున్నవాఁడు గాన నాప్రశ్నలకు సదుత్తరములీయ బాధ్యుం" డని నొడివి "(౧) ఈరాజు ధర్మాత్ముఁడు. (౨) ఈతనిరాణి పతివ్రత. (3) నీతల్లి యపత్యవతి. ఈ మూఁడంశములఁ దర్కమునఁ గాదనిపింపవలయు" నని తార్కికశిఖామణినొకపరి తేఱిపాఱఁజూచి కూర్చుండెను.

బిరుదులాని మొగము తెల్లవడెను. పెదవు లెండెను. నోటమాట వెడలదయ్యెను. లోలోఁ బరిపరివిధములఁ బర్యాలోచనము సేయఁదొడఁగెను. "ఊరకుంటిమా యోటమి సిద్ధించుచున్నది. పూర్వపక్షమునకుఁ గడంగితిమా పిండశృంఖలప్రాప్తి తప్పదు. ఇఁక గతియేది? ఇట్లుచెప్పి చూచెదఁ గాక" యని కొంత తెచ్చికోలుబీరమునఁ "బ్రభువుల చిత్తమున కీ ప్రశ్నములు సభాయోగ్యములు సదుత్తరగర్భితములని తోఁచెనేని సెలవిం" డనుడుఁ బృచ్ఛకుండు లేచి "దిగంత విశ్రాంత యశోధుర్యులగు విద్వచ్ఛిఖామణుల కసభ్యము లెయ్యవి? ఎట్టివానినైన సభాయోగ్యములుగాఁ జేయనైన సమర్థింపనైన శక్తులరైన తమబోఁటి కసభ్యం బొండుగలదే? పఠనయోగ్యములుగఁ జేయని విషయములు కవులకు మిగిలియున్నవే? పండితవాగధిష్ఠితములైనవెట్టివైనఁ బవిత్రములును బఠనయోగ్యములు నగుచున్నవి. సెల వీయవచ్చు" ననెను.

పండితుఁ డేదియుఁ దోఁపక నిరుత్తరుఁ డయ్యెను. సభ్యుల గుసగుసలు మెండయ్యెను. ఇవి సరియగు ప్రశ్నలు కావను వారును, విద్వదవతంసుఁడు పాపము! బాలకునిచేఁ బరాజితుఁ డయ్యెననువారును, నీప్రశ్నల కెవ్వరు నుత్తర మీయఁజాల రనువారును, రాజకుఁగఁడా? శిష్యుఁ డే యుత్తర మిచ్చునో చూతమనువారును నై సభాస్తారు లుత్తలపాటునొందుచుండిరి. నరపాలుండు సభాకలకలంబును గరసంజ్ఞల వారించి యంతే వాసి నీక్షించి "నీయుక్తికిని సమయజ్ఞతకును సంతసించితి. నీవాక్యముల నీవ వ్యతిరేకసిద్ధాంతముచేసి సదస్యులమెప్పింతు వేని విద్వజ్జిగీషు వోడెనని తీరుమానింతు" ననుడు శిష్యుండు ధీరుండై లేచి వదనంబున మందహాసంబు మొలకలెత్త సభ కభిముఖుఁడై నృపాలు నుద్దేశించి యిట్లనియె.

"నా మొదటివాక్యము రాజు ధర్మాత్ముఁ డనునది. ఇప్పుడు రాజధర్మాత్ముఁడని సిద్ధాంతీకరింపవలయు. ప్రభుఁ డగువాఁడు పండితప్రకాండుల విద్యాపారంబెఱింగి యుక్త సమ్మానంబులఁ దనిపి పనుపవలయుఁ గాని మల్లురంబోలెఁ గొట్లాటలకుఁ గొలుపఁదగదు. రాజసభ ధర్మసహితమైనది. అట్టి ధర్మయుక్తమగు రాట్సభను బరాభూతుండై విద్వాం సుండు శోచింపందగండు. దానం బ్రభువునకుం బ్రయోజ నంబు గలుగదు. విజయధ్వజమెత్తికొనివచ్చిన విద్వద్వతంసుఁ డీసభ నొకబాలకునిచే విజితుఁడై వీతసంతుష్టుం డగుటంజేసి

యీసభ యధర్మ విర్భమంబునది. సభాపతి యగు నృపతి యధార్మికుండయ్యె" ఆబాలకుని పలుకులకు సభికులును సభావిభుండును ఆశ్చర్యపడియు నతని వాక్పటిమకు మితానంద మొంది యవ్వలివాక్యముల విన నవధానముననుక్తులై యుండిరి. పదపడి ద్వితీయవిషయము రాద్ధాంతము చేయు తలంపున నాశిష్యప్రవరుం డిట్లనియె.

"ఈతని రాణి పతివ్రతకాదు. ప్రణయసమయమునం దక్కం దక్కినవేళల సద్గృహిణి పతి నాదరింపం జనదు. ఏ పండితుండు గెలిచిన నేమి యని యూరకుండక యీయమ పతితోం బాతంబులాడినకతన దేవిగారి పాతివ్రత్యమునకుం గళంకంబు సిద్ధించుచున్నది. ప్రభ్వీపక్షమే జయంబొందినప్పుడు ప్రభునకుం బరిభూతచింత ప్రబ్బికొనియెడిని. భర్తను బరాజితవ్యాకులుం జేసిన సతికి మహాశోకపకుమునం గలఁక సమకుఱుచున్నది.

మూఁడవది యితని తల్లి గొడ్రాలు. ఎట్లంటేని యితని తల్లి పున్నామనరకత్రాణుండని యితనిం గన్నది. ఇతఁడు విద్యావంతుఁడై వాక్కలహమును బెంచునదియుఁ బరులకేని తనకేని యవమానచింతాకులతం బొందించునదియు నగు తర్కమునం గడంగి పండితుల ననేకుల నవమానించె. తర్కమున నసమానప్రజ్ఞ గలిగిన శ్రీహర్షుఁ డెట్టిపాటునొందె?

యుక్తంబుల నయుక్తంబులని, యయుక్తంబుల యుక్తంబులని వాదించు తార్కికులు విద్వజ్జన మనస్సంక్షోభ కారకులగు కతమున నల్పాయుష్కులై తల్లుల గొడ్రాండ్రఁ జేయుచున్నారు. అటుకాక పూర్ణాయుష్మంతులైనను యుక్తాయుక్త నిర్ణయము లేక చెడి జీవచ్ఛవములై మాతృగాణముఁ దీర్పని వారు పుట్టనివారిలోఁ జేరుచున్నారు. ఇతఁడు పండితుఁడై విజితానేక విపశ్చితుఁడై "యిన్నాళ్లు బ్రదికి యింటివెనుకఁ జచ్చె" నన్నట్టులు తుదికీ మహాసభ నొక బాలకునిచే విజితుఁడగుటంజేసి యితని జన్మ మొక జన్మము గాదని సిద్ధాంతీకరించుచున్నాఁడను. ఇతని జన్మము జన్మమే కాదనఁ, బుట్టిన వారిలోఁ జేరఁడని తాత్పర్యము. ఇట్టివాని తల్లి వంధ్యకాక పుత్రవతి యెట్లగును?"

అతని యుక్తియుక్తములగు వచనములకు సభ్యులు పరమానంద పరవశులై కరతాళధ్వనులు చెలరేఁగఁ జెలఁగించిరి. తార్కికుని బిరుదములెల్ల శిష్యున కొసంగఁబడినవి. ప్రభుం డాతనిఁ బారితోషికములఁ బరితుష్టుం జేయఁబూనుడు నతండు వలదని వారించి తార్కికుని పాదంబుల కెఱఁగి మన్నింపవేఁడి యతనికి విభునిచే వివిధసత్కారంబులఁ జేయించెను. ఈ శిష్యుని పేరే యామునాచార్యుఁడు.



## 7. సత్యము (ఎట్టిది)



ఆ. వె. వారిజాక్షులందు ♦ వైవాహికములందుఁ
ప్రాణ విత్త మాన ♦ భంగమందుఁ
జకితగోకులాగ్ర ♦ జన్మరక్షణమందు
బొంకవచ్చు నఘము ♦ పొందదధిప!

అని శుక్రనీతి.

చ. కులసతి వాసినన్ సుతుఁడు
గూలిన నాపద లెన్నివచ్చి త
న్నలమిన, మానభంగమంది
నన్, సిరిపోయిన, రాజ్యమూడినన్,
జెలులు త్యజించినన్, దుద క
సిఁగొని ప్రాణము తీయవచ్చినన్,
బలుకఁగరాదు మానె యణు
మాత్ర మసత్యము మర్త్యుఁడెన్నఁడున్.

అని గురునీతి.

ఇం దేది మన కాచరణీయము?

వేయి యశ్వమేధయాగముల ఫలంబుకంటెను సత్యము గొప్పదని యెఱుంగుదుము. నడవడి యనియెడు కడలిని గడవ నోడకరణి సత్య మొడఁగూడునని కూడ నెఱుఁగు

దుము 'సత్యాన్నాస్తి పరోధర్మః' సత్యమునకంటె మించిన ధర్మము లేదు.

'నానృతాత్పాతకం పరం' అనృతముకంటె గొప్ప పాపము లేదు.

'సత్యం బ్రూయాత్'
'సత్యం వద' } సత్యము పలుకుము.

'నాస్తి సత్యసమంతపః' సత్యముకంటె మించిన తపస్సు లేదు.

'సత్యమేవ జయతే నానృతం' సత్యమే జయించును. అసత్యము జయింపదు.

'సత్యేన వాయురావాతి సత్యేనాదిత్యో రోచతే
దివి సత్యం వా ప్రతిష్ఠా సత్యే సర్వం ప్రతిష్ఠితం'
'తస్మాత్సత్యం పరమం వదంతి'

సత్యముచే వాయువు వీచుచున్నది. సూర్యుఁడు ప్రకాశించుచున్నాఁడు. ఆకాశము నిలిచియున్నది. ఇంతయేల? సర్వము సత్యము నాధారముచేసికొని నిలిచియున్నది. కాఁబట్టి పెద్దలు సత్యమే యుత్కృష్టమని చెప్పుదురు. ఇత్యాద్యుపనిషద్వాక్యములు సైతము కొంత కొంత మెఱుంగుదుము. శుక్రనీతిని బలి వినక బాగుపడెను. బృహస్పతి నీతి హరిశ్చంద్రుండు విని బాగుపడెను. శుక్రనీతి నవలంబించినచో సత్య మవసరమ్ములేదు. సత్యము పలుకుచోటు మఱి కాన

రాదు. కావుననే (ఇష్టమున్నచో) బొంకవచ్చు నని శుక్రుఁడు తంత్రముగాఁ దప్పించుకొనియెను. దీనిచే గీష్పతి నీతియే యనుసరణీయమని తేలుచున్నది. కాని యది కలి కాల మానవులకు సాధ్యమా? కలికాలమాహాత్మ్యముం గూర్చి మఱియొకచో విస్తరింతము. ఇట సత్యమన నెట్టిది? యని విచారింతము.

'సత్యం భూతహితం ప్రోక్తం' ప్రాణిహితమే సత్యము.

ఉ. "భూతహితంబుగాఁ బలుకు
బొంకును సత్యఫలంబునిచ్చుఁ ద
ద్భూత భయాస్పదంబగు ప్ర
భూతపు సత్యము బొంకునట్ల"

దేనినిగాని స్థూలదృష్టిం బరికించి యిదమిత్థమని సిద్ధాంతీకరింపఁబూనినచో ధర్మసందేహములు పెక్కు లుప్పతిల్లుచుండును. సూక్ష్మదృష్టిం బరిశీలించిన సందియము లుండవు. అట్టివానిని ధర్మసూక్ష్మములని పెద్దలంద్రు. ధర్మబద్ధమైనది సత్యము. బద్ధముకానిది యబద్ధము.

తే. గీ. అనృతమయ్యుఁ బాపంబుగా దరయనెచట?
(అను శిష్యుని ప్రశ్నకు)
ధర్మమును నిల్పుకొఱకాడు తప్పునందు;
(అని శంకరాచార్యులవా రుత్తర మిచ్చిరి)

ఒకవిప్రుండు సంసారమున సారములేదనిరోసి వైరాగ్య

పరుండై గ్రామవాసముమాని కాననముం జేరి మనోహరమైన యాశ్రమంబొండు గాంచెను. అందున్నతములును స్వాదుఫల భారావనతములు నైన పలువిధవృక్షములు పక్షులకే కాక పథికులకు నాశ్రమవాసులకుఁ దృప్తి నొనఁగూర్చుచుండెను. కుసుమ లతాకుడుంగములు చూడఁజూడ రమణీయములై తత్ప్రసూన సౌరభానీత షట్పద నినదంబుచే శ్రావ్యంబై యొప్పారె. అందలి మందపవనుండు పుష్పవతిం దాఁకి తద్దోషంబు వోవ శుద్ధోదకంబులఁ దానమాడి మరల దానిం దాఁకుదునేమో యను శంకచే మెల్లన నడచువాఁడుంబోలె గంధవహుండై శీతలుండై సంసేవ్యమానుండై యలసగమనంబున వచ్చుచుండె. అచటి శుకశారికా నికరంబులు మునిగణ సన్నికృష్ట సంచారకారణంబున 'సత్యంవద, ధర్మంచర' యిత్యాది స్మృతివాక్యముల శ్రవణపేయంబుగ నుద్ఘోషించుచుండె. చూతకిసలయంబులఁ గడుపార మెక్కి యొనరించు కోయిలల కుహూకారంబులు మునిబాలకులు పాడు పాటల కుపశ్రుతు లగుచుండె. తేనెవాఁకల మ్రోఁత యధ్యయనము చేయువారి స్వరదోషముల మఱుఁగుపఱచుచుండెను. హరిణ శాబకములు పచ్చికచివుళ్ళ మెక్కి చెవులు నిక్కించి బిత్తరపుఁ జూపులు సూచుచుఁ దల్లులచెంతకుఁ బేరెము వాఱుచుండెను. ఇట్టి మనోజ్ఞప్రదేశంబున నిలువ నిశ్చయించి యాద్విజుండు పర్ణకుటీర మొకటి గల్పించికొని యందు వసించి ఫలమూలా

ములు దించు నిశ్చింతమెయి జగన్నాథు నెదఁ దలంచుచు జీవితశేషంబు సుఖంబు గడుపనెంచె. తత్పరిసరాశ్రమవాసు లగు మునులయొద్ది కప్పుడప్పు డేతెంచి వారివలన సత్కథలు విని పలుసందియములఁ దొలఁచుకొనుచుండెను.

ఇట్లుండ నొకనాఁ డా కాంతారంబునఁ గొందఱు పాంథులు పోవుచుండ దోఁపిడికాండ్రు వారి వెనుదవిలి తఱుమఁ జొచ్చిరి. మానప్రాణభీతులై పథికులు పరుగులువాఱి విప్రు నాశ్రమంబుసొచ్చి దట్టంపుఁ బొదరింఢ్ల దాఁగిరి. దిచ్చుమొగం బైన తెరువరుల యడుగులజాడం గనిపట్టి యాపచ్చికాండ్రు వచ్చి యచ్చోఁ గూర్చుండిన భూసురుంగాంచి "మున్నుగవచ్చిన బాటసారు లెటనున్నా" రని యడిగిన నా చోరులయాకృతుల, వారి హస్తంబుల ధరించియుండు కాలదండంబులంబోని దండం బులంగాంచి వారలు చోరులని యెఱింగియు, నెఱింగినది యెఱుంగననిన నసత్యదోషమని భావించి, తెరువరులుడాఁగిన పొదలఁ జూపెను. తెక్కలికాండ్రాపొదల నొదిఁగినవారిని బయటికిలాగి సొత్తుల నీని పురుషులఁ గొందఱ వ్రమందించి స్త్రీలమానంబులు తూలించి హింసించి దోఁచుకొనిపోయిరి. తెరువరుల మాన ప్రాణ ధనంబులు సెడ నావిప్రుని సత్యవా క్యంబు కారణంబయ్యెఁ గాన నాసత్యంబు దోషంబుగఁ బరిణ మించి యాతని నరకప్రాప్తునిఁజేసె.

శ్లో. త్యజధర్మ మధర్మంచ । ఉభే సత్యానృతేత్యజ
ఉభేసత్యానృతే త్యక్త్వా । యేనత్యజసితత్త్యజ.

సన్న్యాసులకు దేహాభిమానములేదు. వారు వైరాగ్యముచేఁ బుణ్యపాపములను సత్యాసత్యములను వదలుదురు. అట్లన్నిటిని విడిచిన పిదప యుద్ధాంతమునఁ గరవాలమును విడుచు శూరునివలె నావైరాగ్యమును గూడ వదలుదురు. మన సన్న్యాసి యట్టివాఁడై యుండెనేని దొంగలకుఁ దానీరీతి నుత్తర మిచ్చియుండును. "నీవడిగినవా రెటనున్నారో యోచించు మనస్సు చలింపదు గానఁ దాఁజేయదు. తనవారిచేఁ జేయింపదు. చూచునట్టి కన్నులకు వచించు యోగ్యత లేదు. వచింప సమర్థతగల వాక్కునకుఁ జూచు సామర్థ్యము లేదు. కావున నావలన మీకుఁ బ్రయోజన మగపడదు. మీదారిని బొండు" ఇందు సత్యముచెడకయు నసత్యమాడకయు నుండు నట్టిరీతిగలదు. ఏదియెట్లైనను బాపకార్యము వర్జింపఁబడినది.

తృణసంవృతంబులైన కూపంబులంబోలెఁ గపట ధర్మసంవృతంబులై—యనఁగాఁ బుణ్యరూపంబునొంది—పాపంబులు మానవుల మోసపుచ్చుచుండు. ధర్మతత్త్వజ్ఞుండు వానినెఱిఁగి యెడగలిగి నడవవలయు. మనుజుని యోగ్యత ననుసరించి యొక్కొక్కప్పుడీధర్మసూక్ష్మమును స్థిరీకరింపఁదగియుండును. ఆవిప్రుఁడు ముచ్చుల నుక్కడంప శక్తిలేనివాఁ డగుటంజేసి నిరపరాధుల కపాయంబు గలుగనీమికై యనృతమాడవలసి

యుండెను. అట్టి సందర్భమే యొక మహావీరునకుఁ బొసఁగనేని యతఁ డసత్యమాడక నిజమాడి దుర్జనుల నిర్జింపవచ్చుఁగదా!

కురుక్షేత్ర సంగ్రామంబున ద్రోణవధోపాయమును జింతించి కృష్ణుండు ధర్మజుని "నశ్వత్థామ చచ్చె" నని చెప్పఁ బ్రోత్సహించెను. అజాతశత్రుండు ధర్మమూర్తి గావున నందుల కొడంబడఁడయ్యె. అంతఁ గృష్ణుండు "ధర్మరాజా! ప్రాణరక్షణ సమయంబున బొంకిన సత్యంబగును. ద్రోణుఁడీ యపరాహ్ణమున నని సేసెనేని యిక్కడి యోధు లెక్కడైనఁ బ్రదుంగిపోక యుండనేర్తురే? ఇందఱ నీ వారి రక్షించు కర్జంబ కృత్యం బెట్లగు? మఱొక యుపాయంబుగలదు. మాళవేంద్రుం డగు నింద్రవర్మ వారణం బశ్వత్థామ యను పేరిటిది మారుతి చేతఁ జచ్చె నది నెపంబుగఁ జెప్పు" మని యనేకవిధంబుల నొక్కి వక్కాణింపఁ దుదకు సమ్మతించి ధర్మపుత్త్రుండు ద్రోణునిచెంత కేగి యెలుఁగెత్తి వర్ణసమితి యచ్చుపడఁగ "అశ్వత్థామ హతః" అని పదంపడి "కుంజరః" అని మెల్లన ద్రోణుని చెవికి వినరాక యనియె. ధర్మజుండు సత్యవ్రతుండు గాన నతని వాక్యంబుల నమ్మి కుంభసంభవుండు దిగులువడి యింకి జన్మ మేటికని తేరిపై శరశరాసనము లూడ్చి యోగ నిష్ఠ నొంది యత్తనువుం బాసి జ్యోతీరూపంబునఁ బరమ స్థానంబునకుఁ జనియె. ఏతత్సత్యాపదోషంబున యుధిష్ఠిరు నకు యమలోక దర్శనప్రాప్తియయ్యె. ఇతఁడు బలవంతుఁ

డయ్యు వంచింప బొంకుటచేత నేకదా యనృతదోషం బతనికి సంప్రాప్తమయ్యె.

శ్లో. సత్యం బ్రూయాత్ ప్రియంబ్రూయాత్ నబ్రూయాత్ సత్యమప్రియమ్
ప్రియంచనానృతం బ్రూయాదేష ధర్మస్సనాతనః.

సత్యము పలుకుము. ప్రియవచనము లాడుము. అప్రియమగునది సత్యమైనను నొడువకుము. అట్టులని ప్రియమను తలంపున ననృతము వచింపకుము. ఇదియే సనాతనధర్మము.



## 8. కఱవు

సకాలమున వర్షము పడక పైరులు పండక ప్రజలకుఁ దినుట కన్నము లేక యుల్లాసు కాలమునకుఁ గఱవని పేరు. ఈ కఱవునకు మూలకారణము వర్షము కురియకపోవుటయే యని మనకుఁ దెలియును. ఆ వర్ష మేల సకాలమునఁ గురియకున్నది? భగవదాజ్ఞాబద్ధులై సూర్యచంద్రులు వేళ తప్పక యుదయాస్తమయముల నొందుచున్నారు. వాయువు వీచుచుండె. భూమి భరించుచున్నది. గోళములూడి మనపైఁ బడుటలేదు. సముద్రము మేరమీఱుటలేదు. సర్వము సక్రమముగ జరుగుచుండ మేఘములు మాత్ర మేల కురియ

కున్నవి? అవి దేవు నానతి మీఱియే వర్తించుచున్నవా? వర్షాధిదేవత పర్జన్యుఁడని వేదములు నుడువుచున్నవి. ఆతని పాలనాక్రమము చెడియెనా? అట్లైన నతని పైయధికారి యగు పరమేశ్వరుఁడు విచారింపకుండునా? పైవారికిఁ దెలియ నీక క్రిందియుద్యోగులు ప్రజలయొద్ద లంచము గైకొని వారి కార్యములు చక్కఁబఱచునట్లు పర్జన్యుండు మనయొద్ద నుత్కోచము గ్రహింప నుంకించుచున్నాఁడా? సర్వజీవి హృదయ స్థితుండగు సర్వేశ్వరుఁ డది గ్రహింపకుండునా? అదియును గాదు. భగవంతుఁడే మనల నిట్లు కష్టపెట్ట నుపక్రమించు చున్నాఁడా యనుట కతఁడు సర్వసముఁడని మనమే సమ్మ తించుచున్నారము. ఇఁక దోష మతనిది గాక సహాయో ద్యోగిదియుఁ గాకపోయినపుడు మనదే యని తీర్మానింపవలసి యున్నది. ప్రకృతి శాస్త్రజ్ఞానసంపన్నులు సూర్యకిరణము లచే సరిత్తటాక సముద్రజలంబు లావిరిరూపంబున నాకర్షింపఁ బడి మేఘంబులై శీతలవాయుస్పర్శనంబున మరల జలంబై వర్షించుచున్నదని దృష్టాంతపూర్వకంబుగ వ్రాయుచున్నా రు. ఇకార్యంబు నైసర్గికంబుగ జరుగుచున్నదనుచున్నారు. అటులైన నీ వఱపునకు సూర్యుఁడు కారకుఁడా? వాయువు హేతుభూతుఁడా? వీరి కార్యములును స్వాభావికము లైన ప్పుడు వారిపైఁ దప్పుమోపుట కవకాశ మెక్కడిది?

సత్యమునకే వాయువు వీచుచుండె. సూర్యుఁడు ప్రకా

శించుచు నున్నాఁడు.

తే. గీ. నడపునది బ్రహ్మవాదిత్యుఁ  గడఁకతోడ
త్రిదశులాతనిఁ గొల్చి చ  రించువారు
మహితధర్మంబునన యస్త  మానమగును
నిలుచు సత్యమాధారంబు  గలుగ నతఁడు.

సత్యము మనుజులవలన నిలుపఁబడవలసి యున్నది. సత్యము మనయొద్ద నెప్పుడు సన్నగిలుచున్నదో యప్పుడు సూర్యాదుల కార్యంబులు తాఱుమాఱగుచున్నవి. ఇదియె కారణమును ధర్మశాస్త్రములుకూడ నిట్లు చెప్పుచున్నవి.

శ్లో. అపూజ్యాయత్రపూజ్యంతే। పూజ్యాయత్రావమానితాః
తత్రత్రయంభవిష్యంతి । వ్యాధిదుర్భిక్ష తస్కరాః.

ఎచ్చట నపూజ్యులు పూజ్యులగుచుందురో, యెచ్చటఁ బూజ్యు లపూజ్యులగుచుందురో యచ్చట నకాల మృత్యుభయజనకంబులగు స్ఫోటక విషూచికామహామారీత్యాది వ్యాధులు, జీవన భీతిప్రదంబైన దుర్భిక్షంబు, మానప్రాణ ధన హరణ కారణంబైన చోరభయంబునను నీమూఁడును గలుగుచుండును.

శ్లో. కాలే పానీయమశనం కాలే బీజంతు వాపయేత్
కాలే కర్మ సముద్దిష్టం విపరీతే విపర్యయః

యుక్తకాలమున నన్నపానీయములఁ గొనుట, తగిన కాల మెఱిఁగి విత్తునాఁటుట, అనుకొన్నకాలమునకుఁ గార్య

మొనరించుట తప్పినపుడు ఫలము విపరీతమగు టేమియాశ్చర్యము? మన యధర్మవర్తనములవలనను, బరపీడాజనకములగు కార్యములఁ జేఁతచేతను, సత్యము క్షీణించుచున్నది. సత్యక్షీణముచేతనే క్షామదేవత ప్రత్యక్షమగుచున్నది.

జరుగుచున్న కాలమునకుఁ గలికాలమని పేరు. ఈ కాలపు జరుగుఁబాటులను త్రికాలజ్ఞులగు మన పూర్వపుఁ బెద్దలు మన హెచ్చరికకై తెలిపియున్నారు.

శ్లో. దాతాదరిద్రః కృపణోధనాఢ్యః
పాపీ చిరాయు స్సుకృతీ గతాయుః
రాజాఽకులీనో నకులీనసేవ్యః
కలౌయుగే షడ్గుణమాశ్రయంతి.

దాత దరిద్రుఁడై, లోభి ధనికుఁడై, పాపి చిరాయుష్కుఁడై, పుణ్యుఁ డల్పాయుష్మంతుఁడై, రాజు నీచకులుఁడై, నీచకులుఁడు సేవింపఁదగినవాఁడై యొప్పు నీ కలియుగమం దీ యాఱు గుణములే ముఖ్యముగ నావరించియుండును.

మఱియు సత్యం బడుగంటుటచే నాయువు క్షీణించు. ఆయుక్షయంబున విద్య లల్పంబులగు. అల్పవిద్యచే విమోహంబు మిగులు. మోహంబుచే లోభంబును, దానిచేఁ గామంబును, గామంబునఁ గ్రోధంబును, దానివలన నన్యోన్యపీడయుఁ బ్రాప్తించు. వర్ణాశ్రమధర్మంబు లడుగంటుచు

విపర్యస్తస్థితి నొంది వర్ణసంకరంబులగు. కాలవర్షంబు గలు గదు. బీజములు పెక్కులు పొల్లులగును. క్రయ విక్రయం బులఁ గపటంబు మెండగును. అన్న విక్రయంబు విద్యావిక్ర యంబు తలచగును.

క. హేతు ప్రత్యయవాద వి
చేతస్కులై వేదనింద ♦ సేయుచును మఖ
వ్రాతంబులు వ్రతములుఁ బెడఁ
బాతురు దుర్మార్గ కర్మ ♦ పరులై విప్రుల్.

క. సుతుఁ డవమానించు జనకుఁ
బతి నవమానించు భార్య ♦ పడఁతులుఁ బతులున్
మతి నొండొరువుల మెచ్చక
సతతముఁ జరియింతు రిష్ట ♦ సంచారములన్.

క. గురుఁ గొనియాడఁడు శిష్యుఁడు
గురుఁడును శిష్యునెడ వంచ ♦ కుండగు మది నొం
డొరువుల నొల్లరు బంధులు
పొరిఁబొరిఁ గలవులగుఁ బ్రజకుఁ ♦ బాడమునుభయాముల్.

యుగాంతమునఁ బదియాఱేండ్లే ప్రజలకుఁ బరమాయు వగు. ఏ డెనిమిదియేండ్ల వయసుననే స్త్రీలు బిడ్డలఁ గందురు.

చాలనటి కిందలి విప్పటికే మనల నాశ్రయించి యున్నవి. మిగిలినవియుఁ గూడినంత శీఘ్రకాలముననే యావ రింపఁగలవనియుఁ దోఁచెడిని.

ఒక్కొకచో నేండ్లకొలంది వృష్టిలేక కష్టపెట్టుచున్నది. ఒక్కొకచోఁ గలిగిన నతివృష్టియై కఱవే మెఱుఁగనిపించు చున్నది. ఇట్టి కష్టము లేర్పడ మన యధర్మములే హేతువు లగుచున్నవి. కఱవుచే నరులు మఱింత యధర్మవర్తను లగు చున్నారు. కఱవు తగ్గిన నధర్మములు తగ్గునేమో! అధర్మము తగ్గిననే యీ క్షామమునకు క్షామదశ సిద్ధించునని యేర్పడుచున్నది. పిచ్చి కుదిరినఁ బెండ్లియగును. బెండ్లియైనఁ బిచ్చి కుదురునను లోకోక్తి యిటఁ బొనుపడుచున్నది. ఈ దిక్కుమాలినగతికి దేవుఁడే శరణ్యుఁడు.

అంగభూపాలునకు లేక లేక వేనుఁ డను కొడుకు పుట్టెను. తల్లిదండ్రు లతని నల్లారుముద్దుగఁ బెంచిరి. ఆ వేనుఁడు బాల్యమందే తుంటరియై యీడుబాలురఁ జావ మోదుచుఁ బశుప్రకరంబుల నొంచుచు సాధుల బాధించుచుఁ జేయరాని కార్యముల నొక్కటియేని వదలక చేయుచుండెను. వయస్సు హెచ్చినకొలంది వాని దౌర్భాగ్యమును హెచ్చు చుండెను. తల్లి పెక్కువిధముల బోధించియుఁ దండ్రి తిట్టియుఁ గొట్టియు నానావిధంబుల హింసించియు వాని దుశ్చేష్టితంబుల మానుపఁజాలక దుఃఖితాత్ముఁడై,

క. "అనయము నిట్టి కుపుత్రుని
గని పరితాపంబు బొందు కంటెను ధరలో

ననపత్యుం డగుటొప్పును
వనజాక్షు భజించునట్టి శ్రీ వాఁడగు వాఁడున్"

అని యోజించి యొకనాఁటి నడిరేయి నిద్రించిన భార్యను గృహమును బ్రజలను రాజ్యమును దిగవిడిచి యెక్కడకో పోయెను.

మఱునాఁడు రాజబంధులు పురోహితులు మంత్రులు మొదలగువారు రాజునుగానక వెదక నారంభించిరి. ఎంత వెదకియు లాభములేకపోయెను. రోసిరోసి విసివి విఫలోద్యోగులై మగిడి వచ్చి రాజ్యం బరాజకం బగుటకుఁ జింతించి మహర్షులతో నాలోచించి సునీథ యనుమతి వేనునికిఁ బట్టముగట్టిరి.

దుర్గుణంబులకుఁదోడు దొరతనము ప్రాప్తింప వేనునికి మిన్నుమన్ను సమమయ్యెను. అతని పరిపాలనంబున సత్పురుషులు పరిభూతులైరి. దుర్మార్గు లుల్లసిల్లిరి. ప్రజలకెల్ల నప్పుడా రాజ్యమరణ్యప్రాయముగఁ దోఁచెను. అతఁడు ప్రజల విశేషముగ బాధించుటంజేసి యనేకులు పట్టణములు పల్లెలు విడిచి యడవులపాలైరి. వేనుఁ డంతతోఁ బోక,

క. దివ్యులు వెఱఁగందఁగఁ బృ
థ్వీవ్యోమములగల భేరి శ్రీ వేయించె "నయ
ష్టవ్యమదాతవ్య మహో
తవ్యం విప్రా" యనుచు ను శ్రీ దాత్త ధ్వనులన్.

ఈఘోర ప్రమాణముతో డనొక్కిపెట్టిన విప్రుల గుంపు లగిలెను. మునులు గుములుగట్టి వేనునిజేరి యనేకవిధముల నీతు లుపదేశించిరి. వారి మాట లతఁడు నిరాకరించి యిట్లనియె. "మునులార! మీార లిట్లు పశుచుఁడసఘునఁ బలుకు చున్నారు. "నావిష్ణుః పృథివీపతి" అనుట వినరే? నరపాల రూపమును ధరించిన యీశ్వరు నన్నువిడిచి యన్యుల నేల భజించెదరు?

క. పరికించి సనుభజింపుఁడు,
ధరణీశుఁడు సర్వదేవతామయుఁడగు, మ
త్సరముడుఁగుఁడు, నాకంటెను
బురుషుఁడు మఱియొక్కఁ డగ్రపూజార్హుఁడిలన్.

మీారొనర్చు సర్వకర్మంబులు మత్ప్రీతికరంబులుగా జేయుఁడు" అని శాసించిన మును లదరిపడి యొక్కపెట్టున "నిట్టి నీచాత్మునిఁ దుంటకంటెఁ జచ్చుట మేలు. వీఁడు జీవించె నేని జగంబులు వీనిచే భస్మంబు గాఁగలదు. ఈ పాతకుండు హతుఁ డగుఁగాత!" మని హుంకరించిరి. ఆహుంకారంబున వేనుఁడు విగతప్రాణుఁడయ్యె. సునీథ తనయుని మరణంబునకు దుఃఖించి యతని తనువును భద్రపఱచి యుంచె. కొన్నాళ్లకు రాజ్య మరాజకమయ్యెను. చోరులు దుష్టులు ప్రబలిరి. మోసములు మెండయ్యెను. సత్కర్మములు సాగవయ్యెను. మరల మునులు సునీథగృహమునకు వచ్చి వేనుని కళేబరం

బును దెప్పించి తదూరుమథనంబు గావింప నంతొక మిథున ముదయించె. అందుఁ బురుషునకుఁ బృథుఁడని స్త్రీకి నర్చి యని పేరులిడి వారికిఁ బట్టంబుగట్టి మునులు తమ తమ యాశ్రమ ములకుఁ జనిరి. పృథుఁడు తండ్రివలెఁ గాక యధిక ధర్మా త్ముఁడై ప్రజలఁ దన కన్నబిడ్డలఁబోలెఁ గాపాడుచు సధర్మము నడగించుచు వచ్చె. కాని కఱవుమెండై కాలవర్షంబు లేమిఁ బంటలు పండక ప్రజలు క్షుత్పీడాక్షీణదేహులై వైన్యుని శరణంబు సొచ్చి,

క. "అరయఁగ నేముబుభుక్షా
పరిపీడం బడితిమయ్య ! పైకొని తరుకో
టర జనిత వహ్నిచేతను
దరికొను వృక్షములువోలె ! ధరణీనాథా!"

అని ప్రార్థించిరి.

నరవరేణ్యుండు వారి మొఱల విని "యింతకుఁగారణ మీభూమిగదా! దీనిని బ్రద్దలుగావింతు" నని వింట నమ్ము సంధించెను. భూమి గడగడ వడఁకి గోరూపమునఁ బరువులు వాఱసాగెను. రాజు వెనువెంటఁ దఱిమెను. తుదకుఁ బృథివీ దేవి యనన్యశరణ్యయైరాజుం బ్రార్థించెను. "నీవు యజ్ఞంబుల యందు హవిర్భాగముఁ గొంచుఁ బ్రజలవలని వ్యావసాయిక కష్టముంగొంచు ఫలంబేల యీయవైతి" వన ధరణి యిట్ల నియె. "రాజతి దుష్టుఁడగుకతనఁ బ్రజలు నట్లయిరి. యజ్ఞాదు

లంతరించెను. కృషియుఁ గ్రమంబుగఁ నిర్వర్తింపఁ బడదయ్యె. ఓషధీవితతుల నేనగ్రసించి నాయందజీర్ణంబుగావించుకొంటి. విషమస్థలినైయున్నదానను. నాకొక సమస్థలంబును గల్పించి చూచుమాత్రానఁ జేఁపుగలుగునట్టి వత్సంబుఁజూపి కోర్కులఁ బిదికి కొనుఁడు" పృథుండును,

చ. మనువును దూడఁజేసి గరి
మ౯ నిజపాణితలంబులీల దో
హనముగఁజేసి యందు సక
లౌషధులం బిదికెం గ్రమంబున౯
దనరఁగఁ దద్విధంబునను
దత్పృథువత్సలయైన భూమియం
దనయము వారువారును బ్రి
యంబగు కోర్కులువొందిరున్నతి౯.

భూమిని సమముగావించి వ్యవసాయముచేసిన ఫలము నిత్తునని భూమి వాక్యముల యర్థము. రాజు ప్రజల సోమరితనంబును బోఁగొట్టి తాను వారికి సహాయభూతుండై వారి యెడ నుండిన యధర్మవర్తనములఁ గ్రమంబుగఁ బోకార్చి కృషి సేయించి క్షామముఁబాపెను.



# 9. సుఖ మెందున్నది?



తే. గీ. "ఎవ్వఁడు ప్రవాసిగాకయు ఋణియుఁగాక
స్వగృహమందున మూన్నాళ్లు జాలనైన
నాకులో యాలములో యున్న దంతొయింతొ
వండికొని తినునాతఁడే పడయుఁ దృప్తి.

అని ధర్మరాజు, ధర్మదేవత "ఎవఁడు సంతసించు" నని యడుగఁగా నుత్తరమిచ్చెను. 'క్రోధంహిత్వానశోచతి' 'మనో యమ్యానశోచతి' క్రోధమును విడిచినవాఁడును మనస్సు నడఁచినవాఁడును దుఃఖింపఁడు. (అనఁగా సుఖించును) 'శోకస్త్వజ్ఞానముచ్యతే' అజ్ఞానమే శోకమని చెప్పఁబడును. 'కింసుఖం? తుష్టిః' సుఖమేదియనఁగాఁ దుష్టియనిశంకరాచార్యులుచెప్పిరి.

ఒక ధీమంతుఁడు తనభక్తికి మెచ్చి ప్రత్యక్షమైన భగవంతు నిట్లని వర మడిగెను.

శ్లో. ఏకాభార్యా త్రయఃపుత్రాః ద్వౌహలౌ దశధేనవః
మధ్యరాష్ట్రంతు సుక్షేత్రం దేహిమే మధుసూదన!

సుగుణవతి యగు నొకభార్యను ముగ్వురుపుత్రులను రెండుమడకలను ఆవుల నెన్గులఁ బదింటిని మంచి పొలముల నడుమనుండు సుక్షేత్రమును, భగవంతా! నాకు దయ చేయుము. ఒకప్పుడు పార్వతి భర్తతో నిట్లు చెప్పెను.

శ్లో. రామాద్యాచయ మేదినీం ధనపతేర్బీజం బలాల్లాంగలం
ప్రేతేశాన్మహిషం తవాస్తివృషభః ఫాలంత్రిశూలం తవ
శక్తాహంతవచాన్నదానకరణే స్కందోస్తి గోరక్షణే
ఖిన్నాహంహర! భిక్షయా కురుకృషిం గౌరీవచఃపాతువః.

నీ ప్రియశిష్యుని పరశురాము నడిగి కొంత క్షేత్రముం గొనుము. నీమిత్రుని గుబేరుని విత్తనము లడుగుము. మఱొక శిష్యు బలరాము నడిగి మడక నెరవలిగానైనఁ గొనితెమ్ము. త్రిశూలమును గృషకము (కఱ్ఱు) గాఁ గొట్టించుము. నీయాభరణంబులగు సర్పములను వాఱెనగా మోకుగా నుపయోగింపుము. నీకొక యెద్దు గలదు. దానిజతకు నీ క్రింది యుద్యోగియగు యముని మహిషమును బట్టికొనుము. పెద్దకొడుకు విఘ్నేశ్వరుఁడు సేద్యముచేయును. చిన్నకొడుకు కుమారస్వామి పసువుల మేపును. మీకుఁగూడ నే నన్నము పెట్టఁగలను బిచ్చమెత్తు కష్టమేల? సేద్యము చేయింపుము.

'కృషి రేవ మహాశ్రేష్ఠం వినాదైన్యేన జీవనం' దైన్యముతోడి జీవనముకంటెఁ గృషిచేసి బ్రదుకుట మిక్కిలి మంచిది.

కొందఱు ధీరు లిట్లు చెప్పుచున్నారు.

హృదయ మను క్షేత్రమందు వివేక మను మడకకుఁ బ్రయత్న మనెడి యెద్దులను మనస్సను నాఁగటి త్రాటితోఁ గట్టి ధర్మమను మేడినూఁదిపట్టి శ్రద్ధ యనెడు మునికోలగొని దున్ని సత్కార్య మను నెరువువేసి భక్తి యనెడి బీజమునాటి

సత్యమను జలమునోసి రాగద్వేషాదు లనెడు కలుపును సద్వి
చార మను కూలితోఁ దీసివైచి నిత్యానంద మను పంట
పండించుకొని వివేకి సుఖించును.

హస్తశుద్ధి, వాక్శుద్ధి, గుహ్యశుద్ధి, నేత్రశుద్ధి గలవా
రెప్పుడే నెచ్చటనేని సుఖమును యశస్సును బొందుదురని
మఱికొందఱు చెప్పుదురు.

ఇఁకఁ గొందఱు సంపద, సత్సంతానము, సద్గుణము,
సదనుగ్రహము, సచ్ఛీలము, సత్యము, సరస్వతి యాసకార
సప్తక మెచ్చట నుండు నచ్చటఁ గొఱఁతలేని సుఖ ముండు
నని వాక్రుత్తురు.

జీవుఁ డను రథికుఁడు శరీరమను రథమునఁ గూర్చుండి
బుద్ధియను సారథిని నియమించి మనస్సనెడు పగ్గములతో
విషయాసక్తములైన యింద్రియంబు లను నశ్వంబులఁ బిగఁ
బట్టి విషయంబు లను విషమ భూములకుఁ బోనీక సన్మార్గ
మను త్రోవను బోనిచ్చి మోక్షమను స్థానముఁ జేరి శాశ్వత
సుఖంబు ననుభవింపవచ్చు నని వేదాంతవిదులు నొడువు
చున్నారు.

మార్గమేది? యను ధర్మదేవత ప్రశ్నకు ధర్మజుం
డిట్లుత్తర మిచ్చె.

శ్లో. తర్కోఽప్రతిష్ఠశ్శ్రుతయో విభిన్నా
నైకోమునిర్యస్య మతం ప్రమాణం

ఐ ద వ భా గ ము



ధర్మస్య తత్త్వం నిహితం గుహాయాం
మహాజనోయేనగతస్సపంథాః.

ఊహ స్థిరపడుటలేదు. వేదము లొకటికొకటి భిన్నాభి ప్రాయముల నిచ్చుచున్నవి. ఎవ్వనిమతము ప్రామాణ్య మనుట కును ప్రామాణికుఁడైన ఋషి యొక్కఁడును గానరాఁడు. ధర్మతత్త్వము గుహలోఁ బూడ్పఁబడినట్లున్నది. పెద్ద లెట్లే గిరో యదియేత్రోవ.

లోకము పలువిధములుగదా!

శ్లో. వైద్యోవదంతి కఫపిత్త మరుద్వికారాౝ
జ్యోతిర్విదో గ్రహగతిం పరివర్తయంతి
భూతాభిషంగ ఇతిభూతవిదోవదంతి
ప్రాచీనకర్మ బలవన్మునయోవదంతి.

ఒకఁడేదేనొక కష్టము వాటిల్లినపుడు కారణము తెలిసి కొందమని వైద్యులనడుగఁ బైత్యదోషముచే శ్లేష్మము ఘనీభ వించెననియో వాతాధిక్యముచేతఁ బైత్యము ముదిరి యిట్లయ్యె ననియో చెప్పుదురు. ఇదిగాదని జోస్యులనడిగిన గురువు వక్రించెనని, గురువును నీచస్థానమున నుండి యంగారకుఁడు చూచుచున్నాఁడని, షష్ఠాష్టకమనియు నందుచే నిట్లయ్యె ననియు సెనగలు కందులు దానముచేసిన నీపీడ వీడుననియు నొడువుదురు. వీరిని గాదని భూతవైద్యుల నాశ్రయింప నీవు నీయూరి కుత్తరదిక్కున రావిచెట్టున నొకకొమ్మ నఱుకుచుండ

నందలి మునిగ్రహ మొకటి పోఁకెనని, నీవిరోధి యొకఁడు చేతబడి చేసి యుండుటచే నీకిట్లయ్యెనని, ముత్త్రోవలు గలియు చోట దాఁటుతీసిన నివారణమగుననియుఁ బలుకుదురు. మునుల నాశ్రయింప నీపురాకృత కర్మఫల మీరీతిఁ బరిణమించె నని వచింతురు.

ఇఁక నుద్యోగములయందు సుఖమున్నదేమో విచారింతము.

ఒకరిపై నొక రధికారము వహించి యున్నతోన్నత పదవులలంకరించుటచే స్వేచ్ఛ లేక పరాధీనతనొందియున్నప్పు డేమి సుఖ మున్నది? పరాధీనతచేఁ గలుగు దురవస్థలను నను భవ చక్రవర్తియగు భర్తృహరి యిట్లువాక్రుచ్చుచున్నాఁడు.

చం. పలువలు పల్కుమాట లొక
భంగి సహించితి బాష్పవారి లో
పలనె హరించి శూన్యమగు
భావమున న్నవ్వెడనవ్వ నవ్వితిన్
బొలుపఱి విత్త జాడ్యహత
బుద్ధుల కంజలి చేసితిన్ గటా!
తలఁకక యింక నేపనికిఁ
దార్చెదొ నన్నుదురాశ! నీవిటన్.

ఒక యుద్యోగి యింకొకనికి నతఁడు మఱియొకనికి నిట్లంద ఱుద్యోగులు రాజునకు లోఁపడియుందురు. కాన రాచ రికమునం దేమైన సుఖ మున్నదా? తిరిపెగానికి తిండిచింత

యొక్కటి కాఁగా భూపునకుఁ బుట్టుఁ డుండును. "రాజా రాష్ట్ర కృతం పాప" మ్మను ధర్మోక్తి ననుసరించి రాజు ప్రజలయెడఁ గన్ను గలిగి వర్తింపవలయు. కానినాఁడు "రాజ్యాంతే నరకం ధ్రువ" మ్మను మాట తప్పదు. రాజును బోషించువారు ప్రజలే కాన రాజునకును బరాధీనత సిద్ధించు చున్నది. ప్రజా ప్రభు సంబంధము సుడిగుండములోని నీటి వలెఁ బరివర్తించుచున్నది. ప్రజ లుద్యోగులకు నుద్యోగు లున్నతోద్యోగులకు, వారు మంత్రులకు, మంత్రులు మహీశునకు, మహీశ్వరుండు మానవులకు నధీనత నొంది యిట్లు పరిభ్రమించుచుండ స్థిరసౌఖ్య మిం దేరికిఁ గలదు?

ఇఁక నైశ్వర్యవంతుఁ డేపాటిసుఖియో యోజింతము.

మ. "వరసంతోష నిరంతర ప్రముదితు

లర్థింప నెవ్వారు ని

ర్భరముల్వారికి మోదముల్, కనక లు

బ్ధస్వాంతులౌవారికి

న్విరతిం బొందదు తృష్ణ, యెవ్వనికిఁ గా

వింపంబడె స్వప్నమే

స్థిరసంపన్నిధి మేరువాత్మ ధృత ల

క్ష్మీకంబు, నా కిష్టమే?"

దైవికముగ నదృచ్ఛాలాభ సంతుష్టులైనవారి కానంద మెట్లును గొఱవడదు. లుబ్ధునికి మేరువంత యుండినను తృష్ణ

తగ్గదు. నిత్యసంతోషి కైశ్వర్యమునం దపేక్ష కలుగదు. లోభి కెంతయుండినను జాలదు. ఆస మఱి మఱి వృద్ధిచేసి నిరంతర పరివేదనం బొరయించు నైశ్వర్యమునందు సుఖము కానరాదు. మఱి యెవ్వరి తృప్తికై యీ సంపదను గన కాద్రిని బ్రహ్మ సృజించెనో!

శ్లో. అకించనస్యదాంతస్య శాంతస్య సమచేతసః
సదా సంతుష్ట మనస స్సర్వాస్సుఖ మయాదిశః॥

శుద్ధదరిద్రుండును, శాంతియైదాంతియై సర్వభూత సమచేతస్కుండై ప్రాప్తఫలముతో సంతుష్టుం డయ్యేనేని వానికి సర్వదిశలును సుఖమయములై యుండును.



# 10. కోరికలు

కోరికలేని ప్రాణి లేదు. ప్రతిప్రాణికి నాత్మరక్షణేచ్ఛ, ఆనందేచ్ఛ, సంతానేచ్ఛ, యను త్రివిధేచ్ఛ లుండును. స్వప్రయోజనమునకై పరప్రయోజనము మాపుమాపుట మహాపాతకము. ఈ కోరికలను సక్రమముగ నుంచుకొన్న యెడఁ బరప్రయోజన విధ్వంసనమున కవకాశముగలుగదు. ఆ కోరిక లతిక్రమించినపుడే యన్ని చెడుగులు సంభవించును. కానఁ బ్రాణరక్షణమున కెంతమాత్ర మావశ్యకమో యంతకే

కోరిక జనించెనేని సర్వప్రాణులు తన్నుఁ బ్రేమించును. ఉన్న దానితోఁ దృప్తిఁజెందక పొరుగింటివాని కొంచెపు టాస్తికై యాసించి యతఁడీయకపోవుటచేఁ దప్పువ్యాజ్యము లతనిపైఁ గల్పించి న్యాయస్థానములకీడ్చి న్యాయవాదులవాత నతఁడు తన కున్న యాస్తిని సైతము కరఁగించి పోసి నెత్తిపైఁ జేతు లుంచుకొని యేడ్చువా రెందఱు మనవారిలో లేరు!!

క. వ్యాప్తింబొందక వగవక
ప్రాప్తంబై నదియ తనకుఁ బదివే లనుచున్
దృప్తిం జెందని మనుజుఁడు
సప్తద్వీపములనైనఁ జక్కంబడునే?

విత్తపుత్త్ర కళత్త్రంబులయందలి కోరిక నీషణాత్రయ మందురు. ఇదియు నతిక్రమమైనచో విపరీతఫలము నొసంగును. కాఁబట్టి యీ చెడు కోర్కెలకన్నింటికి మూలకారణ మేదియో దానిఁ గనుఁగొని చక్కఁబఱచుకొనవలయును.

వాంఛించునది మనస్సు, అది బుద్ధికి లోఁబడియుండ వలయును. మనస్సు బుద్ధికి లోఁబడక యతిక్రమించి వర్తించి నప్పుడే విపర్యస్తఫలము చేకూరును. కాన మనస్సును బుద్ధి వశముచేసి బుద్ధిని నిర్మలముగ నుంచుకొనవలయును. బుద్ధి నిర్మలముగ నుండుటకు సత్సహవాసము కావలయును.

చ. వలసినయప్పుడే యవయ
వంబుల వైటికి పీడు చిప్పము

గలుగనివేళ ముడ్చుకొను
కచ్ఛపముం బలె నింద్రియంబులన్
దలచినయంత పీకుచుఁ బ
దంపడి లోఁగొని వాని తృప్తికై
చలితుఁడుగాకయుండు గుణ
శాలియె ధన్యుఁడు భూతలంబునన్.

పురుషార్థములు నాలుగు. అవి ధర్మార్థకామమోక్షములు. మానవజన్మ మెత్తిన యొక్కొక్కఁడును గోరఁదగినవికానఁ బురుషార్థము లనఁబడును. ధర్మమార్గమునఁ బ్రవర్తింపనివానిని మానవులలో గణింపరాదు. అర్థము లేకున్న నేపనియు సాగదు. కోరికలేని ప్రాణియే లేదు. పుట్టిన ప్రాణి గిట్టుట నిక్కమముగాన, జన్మించుటేల? చచ్చుటేల? చచ్చి యెచ్చటకుఁ బోవుదుము? మరల నెట్లు జనింతుము? జనించి చేయ వలసినదేది? ఏల యిట్లు పుట్టుట చచ్చుట? వీని కంతము లేదా? ఈ జనన మరణ ప్రవాహామునుండి తప్పించుకొని గట్టెక్కు టెట్లు? అని విచారణముచేసి పడయు ఫలమే మోక్షము. ఈ నాలుగు లేనిచో జన్మంబు పౌరుషవంతంబు గానేరదు.

ఉ. ధర్మమనంగ న్యాయమగుఁ
దద్గుణముం దగఁబూని, కూర్చుచున్

ధర్మయుతార్థ సంతతిని,
ధర్మము నర్థముయొక్క ముఖ్యమా
మర్మమెఱుంగు కామమును,
మానుగ మూఁడులభించు నంతటన్
నిర్మలబుద్ధి మోక్షము గ
ణింపఁ దలంచెడువాఁడు ధన్యుఁడౌ.

ఎట్టివాఁడైనను సత్సహవాసముచేతను, సత్కర్మాచరణము వలనను దనకుఁగల కోరికలను నెఱవేర్చుకొనవచ్చును. దుర్వాంఛలను వదల్చుకొనవచ్చును.

విధాతృపుత్రుఁడగు స్వాయంభువునకుఁ బ్రియవ్రతుఁడు, ఉత్తానపాదుఁ డను నిరువురు కుమారు లుండిరి. అందుత్తానపాదునకు సునీతి సురుచి యను నిరువురు సతులు. సునీతికి ధ్రువుఁ డని సురుచికి నుత్తముఁ డని కొడుకులు వొడమిరి. ఉత్తానపాదుఁడు సురుచియం దత్యంతానురాగుఁడై సునీతి ననాదరించుచుండెను.

ఒకనాఁడు ధ్రువోత్తములు వేడుకఁ గ్రీడించుచుండిరి. ఉత్తానపాదుఁడు సురుచితో నేవియో సల్లాపము లాడుచుండెను. ఉత్తముఁడు కడుఁబ్రేముడి నాపుడమి యొడయనితొడపై నెక్కె. బాలకుల కనుకరణగుణము మెండుగదా! ధ్రువుండును వేఱొక యూరువుపైఁ గూరుచుండఁగోరి భూరమణుఁ జేరఁబోవ సపత్నీమత్సరమున సురుచి యాయురుగుణమణిని

జ్యేష్ఠపుత్రుని దండ్రిచెంతఁ జేరనీక మెడఁబట్టి యావలికి నెట్టి వైచి "ఓరి దౌర్భాగ్యుఁడా! నీవంతకుఁ దగుదువే?

తే. గీ. తండ్రితోడ నెక్క వేడుక ♦ దగిలెనేని
పూని నాగర్భమున నాఁడు ♦ పుట్ట కన్య
గర్భమునఁ బుట్టి కోరినఁ ♦ గలదెనేఁడు
జనకుతోడ నెక్క భాగ్యంబు ♦ సవతికొడుక!"

అని గద్దించి "పొమ్ము. ఇప్పుడైన గొప్ప తపస్సుచేసి హరిం బ్రసన్నుంజేసికొని నాకడుపునఁ బుట్టునట్టులు వరంబు నర్థింపుము. వేఱురీతుల జనకు నంకతలంబునఁ బొంకంబుగఁ గూరుచుండు సదృష్టంబు నీకదృష్టంబ" యని యసహ్య వచనంబు లాడిన నప్పలుకులు ములుకులై బాలకుని డెందంబు గాఁడికాఱియపెట్ట రోదనంబుసేయుచు నిట్టూర్పులుపుచ్చుచుఁ దల్లి పాలికింజని యవ్వతోఁ దనకు నివ్వటిల్లిన యవమానంబుఁ జెప్పఁజాలక వెక్కుచు నిలువంబడ, జనని తనయుఁ దనయొడి నిడికొని పుత్త్ర దుఃఖకారణం బంతఃపుర కాంతలు సెప్ప విని బాష్పాకులలోచనయై దావపావక శిఖలచేఁ గాంతి గందిన మాధవీలతికవోలెనై, సవతియాడిన పోటుమాటలకు, నాపై యీర్ష్యావచనంబులకు, భర్త యంగీకారమునకు మనం బెఱియఁ దరుకోటరవహ్నిచే దరికొను తరువు తెఱఁగునఁ గుమిలి కుమిలి పుత్త్రునోదార్చుచు "నాయనా! దుఃఖింపకుము. పురాకృత పాపఫలం బేరికైన ననుభవింపక తీఱదు.

నీసవతితల్లి వలన నీతండ్రిచే నేను దారగాఁ గాక దాసిగాఁ జూడఁబడుచుంటి. నీపినతల్లి యనినటు లార్తశరణ్యుఁడే నీకు శరణ్యుఁడు. అతనికంటె నీదుఃఖం బపనయించువాఁ డన్యుండు లేఁడు. ఆతని దయ వడయు" మని తల్లి నుడివిన పరమార్థ ప్రాప్తిహేతుకంబులైన నుడువులాలించి తన్నుదా నియమించి కొని యచలమనస్కుండై పురంబువదలి యరణ్యమార్గమున నేగె. ఏతద్వృత్తాంతంబు తన దివ్యచిత్తంబున నెఱింగి ధ్రువుని దుఃఖశరధి తరణికరణి భక్తిబోధ విశారదుండగు నారదుం డచ్చటికరుదెంచి యతని చికీర్షితంబు దెలిసి తన కరతలంబున బాలకు శిరంబు కరంబునిమిరి యిట్లనియె.

నార:—కుమారా! బాలకుఁడ వొంటరివై యెందేగెదవు?

ధ్రువు:—సపత్నీ మాతృవాగిషుక్షతంబగు మనంబు భగవద్ధ్యాన యోగరసాయనంబున మాపికొనుటకు.

నార:—క్రీడాసక్తమనంబునఁ దిరుగు నీకాలమున నీకు మానావమానంబు లెక్కడివి? రమ్ము నావెంట. నీతల్లి దండ్రుల మందలించి నిన్నట విడిపించెద.

ధ్రువు:—మున్నిడిన యడుగు వెనుక కిడుట క్షత్రియ బాలకుండ నగు నాకుఁ బాడిగాదు.

నార:—వివేకులుసైతము సంప్రాప్త సుఖదుఃఖంబుల దైవేచ్ఛగాఁ దలంచి నిశ్చలచిత్తులై యనుభవింతురు. ఐదేండ్ల కుఱ్ఱవు! నీకేల యింత పట్టుదల?

ధ్రువు:—పరభయంకరంబగు క్షాత్రధర్మంబు నొందిన యవినీతుండ నేను సురుచి దురుక్తబాణవినిర్భిన్నహృదయుండ నగుట మదీయచిత్తంబున శాంతినిలువదు. త్రిభువనోత్కృష్టంబున నన్యాధిష్ఠితంబు నగు పదంబుంబొంద నిచ్ఛగింతు. దయగలదేని సాధుమార్గం బెఱింగింపుము.

నార:—వత్సా! తపంబు దుస్సహంబు. భగవంతుఁడు దుస్సాధ్యుండు. యోగీంద్రులు పెక్కుజన్మంబుల నిస్సంగులై యోగసమాధి నిష్ఠలఁజేసియైన జలజనాభుఁ దెలియలేకున్న వారు. నీనిష్ఫలోద్యోగముమాని నావెంటరమ్ము. నీజనకుని యొద్దికిఁ బోదము.

ధ్రువు:—మహాత్మా! భగవంతుండగు నజుని యూరువున జనించి వీణావాదనకుశలుండవై శ్రీహరిని మెప్పించి జగద్ధితార్థంబు త్రిలోకంబుల వర్తింతువు. మనస్కరింతువేని నీకసాధ్యంబులేదు. బాలుని, దీనుని, గరుణించి తప మన నేమి? తపోమార్గ మెద్ది? యెఱిఁగింపవే!

నార:—వత్సా! నీ దృఢచిత్తంబునకు సంతసించితి. తపోమార్గం బెఱిఁగింతు వినుము. పంచమలంబులఁ బోఁదోలి యీషణత్రయంబుల నరికట్టి చాంచల్య దోషంబుల హరించి స్థిరచిత్తంబున లోలో భగవంతుం గూర్చి యాలోచించుటయే తపంబునాఁబడు. ఆలోచనంబునకుఁ జంచల చిత్తంబు ప్రత్యర్థి గావున స్థిరచిత్త సంపాదనంబునకై ప్రాణా

యామాది నియమంబులఁ బాటింపవలయు. నీవు యమునా తటంబున నతి పుణ్యంబును గణ్యంబును బుణ్యావరభవనంబును నగు మధువనంబున కరిగి యుచితప్రదేశంబునఁ గుశాజినంబుల సుఖాసనాసీనుండవై భక్తవత్సలు భజింపుము. సిద్ధిఁబొందెదవు.

చ. మనమున నింద్రియంబులను
మానుగఁ గట్టి, మనంబుఁ జిత్తమున
దునఁ దగనుంచి, చిత్తమును
దోడసబుద్ధిని జొన్పి, బుద్ధి నా
త్మను గనుఁగొంట్కై నిలిపి,
తన్ను సమస్తమునన్, సమస్తమున్
గని తనయందు, సంతసము
గాంచెడు నాతఁడు ధన్యుఁడౌ మహిన్"

అని, ద్వాదశాక్షరీ మంత్ర ముపదేశించి ధ్రువుని వీడ్కొలిపి నారదుం డుత్తానపాదునికడ కేగి పుత్రప్రేమచేఁ బశ్చాత్తప్తుఁడైన యన్నరపాలుని,

క. "నీ కీర్తియు జగములయం
దాకల్పము నొందఁజేయు నీ నంచితగుణ ర
త్నాకరుఁ డిట కేతెంచును
శోకింపకు మతనిగూర్చి యో సుభగచరిత్రా!"

అని ధైర్యవాక్కుల ననునయించి యథేచ్ఛం జనియె.

నారదానుమతంబున ధ్రువుండు మధువనంబుఁ జొచ్చి యమునానదీ జలంబులఁ గృతస్నానుండై యుచితప్రదేశంబునఁ గుశాస్తరణంబున నియతుండును సమాహితచిత్తుండునై త్రిరాత్ర త్రిరాత్రంబుల కొకమాఱు కపిత్థ బదరీఫల పారణుండగుచు దేహస్థితి ననుసరించి యొక్క మాసంబు హరిం బూజించి, యంతనుండి యాఱేసి దినంబుల కొక పరికృత జీర్ణ తృణ పర్ణాహారుండగుచు, రెండవమాసంబున విష్ణుసమారాధనంబుసేసి, యంతనుండి నవరాత్రంబుల కొకమాఱుదక భక్షణంబు సేయుచు, మూఁడవమాసంబున మాధవునర్చించి, యాపై ద్వాదశదినంబుల కొకమాఱు వాయుభక్షుండగుచు, జితశ్వాసుండై నాలవమాసంబునఁ బుండరీకాక్షుని భజియించి, యంతనుండి మనంబున నలయక నిరుచ్ఛ్వాసుండై యేకపదంబున నిలిచి పరమాత్మం జింతించుచు నచేతనంబైన స్థాణువుంబోలె నైదవమాసంబు జరపె. ఆఱవనెలయందు నిరాలంబుండై యూర్ధ్వముఖుండై పురుషోత్తముఁ జిత్తవీథిం జింతించుచుండ, నయ్యుగ్రతపోనలతప్తులై నిలింపులు గుంపులు గూడి శ్రీపతిం గూర్చి మొఱలిడిరి. మందరధరుండు బృందారకుల నోడకుఁడని ధైర్యవాక్కులాడి గరుడవాహనారూఢుండై ధ్రువునకు సాక్షాత్కరించె.

లోనఁ గానవచ్చుచున్న దివ్యస్వరూపంబు బయలను గానిపించుటం జేసి తపంబుఁ జాలించి పులకాంచితశరీరుండై

యానందాశ్రుధారా సంకలితలోచనుండై ముకుళితకరకమలుండై హరిని మృదుమధురవాక్కుల నుతింప నుద్దేశించి యనభ్యస్తవిద్యుండగుటం జేసి స్తుతిక్రియాకరణ సమర్థుండుగాక యూరకున్న బాలకు మనోభీష్టంబు విష్టరశ్రవుం డెఱింగి వేదమయంబగు తన శంఖంబు నగు తన మస్తకంబున నునిచె. మస్తకన్యస్తశంఖుండై ధ్రువుండు సర్వవిద్యాపారంగతుండై వేదవిదుని వివిధంబుల ముద్దుపలుకుల వినుతింపఁ, బెంపారు కరుణను భగవంతుండు ధ్రువునిం గాంచి "వత్సా! నీ దృఢచిత్తంబునకు నీ వృత్తాంతంబునకుఁ గరం బానందించితి. వరంబు లడుగు—మిచ్చెద" ననుఁడు సోత్సాసపాది మోదంబంది యిట్టు లనియె.

తే. గీ. తండ్రి తొడ యెక్కఁ గోరి చేఁ దపమొనర్చి
దేవదుర్లభు నిన్నుఁ బొందితిని; గాజు
జాతికై వెదకఁగ దివ్య రత్నమబ్బె!
స్వామి! నేఁ గృతార్థుఁడ నైతి వరమిఁ కేల?

అనవుడు నారాయణుండు చిఱునగవుమొగమునఁ జెంగలింప నబ్బాలకునుఁగాంచి "కుమారకా! నీ యుల్లంబు నాకుఁ దెల్లంబ. నీ వడుగనక్కఱలేకయే యే నొసఁగెద. నీ వింటికిఁ బొమ్ము. నీ పినతల్లియుఁ దండ్రియు నిన్ను గారవింతురు. భవదీయ జనకుండు వనవాసగతుండైనపిదప నిరువదియాఱువేలేండ్లు తద్రాజ్యంబు పూజ్యంబుగాఁ బాలించి జితేంద్రియుం

డవై తదుపరి గ్రహ నక్షత్ర తారా గణ జ్యోతిశ్చక్రంబును నక్షత్రరూపంబులైన ధర్మాగ్ని కశ్యప శక్రులును సప్తర్షులును దారకాసమేతులై ప్రదక్షిణంచుచుండు నట్టిదియును దురాపంబును సనన్యాధిష్ఠితంబును లోకత్రయ ప్రళయకాలంబునందును నశ్వరంబుగాక ప్రకాశమానంబైన ధ్రువక్షితి యను పదంబుం బ్రాపింతువు" అని యతని యభిలషితార్థంబు లర్థి నిచ్చి పరమపురుషుండు తిరోహితుండయ్యె.

ధ్రువుం డటనుండి మరలి స్వపురంబుఁజేరి జననీ జనకులకుఁ బ్రీతిపాత్రుండై పెక్కేండ్లు భూలోకసుఖంబు లనుభవించి పిదపఁ బునరావృత్తిరహితంబును సప్తర్షి మండలోన్నతమునగు ధ్రువపదం బధిష్ఠించెను.

ధ్రువునకు మొదటనుండిన కోరిక లెట్టివి? అవి నారదోపదేశానంతరమునను, భగవత్సన్నిధానమునను నెట్లు పరిణతిం జెందినవో గమనించితిరా?



# 11. ఆపత్సహనము



పగలు సగము. రేయి సగము. వెన్నెల కొన్నాళ్లు. చీఁకటి కొన్నాళ్లు. కష్టము కొంత. సుఖము కొంత. కష్టములే యనుభవించినవారు లేరు. సుఖములే యనుభవించిన

వారును లేరు. కాలచక్రమునకుఁ గష్టసుఖము లను రెండంచు లుండును. కావునఁ బ్రతి ప్రాణియుఁ గష్టసుఖముల రెంటిని గొద్దిగనో గొప్పఁగనో యనుభవించియే తీఱవలయును. అయినను మన యనుభవమునఁ గష్టములురా నారంభించినచో నొకటివెనుక నొకటిగఁ గష్టములే వచ్చుచుండును. సుఖము లురా మొదలిడినచో వరుసగ సుఖములే ప్రాప్తించుచుండును. ప్రతి జీవియుఁ బూర్వజన్మకృత పుణ్య పాపంబుల ననుసరించి సుఖ దుఃఖంబుల ననుభవించుచుండును. రానున్నవి రాక మానవను సామెత యొండు గలదు.

మనుజుఁ డొనరించు సర్వకర్మము లందును భయము గలుగుచునే యుండును. కష్టములకుభీతిఁజెందువానికంటె భీరువు మఱొకఁ డుండఁడు. కష్టమునకు దుఃఖించుటయు సుఖమున కుప్పొంగుటయు నల్పుని లక్షణములు. సముద్రము నాచమ నంబు సేసి నిర్నీరము గావించిన మహిమాసంపన్నుఁడును, వింధ్యాద్రిగర్వదమనుండును, వాతాపి పాలిప్రేతనాథుండును, ననేక భాషాప్రపంచ విరించియు నగు నగస్త్యున కొక దుర్భర రోగముండెను. ఆ వ్యాధిబాధచే నతఁడు నిత్యానుష్ఠానముల నైతము నెఱవేర్చుకొనన శక్తుఁడగువాఁడు. అందుచే నతఁడు తన యోగదండము నెదుటనిలిపి తన రోగమును దానిలోనికిఁ బ్రవేశింపఁజేయును. అప్పుడది యా బాధను భరింపలేక వడఁకుచుండును. తన యనుష్ఠానమును, యోగసమాధియు

ముగియుడుఁ దనలోనికి రప్పించుకొనుచుండు. ఇట్టి చిత్రము నతని శిష్యులు వీక్షించి యొకనాఁడు గురునితో "మహానుభావా! సర్వశక్తియుక్తులరగు తాముతమ రోగబాధను యోగదండమునకుఁ బోనిచ్చువారు పిదప నేల రప్పించుకొనవలయును? రోగముల వలదనువా రున్నారు గాని తమవలె రోగముల నివృత్తిచేయ సమర్థతగలిగియు రమ్మనువా రెందును గానరారు. ఇం దేదేని గొప్పకారణము లేకపోదు. వినవర్తాల మేని యానతిం" డనుడు నగస్త్యుం డిట్లనియె, "శిష్యులార! తొలిబాముననే నొనరుచు దుష్కృత మీ రోగరీతిఁ బరిణమించి నన్ను వేధించుచున్నది. ఎంతవఱకు వేధింపఁదగునో యంతదనుక నది వదలదు. పిదప నిలుమన్నను నిలువదు. అనుభవింపవలసినదాని నిప్పుడు బలసంపాదనంబునఁ దొలంగఁద్రోసికొంటిమేని యావల బలహీనులమగు సమయము నది వేచియుండి మనల బాధింపక విడువదు. శక్తిమంతులమై యున్న యప్పుడ దేనినే ననుభవింపఁగలము. కావుననే మరల రప్పించుకొందు" నని ప్రత్యుత్తరమిచ్చెను.

తొల్లి భువనవిఖ్యాతులైన షట్చక్రవర్తులలో నాలవవాఁడగు పురూరవుఁడు రాజ్యముచేయుకాలమున నొకనాఁడు శనైశ్చరుఁ డతని ధర్మయుక్తికిని బ్రజానురక్తికిని బరమేశ్వరభక్తికిని మెచ్చి ప్రత్యక్షమై "రాజేంద్రా! నీయోగ్యతకు మెచ్చి దర్శనమిచ్చిన శనైశ్చరుండను నేను. ప్రపంచమునఁ

బుట్టిన ప్రాణినెల్లఁ బట్టి విడుచుట మత్కర్తవ్యము. భోగానుభవయోగ్యంబగు నికాలంబున నిన్నుఁబట్టుదునా? ముసలివాఁడవై మూలముడిగినప్పుడు పట్టుదునా?" యని యడిగెను.

పురూరవుండు కేలుదోయి ఫాలమునఁగీలించి "సూర్యపుత్రా! తరుణుఁడై నప్పుడ పురుషునకుఁ గష్టసుఖములయందేదేని భరింపఁ దరుణము. తారుణ్యముడిఁగినవెనుక నారెంటిని భరింపఁ బురుషుఁ డసమర్థుఁ డగుచున్నాఁడు కాన నిప్పుడే నన్నొక యోరగంటఁ జూచి వదలవే!" యని ప్రార్థించె. వల్లెయని దినకరపుత్రుండు దిచ్చుమొగంబయ్యె.

అనంతరము శని, యొకప్రభువున కింకొకవిభుఁడు వ్రాసినట్టులు పురూరవునిపై ననేక నిందలుమోఁపి యందతేకమై పురూరవుని ముట్టడించి సార్వభౌమ పదభ్రష్టునిఁ జేయవలసినదని సామయికమును సాంకేతికమునుగుర్తించి లేఖలువ్రాసెను. ఆయుత్తరములఁ జదివికొనిన పృథివీపతులెల్లరు శనైశ్చర ప్రేరిత మనస్కులై చతురంగబలములతోఁ గదలి సార్వభౌముని ముఖ్యపట్టనమగు ప్రతిష్ఠానపురమును ముట్టడించిరి.

పురూరవుఁ డా వృత్తాంతము వేగులవలన విని నాఁటి కొలువున భృత్యామాత్యవర్గంబులకు నాఱునెలల వేతనము లొసఁగి యా రాత్రి శయనగృహమున కేతెంచి స్వకీయ విజయ ప్రభ యనఁదగు జయప్రభం గాంచి "నాతీశిరోమణీ! నేఁ డేఁబదియాఱు దేశముల సామంతులు నాపై నొక్క

పెట్టునఁగ త్తిగట్టి యెత్తివచ్చి పట్టణమునాక్రమించియున్నారు. నాకు లోఁబడినవారెల్ల నన్నెదుర్చుటకుఁ గారణము నా గ్రహచారబలము. వారితో జేపు నేను యుద్ధ మొనరింతు నేని దైవాధీనములైన జయాపజయములలో నదృష్టహీనుండ నగు నా కపజయ ముబ్బుట నిశ్చయము. దానికై యంత వగవఁగాని నా యొక్క ప్రాణమునకై మన సైనికు లెందఱు ప్రాణంబుల విడుతురు? ఏ పాప మెఱుఁగని నిరపరాధుల నెదుటివారల నెందఱ ప్రమాదింపవలసియుండును? ఇంత ఘోరకృత్యంబునకు నా మనసొప్పకున్నది. మన మిరువు రము మన యిరువురు కొమరుల నెత్తికొని రహస్యమార్గ మున నిర్గమించి దుర్గమారణ్యంబుల కేగుదము. ఇయ్యది యనానిశ్చితాభిప్రాయంబు. ఇందులకు నీ వేమందు" వని యడిగెను. పతివ్రతాతిలకమగు నాయమ, "నాథా! తమ యుద్దేశమే నాకును బరమసమ్మతము. మీ వాక్యముల కన్యథా గలదా?" యనియె. అంత నా సతీపతు లిరువురు పుత్త్రుల నెత్తికొని రహస్యమార్గంబున బయలువెడలి యడవులఁ జేరిరి.

ఆఁకలి దప్పుల కోర్వలేక చిన్నకుమారుఁడు శోషి ల్లుటఁ జూచి యా రాజదంపతులు కొంత చింతించి పదపడి ధైర్య మవలంబించి కొంద ఱొడ్డెవాం డ్రొక తటాకమును ద్రవ్వుచోటి కేగిరి. ఆ యొడ్డెలు వీరిం గాంచి యనుతాశ యొంది పురహారవుని దమకు విలేఖకునిగా నిలుపుకొనిరి.

ఆవలఁ గొన్నాళ్లకుఁ దటాక నిర్మాతయగు ధనికుఁడు కర్ణాకర్ణిగఁ బురూరవు నిల్లాలతి రూపవతియనివిని యామెపై భ్రమగొని యానాఁటి సాయంతనమునఁ బనివాఁడ్రు యిల్లాండ్రనే వచ్చి నాఁటికూలిఁ దీసికొనిపోవునట్లు తెలియఁజేసెను. ఎడ్డాలగు నొడ్డచేడెలు "నేముందు నేనుముం" దని త్రోసుకొలాడుకొనుచు వచ్చి తమకు రావలసిన రొక్కముం గొని పోయిరి. వెనుకఁజిక్కిన జయప్రభ యొంటరిగ రావలసి వచ్చెను. ధనికుఁడగు ధనదాసుఁడు కొన్నిసంగతులు సేవకుని చెవినూది లోనికేగెను. ఆవచ్చిన జయప్రభనుగాంచి ద్వారపాలకుఁడు "అమ్మా! యజమాను లవసరకార్యముపైఁ బోవలసి తమకుఁ జేరవలసిన పైకమును లోపలనుంచి పోయిరి. మీరు నిరాపేక్షముగ లోనికిఁబోయి తీసికొనవచ్చు" నని పలికెను. ఆయమ కనేక సంశయములు తోఁచినందున ముందు వెనుక లరయుచు దైవమే శరణమ్మని నమ్మి లోనికేగెను. వెంటనే తన వెనుకటి తలుపు దబాలున మూయఁబడెను. ఆమె తిరిగిచూచెను. సందేహము ప్రబలెను. ఇంతలోఁ దనయెదుట ధనదాసుఁడు పొడకట్టెను. తటాలున నాజయప్రభ తన యెదుటఁ గులదైవముంబోలె గోచరించిన యొక పాడుపెట్టె లోఁ బ్రవేశించి పైపలకమూసి,

తే. గీ. ఎప్పుడు నా నాథున కవజ్ఞ [illegible] నెన్ననేని
నేమహా పతివ్రత యాట్ల [illegible] నిక్కమేని

నాథునకుఁ గాక యితర మానవుల కెన్ని
విధముల నభేద్యముగుత మీ పేటియింక.

అని శపథవాక్యము వలికెను. పతివ్రత పలుకులకు మాఱుగలదా? బీగము లేకయే యాపేటిక బిఱ్ఱబిగిసికొనెను. ధనదాసుఁ డెన్నోవిధముల నాపేటికఁ దీయఁ బ్రయత్నించెను. ఫలము లేకపోయెను. గొడ్డండ్లతోఁ గొట్టించెను. ప్రయోజన మగపడదయ్యె. నిప్పుపెట్టి కాల్పించియు నిరుత్సాహియయ్యెను. భీతి మెండయ్యెను. వెంటనే యాపెట్టెను దీసికొని సముద్రతీరముచేరి యాపేటికను బోటితో నీటఁ గలుపనెంచుడు 'నోయీ! ఇఁక నేడుసంవత్సరము లీపెట్టెను గాపాడితి వేని సుఖము పొందఁగలవు' అని యొక వాకు వినవచ్చె. అంత నా ధనికుఁడు తత్ప్రాంత పట్టనమున నొక భవనంబు గొని యందాయేడేండ్లు గడపనెంచెను.

"ప్రొద్దు గ్రుంకెను. భూమి తమోవృత మయ్యెను. నేఁటిభృతిఁగొని రానేగిన మెలనాగ యేలయింకనురాదయ్యె" నని చింతాకులచిత్తుండై పురూరవుఁడు వీథులవెదకుచుఁ గనఁబడిన వారినెల్ల నడుగసాగెను. చేడె జాడ దెలియదయ్యె. "దైవమా! అనుభవింపవలసిన దింకను గొఱఁతయున్నదా?" యని యింటికి మరలి తల్లికై వాపోవు తనయులఁగాంచి పరితపించుచు నాయూర నిలువ మనసు నిలువరింపనేరక తెంపున నిరుపుర నిరుభుజములనెక్కించుకొని యెటకోబయలుదేఱెను.

"మబ్బులేదు. నేలచెమ్మయు లేదు. ఈ ప్రవాహమెట్లువచ్చె? దీనిదాటు టెట్లు? ఔ! మ్మంబటి నీరుపాఱుచున్నదే? కానిమ్మిట్లో నర్చెద"నని నృపతి కృతనిశ్చయుఁడై యొకపుత్రు నీవలిగట్టున నొకచెట్టునకుఁగట్టి, యొకని నెత్తికొని యాయకారణప్రవాహం బునుదాఁటి యావలిగట్టుచేరి యటనొకతరువునకుఁ గొమరుని బంధించి మరలి యీవలిగట్టునకు రా నీటదిగెను. నట్టేటికి వచ్చునప్పటి కదాటునఁ బైవెల్లువ వెల్లివిరిసి యానరపతిని గాలూఁదనీక యొక యల్పజీవుని మ్రింగవచ్చు పెనుభూతంబుం బోలె నురుఁగులు గ్రక్కుచుఁ బెనుబొబ్బలిడుచు వచ్చి దన పొట్టఁ బెట్టుకొనెను. మఱునాఁ డరుణోదయంబున దధివిక్ర యార్థ మొక గోపాంగన యాతెరువునఁ బోవుచు నిరుదరులఁ దరుస్కంధములకుఁగట్టఁబడి రోదించి రోదించి సొమ్మగొన్న బాలురఁ బ్రేమ దైవార నెత్తికొని యింటికిఁ గొంపోయి పెంచుచుండె.

అనుభవింపవలసిన దింకను గొంతయుండఁ జావెవ్వరికిని రాదు. ప్రవాహగతుండైన భూపతి మిగుల నలయిక చెంది యొకగట్టుచేరి యొకగొల్లని గొఱియలఁ గాచుచు నిశ్చింతుఁడై యుండె. అంత నొకనా డర్ధరాత్రమ్మునఁ గొందఱుచోరులు సమీపస్థ పట్టణరాజ కోశాగారమునఁ బ్రవేశించి ధనంబు కొల్లగొని బయలుదేఱిన తరుణమున రక్షకభటు లరసి తఱుమ నాదొంగలు మోసి తెచ్చుచుండిన రత్నపేటిక నొకదానిని గొఱ్ఱెలమందకడ నిద్రించుచుండిన పురూరవుని తలకడఁ బడ

వైచి పోయిరి. వెనుకవచ్చిన భటులాపెట్టెయుఁగని "తప్పించు కొను వెరవులేక దిక్కరియై దొంగ యిట్టి దొంగనిద్దుర పోవు చున్నాఁడని భావించి యుతనిఁ బట్టి కట్టి తీసికొనిపోయిరి.

మఱునాఁడు విచారణ జరిగెను. పురూరవుఁడు మౌనియై యుండెను. అతనిపై నేరము మోఁపఁబడెను. కరపద ఖండనశిక్ష విధింపఁబడెను. తలవరులు పురూరవు నారణ్యము నకుఁ గొంపోయి కాలుసేతులు ఖండించి వైచిరి.

ఖండిత కరచరణుం డగు చంద్రవంశావతంసుండు ధీర మతి గావునఁ దన మనంబుల,

ఉ. కానిట నేను గన్నులును
గాళ్లుఁ గరంబులుఁ జర్మ మస్థులుం
గాను సమస్తకార్యమునఁ
గన్నను, నంటియు నంటకుండు, ను
న్నానను నాత్మఁ గన్గొని మ
నంబున మిక్కిలి సంతసించు సు
జ్ఞానియె లోకమాన్యుఁడు గు
ణాఢ్యుఁడు ధన్యుఁడు భూతలంబునన్.

చ. ఎరవలి గొన్నఁ బెండ్లి మరు
లేగినపిమ్మట సొత్తుకాని కా
భరణము లిచ్చి సంతసిలు
భాతి సువర్ణపదార్థ వాహనాం

బరగృహ పుత్త్రమిత్రతతి
 ప్రాణము నీఁగెడువేళ సొంతకా
పరిగొనెనంచు సంతసిలు
 ప్రాణియె ధన్యుఁడు భూతలంబునన్ ...

అని భావించి స్థిరచిత్తుండై ప్రాణోత్క్రమణ సమయము నిరీక్షించుచుండె.

అంత నీరజాసనుపంపున శారదాదేవి యరుగుదెంచి యన్నరపతి కుపచర్య యొనర్చి బాధఁబోకార్చి పిలక్షుత్తుఁజేసి తలంచినపుడు దర్శన మిత్తునని తిరోహిత యయ్యె. పిదప వ్యాపారార్థియై దూరదేశముల కేగి యాదారినివచ్చిన వైశ్యుఁడొకరుఁ డాతనిఁగని జాలిగొని తన పల్లకియం దిడుకొని తన భవనమునకుఁ గొనిపోయె.

తదనంతర మొకనాఁడు పండువెన్నెలలో రాజసౌధముపై రాకుమారి విహరించుచుండి తాల గరఁగించు నొక శ్రావ్యగీతమును వినియెను. ఆమె యాభరణములలోని రత్నములు చెమ్మగిల్లెను. ఒడలు పరవశ మయ్యెను. కొంతవడికిఁ దెలివొంది చేటిం బిలిచి యామేటిగానమ్ము సేయు నీటుకాఁ డెవ్వఁడో పరికించి రమ్మనియె. ఆచాన గానము వినవచ్చు దెసకు విసవిస నడచి వాడలవారి విచారించి యచ్చటుఁజేరి కన్నులార నాగాయకునుఁగాంచి వీనులలరఁ గొంతసేపు విని మరలి రాజపుత్త్రిం జేరి యిట్లనియె. "అమ్మాయీ! ఆ గాయ

కుఁడు మొనమొన్న మనయంతిపురిం జౌర్యమొనర్చి కరచరణ ఖండనశిక్షం బొందినవాఁడు! అతని గానమునకు సమాన మీ జగానఁ గానము. పరులపలుకుల నమ్మక సేన కనివిని వచ్చితి. ఇంత నిజము”

మొండివానిపై ముగుదకు మోహ మంకురించెను. అతనినే వివాహ మాడవలయు నను దృఢసంకల్పంబును దల్లి కెఱిఁగించెను. తండ్రిచెవిం బడియెను. తండ్రికిఁ గోప మతిశ యించి స్వయంవరమని చాటించెను. అనేక రాజపుత్త్రులు విచ్చేసిరి. సభయలంకరింపఁబడెను. రాకుమారి కెట్టి రాకొమ రుఁడు నచ్చఁడయ్యెను. చేనున్న హారమును గిరగిరఁ ద్రిప్పి పై కెగరవేయుచు “నిది నాప్రియుని కంఠము నలంకరించుఁ గాక” యనియె. ఆపుష్పదామ దైవవశమున నెచ్చటనో యొకమూల వేడుకఁ జూడవచ్చిన సెట్టిపజ్జనుండు పుమూరవుని కంఠమునఁ బడెను. సభయెల్లఁ గలవరమందెను. రాకుమారి యుల్లంబు పల్లవింప మెల్లనఁబోయి పుమూరవునిచెంత నిలువం బడెను. అదిగని రాజునకుఁగుమార్తెపై నసూయమెండయ్యెను. ఆగ్రహమునఁ బరుషవచనము లాడెను. తత్క్షణమా గుణవర్య వర్యవైశ్యుని ధర్మగుప్తుని వలన నొక పల్యంకికముంబడసి యందుఁ దనభర్తం గూర్చుండఁ బెట్టికొని యడవులకు నడిచె.

పరిచర్యలయందేమఱక పతిహితానువర్తినియై యతని మోచికొని తిరుగుచు భయదాటవులఁ గొన్నినాళులాయమ్మత

మంబు గడపె. అనంతర మొకదిన మొక రామణీయకమైన సరోవరముంగాంచి యందిరువురు స్నానమాచరించిరి. అద్భుత, జనకంబుగ నతని కరచరణంబులు మొలిచె. అమృతమయియుం బ్రియపతివలన నతని పురూరవ సార్వభౌమునింగా నెఱింగి యమితానంద మందె. నారదోపదేశంబున బుద్ధిమంతుండై ధనదాసుండు పేటికను దెచ్చి పురూరవున కప్పగించి క్షమింపం బ్రార్థించె. పటిగట్టులం గట్టులలో వదలిపెట్టంబడిన బొట్టెలును నారదప్రబోధితులై జనకుని గలిసికొనిరి. సార్వభౌమత్వము పోయినతీరుననే మరలివచ్చె. పుత్త్రద్వయముతోం గళత్ర ద్వయముతోం బురూరవుం డమేయ సౌఖ్యముల ననుభవించుచుండె.

తే. గీ. క్షమయ జనులకాభరణంబు క్షమయ కీర్తి
క్షమయ ధర్మంబు, క్షమయ సజ్జనగుణంబు
క్షమయ యజ్ఞంబు, క్షమయు మోక్షంబు, క్షమయ
సకలదానంబు, క్షమయంద జగమునిలుచు



# 12. క్రూరకర్ముండు బాగుపడండు



మనుజుండొనరించు సర్వకార్యములు పుణ్యకార్యములవి పాపకార్యములని యిరుతెఱంగులు. తనకు సమ్మతములై

పరుల కసమ్మతములైనవియుఁ, బరహింసాజనకములైనవియుఁ బాపకార్యములనంబడు. సర్వజనసమ్మతములును, నిఖిలజనామోదదాయకములు నగునవి పుణ్యకార్యములునాఁబడు.

శ్లో. శ్రూయతాం ధర్మసర్వస్వం । యదుక్తం శాస్త్రకోటిభిః
పరోపకారఃపుణ్యాయ పాపాయ పరపీడనమ్.

శ్లో. అష్టాదశపురాణేషు వ్యాసస్య వచనద్వయమ్.
పరోపకారః పుణ్యాయ పాపాయ పరపీడనమ్.

సర్వశాస్త్రసారాంశ మిదియ. పరుల కుపకృతి యొనర్చుట పుణ్యముకొఱకు. పరులఁబీడించుట పాపముకొఱకు.

క. ఒరులే యవి యొనరించిన
నరవర! యప్రియము దన మనంబున కగుఁ దా
నొరులకు నవి సేయ కునికి
పరాయణము పరమధర్మ పథముల కెల్లన్.

తన దేహముం బోలినవే యెల్లర దేహములు. తనొకరు గిచ్చిన నోయుగలుగు టెఱిఁగి యొకరి గిచ్చుట భావ్యమా? త న్నితరుఁడు తూలనాడిన నెట్టులుండునో మన మొకరి నట్లిదముచేసిన నట్టులే యుండునని భావించి క్రూర కార్యములఁ ద్రికరణశుద్ధిగ మానవలయును.

పూర్వము మగధదేశమును బృహద్రథుఁడను రాజు నీతిమార్గప్రవర్తనుండై యేలుచుండెను. అతని కిరువురు భార్యలయ్యును బుత్త్రులు పుట్టకుండిరి. సుతులులేని విభవ

మేల యని నిర్వేదించి యతండు పత్నీద్వయ సమేతుండై కాననంబున కరిగి బాలసహకారసాలముక్రింద నుజ్జ్వల తేజుండై నిరంతర నిష్ఠతోఁ దపంబుఁ జలుపుచుండు చండకౌశికుండను మునిం గని నిరంతర కృతనియమ సపర్యా వరివస్యుండై భక్తితోఁ గొంతకాలము కొలుచుచుండెను. ఒకనాఁడు పవనవిఘూర్ణితమును శుకచంచూపాతవిలూనమును గానియొక చూతఫల మా యవనిజమునుండి యమ్ముని యుత్సంగమునఁ బడ నతఁ డది గ్రహించి బృహద్రథున కొసంగి యీ ఫలోపయోగంబున నీ కొక్క పుత్త్రుం డుద్భవిల్లునన, నాతండును గృతార్థుండ నయితినని క్రమ్మఱి నిజపురంబునకు వచ్చి యిద్దఱు భార్యలకు సమంబుగా విభాగించి యిచ్చిన దత్ఫలోపయోగంబున నయ్యిద్దఱు గర్భిణులైరి. అంతఁ బదియవ మాసంబున నొక రాత్రియందు వారలకు

క. ఒక్కొక కన్నును జెవియును
జెక్కును జను బొడ్డు మూఁపు చెలువగు చేయుం
బ్రక్కయు బిఱుదును గాలును
నక్కజముగ మనుజ శకల మై యుదయించెన్.

ఆ మానిసివ్రయ్యలం గని వారు ఖిన్నులై దాదుల చేతి కొసఁగి వీని నెవ్వ రెఱుఁగకుండ వెలుపలఁ బడవైచి రండన వారా వ్రయ్యలం గొనిపోయి రాజగృహ ద్వార తోరణ సమీప శృంగాటకమునొద్ద నొకచో వైచి పోయిరి.

అచ్చోఁ గాచియున్న జర యను రక్కసి యాహారాపేక్షనా శకలంబుల నెత్తికొని తన నిమ్మగునట్టులు కూడఁబెట్టె. తత్క్షణంబా తునుక లొక్కటియై రోదింపఁదొడంగె.

ఆ రోదనధ్వని విని యంతఃపురమువారెల్ల మేల్కొని పఱతెంచిరి. జరయును నవ స్త్రీరూపధారిణియై యబ్బాలకు నిజవృత్తాంతంబు దెలియఁజెప్పి బృహద్రథున కప్పగించె. అతండును గృతార్థకృతాలోచనుండై వజ్రఘనఘటిత శరీరుం డగు నక్కుమారునిం గాంచి యెత్తికొని జరం గారవించి జరచే సంధింపఁబడినవాఁడు గావున జరాసంధుండను పేరిడి యతి ప్రేమను బెంచె.

జరాసంధుండు దినప్రవర్ధమానుండయి యుక్తవయోధికుండు కాఁగాఁ దండ్రి యతనికిఁ బట్టంబుగట్టి సభార్యుండయి తపోవనమున కరిగె. తదనంతరంబా బార్హద్రథియ వక్రవిక్రమంబున ననేక రాజుల జయించి కప్పంబులఁగొని మహావిభవంబునఁ జొక్కుచు బ్రహ్మణ్యుండయ్యు బలవిభవగర్వితుండై ధారుణింగల రాజులం బెలుకుబడిఁ బట్టితెచ్చి చెఱఁబెట్టి యొక్కొక్కనిగా వధించి భైరవపూజ యొనర్చుచుండెను. ఈ క్రూర కృత్యమునకు రాజలోక మడలిపోయెను. అతనిపేరు విన్నంతఁ బ్రజలెల్ల గడగడ వడఁకుచుండిరి. అగ్నికి మట్టి తైలము తోడైనట్టు లీ ఘోరకార్యమున జరాసంధునకు శిశుపాలుఁడు, భగదత్తుఁడు, పౌండ్రకవాసుదేవుఁడు వానికి బాసటయై వర్తించిరి.

శ్రీరామ

# సుజ్ఞానబోధిని * ఐదవభాగము

## 1. దేవుఁ డెందున్నాఁడు?

ప్రపంచకర్త యగు దేవుఁ డొకఁ డున్నాఁడని మనకు నమ్మిక గలదు. అయినను అతఁ డెందున్నాఁడు? ఎట్లున్నాఁడు? అని కనుఁగొనవలయును. అతఁడు జ్ఞాననేత్రగోచరుఁడు. కాన నతనిఁ దెలియ జ్ఞానసంపాదన మత్యావశ్యకము.

తంజనగరాధీశ్వరుఁ డొకనాఁడు నిండుకొలువుననుండి విద్వాంసులం జూచి "మనకు దేవుఁ డెంతదూరముననున్నాఁ" డని ప్రశ్నించెను. పండితు లా ప్రశ్న కుత్తర మీయలేక యొకరిమొగ మొకరు చూచిరి. ఒకఁడు మఱొకనిఁ గన్నెగర వేసెను. అతఁ డింకొకని గిచ్చెను. ఆయన వేఱొకని వంకకుఁ దల ద్రిప్పెను. ఇంకొకఁడు తల నేలకు వ్రాల్చెను. మఱియొకఁ డాకసమును జూచుచుండెను. వేఱొకఁడు ముక్కుపై వ్రేలుంచుకొని యోజించువానివలె నటించెను. తుద కంద ఱేదియో వారివారికిఁ దోఁచినట్లు వదరిరి. రాజున కా మాటలు నచ్చలేదు. "భిన్నాభిప్రాయంబుల వదలి

యుండ తేకవాక్యులుగం" డనెను. వా రేకీభవించి కొంత సేపు తర్కించుకొని విసిగి రాజునొద్దనుండి తప్పించుకొను నుపాయ మాలోచించి యైకకంఠ్యముగనిట్లనిరి. "రాజేంద్రా! ఈ పురమున గాజులబేరము చేయుచుండు పరమభాగవతుఁ డగు పెద్దదాసు నడిగిన మీ సంశయనివృత్తి కాఁగలదు"

"పండితుల పస యింతేనా" యని రా జనుకొని పెద్ద దాసును బిలిపించి యా ప్రశ్న మడిగెను. ఆ భక్తశిఖామణి యిట్లనియె:—

శా. "వైరుల్ కట్టిన పుట్టముల్ తివియఁగా
వారింప నా వల్లభుల్
రా రీవేళ నుపేక్ష సేయఁదగవే
రావే నివారింపవే
లేరే త్రాతలు కృష్ణ!" యంచు సభలో
లీనాంగియై కుయ్యిడం
గారుణ్యంబున భూరివస్త్రకలితం
గాఁ జేయఁడే ద్రౌపదిన్.

మ. కరినాథుండు జలగ్రహగ్రహణ దుః
ఖాక్రాంతుఁడై వేయి వ
త్సరముల్ కుయ్యిడుచుండ వేల్పులకు వి
శ్వవ్యాప్తి లేకుండుటన్

హరి నీవే శరణంబు నా కనినఁ గు
య్యాలించి వేవేగ వా
శ్చరముం ద్రుంచి కరీంద్రుఁగాచె మహితో
త్సాహంబునన్ భూవరా!

మఱియు నజామిళుం డవసానకాలంబున 'నారాయణా!' యని కుమారుఁ బిలువ హరి వినియె. 'హరి యెం దున్నాఁడు? వానిఁ జూపవేని నీ శిరముఁ ద్రుంచి భూతబలి సేయుదు' నని హిరణ్యకశిపుండు పరమభాగవతశిఖామణి యగు ప్రహ్లాదుని గద్దించి 'యీ స్తంభమునఁ జూపు' మని నిర్బంధింపఁ బ్రహ్లాదుఁ డట్లె కానిమ్మని హరిని స్తుతింప నతండు భక్తుని మొఱ విని స్తంభంబున నావిర్భవించి యసురుం బరిమార్చి బాలభక్తుం బాలింపఁడే? కంచెర్ల గోపన్న కారాగారంబునఁబడి

"మ. నను జన్మింపఁగఁజేసి యింద్రియముల
న్నాయందుఁ గల్పించి యా
పనులందే దిరిగించి పాపముల నా
పైఁబెట్టి 'యేఁదేరకాఁ'
డనుచుం బోయెదు సూత్రధారివగు నీ
వాడించినట్లే నటిం
చిన కీల్బొమ్మను నట్లుచేసినసరే
శ్రీ భావనారాయణా!"

అని ప్రార్థింప నాతని దీనాలాపంబుల విని కరుణా సముద్రుండైన రామభద్రుండు తన భక్తుని చెఱఁ బాపఁడే? భగవంతుఁడు భక్తులకుఁ గూఁత దూరమున నున్నాఁడు" ఆతని సుధామధురోక్తులకుఁ బ్రభుఁడు సంతసిల్లి పెద్దదాసు ననేకవిధంబులఁ గొనియాడెను.

శ్లో. జలేవిష్ణు స్థలేవిష్ణు-ర్విష్ణుస్థావర జంగమే
అంతర్విష్ణు ర్బహిర్విష్ణు-స్సర్వం విష్ణుమయం జగత్.

దేవుఁడు జలమునఁగలఁడు. స్థలమునఁగలఁడు. స్థావరములందుఁ గలఁడు. జంగమములందుఁ గలఁడు. ప్రతి వస్తువునందుఁ బరమాణువునందు లోపలను వెలుపలను గలఁడు. సర్వము విష్ణుమయము. అతఁడు లేనిచోటే లేదు.

అతఁ డెట్టిరూపముతో నున్నాఁడు?

జగదేకమాతయగు సీత ప్రశ్నకు మారుతి యిట్లుత్తర మిచ్చెను.

సీ. నీలమేఘచ్ఛాయఁ బోలు దేహమువాఁడు
ధవళాబ్జపత్ర నే త్రములవాఁడు
కంబుసన్నిభమైన కంఠంబుగలవాఁడు
బాగైన యట్టి గు ల్భములవాఁడు
తిన్ననై కనుపట్టు దీర్ఘ బాహులవాఁడు
ఘనమైన దుందుభి స్వనమువాఁడు



పద్మరేఖలుగల్గు పదయుగంబులవాఁడు
చక్కని పీనవక్షంబువాఁడు
తే. కపటమెఱుఁగని సత్యవా క్యములవాఁడు
నమణి రాముండు శుభ లక్ష ణములవాఁడు.

........................................

శ్రీరాముఁడు మానవుఁడని దేవుఁడు కాఁడని యధిక మేధావంతులు కొందరు వాదింతురు. అట్టివారితో మనకేల వాగ్వాదము? భగవంతునకొక రూపము లేదని వారిమతము. కాని 'నేనే దేవుఁడ' నను వేదాంతులలోఁ గూడఁ జేరరు. విగ్రహపూజ కూడదని వారి వాదమున సారాంశము. ఏరూపమును లేని దేవుని సేవించు టెట్లని మన మడిగిన నిరుత్తరులగుదురు. రామకృష్ణాద్యవతార చరిత్రములఁ జదివినప్పుడు వినినప్పుడు మనకుఁ గలుగు నానందము సౌభాగ్యులగువారి కెట్లు లభించును? మన ఆకర్షణ గుణ సమన్వితములై భక్తి బీజముల నంకురింపఁజేసి దుర్మార్గదూరులఁ గావించి పరమానంద వారిధినోలలాడించు శ్రీరామచంద్రుని సుందరమూర్తిని ధ్యానింపఁగా మనకు సమకూరు నిర్మలానందభాగ్యము, 'దేవునకు రూపము లేదు. గుణమ్ములేదు. నడవడియొకటి లేదు. నాలో నీలో కుక్కలో నక్కలో నన్నిటిలో నున్నాఁ' డని యొక్క స్థిరభావమునఁ గాక పలుపోకలఁ బోవుచు నొక శూన్య ప్రదేశమునఁ గూర్చుండి తాను ధ్యానించున దేవో

తనకే తెలియకపోఁగా ననుద్దేశ తత్త్వమున వ్యక్తముం జింతించువారికిఁ గలదా?

శ్లో. అక్షరావగమలబ్ధయే యథా స్థూలవర్తుల దృషత్పరిగ్రహః
శుద్ధబుద్ధ పరిలబ్ధయే తథా దారుమృణ్మయ శిలామయా
ర్చనమ్.

అక్షరములను బాలురు గనుఁగొనుటకై గుండ్రని ఱాతిముక్కల నక్షరములనుగఁ జెక్కి చూపించుటవలెనే నిత్య శుద్ధ బుద్ధ పరబ్రహ్మజ్ఞానము కలుగుటకొఱకు దారువులతో మృత్తికతో ఱాళ్లతోఁ జేయఁబడిన విగ్రహములను జనులు స్వీకరించుచున్నారు.

మనస్సు చంచలమైనది. దానిని స్థిరముగ నిలుపుట దుష్కరము. మొదట నొక వ్యక్తవస్తువును జూచిననేకాని యవ్యక్తవస్తుకల్పనము మనుజుల మనస్సులందు స్ఫురింప శక్యముకాదు.

క. తగు విషయముఁ జింతింపక
యగోచరమనూహ్య మెట్టు తె లగుఁ జింతింపన్
దగ మొదటి మెట్టు నెక్కక
మెగుప కెగురనగునె? పడవె తె యిల? విద్యార్థీ!

నారాయణుండు గరుడవాహనారూఢుండని కౌస్తుభ మణిని వక్షమున ధరించినవాఁడని, చతుర్బాహుఁడని, కమల నాభుండని, శంఖచాయుధధరుండని, జగత్పావనియైన గంగా

జననంబున కాకరమై కులిశరేఖాంకితమైన చరణ కమల యుగళుండని, నీలజీమూత సన్నిభ దేహుండని, శ్రీవత్సుండని, భాగవతశ్రేష్ఠులు వర్ణించియున్నారు.

కొందఱు తత్త్వవేత్తలు—

దండకము:—"ఈశా! కృశానుండు నెమ్మోము సోముండు భానుండు కన్నుల్ దిశల్ కర్ణముల్ భూమిపాదంబు లంభోనిధుల్ కుక్షి శల్యంబులద్రుల్ లతాసాలముల్ రోమముల్ గాలిప్రాణంబు బాహుల్ సురేంద్రుల్ ఘనంబుల్ కచంబుల్ నభోవీధినాభిప్రదేశంబు రేలుఁబగల్లున్ని మేషంబు లంభోజగర్భుండుగుహ్యంబు వర్షంబువీర్యంబు నాకంబు మూర్ధంబుగానేకమైయున్న నీమేనిదండం బయోజాతగర్భాండముల్మండితోదుంబరానోకహానేక శాఖాఫలాపూరితానంత జంతుప్రకాండంబులీలన్ ప్రసిద్ధోదరాశిస్థ జంతుప్రకారంబుగా నిండియుండున్ మహారూప నీరూపము" అని ప్రపంచ స్వరూపునిగా భగవంతు నుగ్గడింతురు.

వేఱొక కొందఱు స్త్రీనపుంసక పురుషమూర్తియును గాక తిర్యగమరనరాదిమూర్తియును గాక కర్మ గుణభేద సదసత్ప్రకాశి గాక యాదిమధ్యాంతరహితుఁడై

క. లోకంబులు లోకేశులు
లోకస్థులుఁ దెగిన తుదిని లోకంబగు పెం

జీఁకటి కవ్వల నెవ్వం
డేకాకృతి వెలుఁగు నతని......
సేవింతురు.

ఇందేదియుఁ జెడు తెరువు గాదు. ఒకటి కొకటి పైపై సోపానములవలె నలరారుచున్నవి. మొట్టమొదటిది సగుణోపాసనము. పిదప నిర్గుణోపాసనము. సగుణోపాసనంబున నిర్మల నిశ్చలభక్తి కుదురును. ఆపై నిర్గుణోపాసనంబున నిలుకడ గలుగును. కొందఱు తాము గొప్పవారమని లోకులనుకొనుటకై సగుణోపాసనమును దూషింతురు. మహాత్ములట్లు చేయరు. ఏఱుదాఁటి తెప్పఁగాల్చువా రెట్టివారు?

క. పైకెగురు శక్తి చాలదు
క్రాఁకిసడక తనకు హీన ప్రవర్తన మాయే
కాకి కగు గబ్బిలపుగతి
పోకయును త్రిశంకుపదము పోమును విద్యార్థీ.

బాలకులకు సగుణోపాసనమే ముఖ్యకర్తవ్యము. ప్రహ్లాదుని యుపదేశవాక్యము లాలింపుము.

క. చిక్కఁడు వ్రతములఁ గ్రతువులఁ
జిక్కఁడు దానముల శౌచ శీల తపములన్
జిక్కఁడు యుక్తిని, భక్తిని
జిక్కిన క్రియ నచ్యుతుండు సిద్ధము సుండీ.

క. చాలదు భూదేవత్వము
చాలదు దేవత్వ మధిక శాంతత్వంబుఁ
జాలదు హరిమెప్పింప వి
శాలోద్యములార! భక్తి చాలినభంగిఁ.

శ్లో. వ్యాధస్యా చరణం ధ్రువస్యచవయోవిద్యాగజేంద్రస్యకా
కుబ్జాయాఃకిమునామరూప మధికం । కింవాసుధామ్నో ధనం
వంశఃకోవిదురస్య యాదవపతే । రుగ్రస్య కింపౌరుషం
భక్త్యాతుష్యతి కేవలం నచగుణో । భక్తిప్రియోమాధవః.

భగవంతునిభజింప జాతి రూప వయో విద్యావీర్యాదులనవసరములు. ధర్మవ్యాధుని వ్యాపారమేమి? ధ్రువుని వయస్సెంత? గజేంద్రుఁ డెంత పండితుఁడు? కుబ్జ యెంత రూపసి? కుచేలుఁ డెంత ధనవంతుఁడు? విదురుఁ డే వంశస్థుఁడు? ఉగ్రసేనుఁ డెంత పౌరుషశాలి? వీరెల్లరు దేవుని దయకుఁ బాత్రులైరిగదా! భగవంతుఁడు కేవల భక్తిచేతనే సంతోషించును.

భగవంతుని బూజింప మంచి పుష్పము లెనిమిది కావలయు.

శ్లో. అహింసా ప్రథమం పుష్పం । పుష్ప మింద్రియనిగ్రహం
సర్వభూత దయాపుష్పం । క్షమాపుష్పం విశేషతః

ధ్యానపుష్పం తపఃపుష్పం । శాంతిపుష్పం తథైవచ
సత్యమష్టవిధం పుష్పం । విష్ణోః ప్రీతికరంభవేత్.

భగవంతుఁడు భక్తపరాధీనుఁడు.

ఆ. వె. "నాకు మేలుగోర ? నా భక్తులకకాని
భక్తజనులకేన ? పరమగతియు
భక్తుఁ డెందుజనినఁ ? బఱతెంతు వెనువెంట
గోవువెంటఁదవులు ? కోడభంగి"

అని భక్తవత్సలుండు దుర్వాసున కనియె.

నారదుఁడొకప్పుడు 'నీవెచ్చట నుందు' వని నారాయణు నడుగ నతఁ డిట్లనియె.

శ్లో. నాహంవసామి వైకుంఠే । నయోగి హృదయార్ణవే
మద్భక్తా యత్రగాయంతి । తత్రతిష్ఠామి నారదా.

నేను వైకుంఠమున నివసించుటలేదు. విశాలహృదయులగు యోగిజనుల డెందంబుల నంతగా నుండను. నాభక్తులు నన్నెచటఁ గీర్తించుచుందురో యచ్చట నిలిచియుందును.



## 2. దైవ భక్తి

విద్యార్థులు పాఠశాలలోఁ దాము బుద్ధి యెఱిఁగినది మొదలు జీవితపర్యంత మెట్లుప్రవర్తింపవలయునో యదియెల్ల నేర్చుకొనవలసియున్నారు. అది సంగ్రహముగఁ జెప్పవలయు

నన్నచో వర్ణాశ్రమధర్మములును, బురుషార్థములును, దేశ కాలపాత్రములును, మాతృ పితృ గురు దైవభక్తియు నని చెప్పవచ్చును. నేరువఁదగిన, నడుచుకొనవలసిన సర్వ ధర్మములు నిందే విలీనములై యున్నవి. మాతాపితృ గురుభక్తిం గూర్చియుఁ, గాలముంగూర్చి కొంతయు వీరు సేర్చుకొని యున్నారు.

దైవభక్తి లేనివాఁడు రెండుకాళ్ల పశువని చెప్పఁబడుచున్నాఁడు. మనుజుఁ డణుమాత్రశరీరుఁడై మాతృగర్భమునఁ బ్రవేశించి వృద్ధిసెందునప్పుడును, మరల బయలువెడలునప్పుడును, దప్పటడుగు లిడుచుఁ బుడమిపంబు నడుగడుగునకుఁ బడునప్పుడును, బ్రపంచము సర్వమును మఱచి నిద్రించునపుడును, నదాటున నాపదలు సంభవించు నదనునను గాపాడువాఁ డెవ్వఁడు? లోకేశ్వరుఁడును లోకశరణ్యుఁడునైన యొక్క భగవంతుఁడు దక్క!

చెట్టుగనో గుట్టగనో క్రిమిగనో కీటకముగనో పక్షిగనో మృగముగనో బుట్టింపక మనుష్యునిగఁ బుట్టించి, యందును సర్వావయవ సౌభాగ్యవంతునిగఁ జేసి వివేకమొసఁగి పరిరక్షించు పరమేశ్వరునియెడ నిష్కలంకమైన ప్రేమ చూపుట తప్ప వేఱొండు కృతజ్ఞతా సూచక కృత్యము మనకుఁ గలదా? మానవనిర్మితములైన దేవాలయములును, మత్సవాదులును గృతజ్ఞతాసూచకములు. భగవద్భక్తియు,

భక్తితోఁ గూడిన సేవనమును మనుజునకు విధిగఁ జేయ వలసిన పనులు. అదియొక కోరికతోఁ గూడియుండరాదు.

ఉ. లోకము లన్నిటిం గడుపు
లోన భరించినవాని లంచముల్
జోకఁగనిచ్చి లోఁగొనెడు
జోదుగలాఁడె? మహానురాగియై
కాక! క్రతువ్రతంబులను
గాసఁగ శక్యమె? యంచు దేవుపైఁ
దేఁకువఁ బ్రేమ నిల్పఁగల
ధీనిధి ధన్యుఁడు భూతలంబునన్.

పూర్వము మధురానగరసమీపవనమున నొక మునిపల్లె యుండెను. అందు సుధాముఁ డను పేరుగల బీదబ్రాహ్మణుఁ డొకఁడుండెను. అతఁడు బాల్యమున శ్రీకృష్ణునితోఁ గూడి సాందీపని యను గురువునొద్ద సద్విద్య నభ్యసించెను. పదపడి తరుణీలలామయు నన్వర్థాభిధేయయునైన సుశీలయను కాంతను బెండ్లియాడి గార్హస్థ్యధర్మంబు నిర్వర్తించుచు నిరువదియేడుగురు బిడ్డలఁ బడసెను. ఈ జగమున సాజముగ బీదలకేగద వలదన్నను వదలక బహుపుత్రత్వము ప్రాప్తించుచుండును! కట్ట బట్ట లేక శతసహస్ర పరిచ్ఛేద సంఘటిత పురాణ జీర్ణవస్త్రము నతఁడు ధరించుటచే జను లతనిఁ గుచేలుఁ డని పిలువసాగిరి. మానవుఁడు చేయు ప్రతి కార్య

మందును బ్రాణి హింసనము కలదని తెలిసి కాఁబోలు నా కుచేలుఁడు,

క. విసువక యెడపుల రాలిన
కసపుల ధాన్యములు తమకు గ్రాసంబులుగా
వసుదేవసుతునిఁ గొలుచుచుఁ
బసిబిడ్డలు నాలు నతఁడు బ్రతుకు ధరిత్రిన్.

ఇట్లేఱి తెచ్చి కాఁచిన యా బీదగంజి యెంతకాఁగలదు? అందు సగ మతిథులకుఁ బోఁగా మిగిలినది తన కడుపు నిండు నా? ఆలి యాఁకలి తీఱునా? పిల్లల క్షుద్బాధ యుపశ మిల్లునా? కుమారు లాఁకటిచిచ్చున వల వల మాడుచు నొకఁడు సొమ్మసిల్ల, నొకఁడు తల్లడిల్ల, నింకొకఁడు డాఁకలే యని యేడువ, మఱియొక్కరుఁ డమ్మా! అన్నము పెట్టవే! యని చెఱఁగుపట్టి యీడువ, నొక్కఁడు డడుగ లేక నోరు దెఱవ, వేఱొకండు తన్నుఁదా మఱువ, నొకరుఁడు లేవఁ బోయి చదికిలఁబడ, నింకొకరుఁ డవ్వా! బ్రదుకఁజాలనని దిగులువడ, నిట్లు పరిపరివిధముల వారలు పరిదేవనము సేయ నా పతివ్రతాతిలకంబు పరితాపంబునంది ప్రాణనాథుని కడ కేగుదెంచి ప్రణమిల్లి నయమార నిట్లులనియెను. నాథా! తనయు లిట్లు దారిద్ర్యముచేఁ బీడింపఁబడుచుండ వారి రక్షించు మార్గ మన్వేషింపక యూరకుండుట పాడియే? మీకు బాల్య మిత్రుఁడు శ్రీకృష్ణుఁడని విందు. అతని నాశ్రయించి మన—

కుచే:—తరుణీ! మన బిడ్డల రక్షింప మనమే కర్తల మని భావించితివా? వారు నీ కడుపున నుండినపుడు వారిని నీవే రక్షించితివా? ఎల్లవేళల నీవే వారిని గాపాడుచుంటివా? పుట్టించిన జగజ్జనకుఁడు పోషింపకుండునా?

సుశీ:—

ఆ. వె. "గొల్లవానిపోల్కిఁ ౹ గోల చేకొని యాలఁ
గాచునట్లు ప్రజలఁ ౹ గావఁడెపుడు
నొకరి కొకరిఁ జూపి ౹ యొక్కింత తెల్విని
నొసఁగి కాంచుదేవుఁ ౹ డుర్వియందు"

అని విజ్ఞులు వక్కాణింతురు. మనుష్యప్రయత్నము సర్వకార్యముల కత్యావశ్యకము. కావున మహాత్మా! హరి కృపాకటాక్షరవిదీప్తిం బడసి దారిద్ర్యాంధకారమగ్నులమైన మము నుద్ధరింపుము.

కుచే:—అతఁ డిచ్చువాఁడేనా?

సుశీ:—వరదుఁడు.

కుచే:—చంచలమును మనోవికార కారకము నగు నైశ్వర్యమునిచ్చువాఁడా యతఁడు?

సుశీ:—వర=శ్రేష్ఠమైనదానిని, ద=ఇచ్చువాఁడు. (వరదుఁడు)

కుచే:—చూచినమాత్రమున సేవ గలిగించు సంగ హైన్యముగల నావంటివానికిఁగూడ నిచ్చునా?

సుశీ:—అతనికి రూపాదులనవసరములు. సాధు భక్త జనవత్సలుఁడు.

కుచే:—తన శాసనము నతిక్రమింపనివారు సాధువు లనియుఁ, దన సేవ చేయువారు భక్తులనియుఁ జెప్పఁబడు దురు. కాన సాధులు భక్తులు తనవా రగుదురు. తనవారిని మాత్రము రక్షించువాఁడు వరదుఁడగునా?

సుశీ:—దిక్కులేనివారికిసైతము దిక్కగువాఁడు. ఆర్త శరణ్యుఁడు.

కుచే:—కలవాఁడేనా? "దాతాదరిద్ర" యనునట్లు దాతృత్వముగలవానికి ధనముండు టరిది.

సుశీ:—ఇందిరావరుఁడు! ఇఁకఁ దక్కువేమి?

కుచే:—అయినచో "కృపణోధనాఢ్య" యను న్యాయమున లుబ్ధుఁడుగా నుండిన?

సుశీ:—దయాపయోధి!

కుచే:—ఇన్ని సుగుణము లతనియం దున్నవా?

సుశీ:—భగవంతుఁడు! సుగుణముల కేమిలోటు? (సంపూర్ణ మాహాత్మ్య ధైర్య కీర్తి సంపజ్జ్ఞాన వైరాగ్యము లను నాఱును భగమనఁబడును. అది కలవాఁడు భగవంతుఁడు)

కుచే:—భగవంతుఁడు నిరాకారుఁడు, నిర్వికారుఁడు, నిర్గుణుఁడు నని శ్రుతు లుద్ఘోషించుచున్నవి. అట్టివాని నెచ్చోట నెట్లు చూడనగును?

సుశీ:—శిష్టశిష్ట శిక్షణరక్షణము పొంచె శ్రీకృష్ణుండై యదుకులమం దవతరించి యాదవప్రకరములు భజింపఁ గుశస్థలీపురమున నున్నవాఁడు.

కుచే:—అంత వైభవమున నుండువానికి నావంటి దీనుఁ డెట్లగపడఁగలఁడు?

సుశీ:—బాల్యసఖుఁడు గాన మీకుఁ జిరపరిచితుఁడు. అంతియకాక

మ. కలలోనం దను మున్నెఱుంగని మహా
కష్టాత్ముఁడైనట్టి దు
ర్బలుఁ డాపత్సమయంబున న్నిజపదా
బ్జాతంబు లుల్లంబులోఁ
దలఁపన్ దా మదిమెచ్చి యార్తిహరుఁడై
తనైక్షననిచ్చు న్నని
శ్చలభక్తిన్ భజియించువారి కిడఁడే
సంపద్విశేషోన్నతుల్.

కుచే:—అట్టివాని నిట్టి తుచ్ఛశ్రీకై యెట్లాసింప వచ్చు? సిగ్గగుచున్నది!

సుశీ:—సర్వజ్ఞుఁడు గావున మీ రడుగనక్కఱలేక యే చూచినంతన మిమ్మెఱిఁగి మీ కోరిక నెఱవేర్పఁగలఁడు.

కుచే:—ఎప్పుడు?

సుశీ:—ధనమదాంధులవలె 'నేఁడు రే' పని జరపక యప్పుడే యిచ్చును.

కుచే:—నా మన స్సీ తుచ్ఛ సుఖములందుఁ దగులు కొనదు.

సుశీ:—అనూనసంపదలే యిచ్చును.

కుచే:—అతని కింత చిక్కేమివచ్చె? అక్కఱ యేల కలుగు?

సుశీ:—విభుఁడు. లోకేశ్వరుఁడు.

చ. వరదుఁడు సాధుభక్తజన
వత్సలుఁ డార్తశరణ్యుఁ డిందిరా
వరుఁడు దయాపయోధి భగ
వంతుఁడు కృష్ణుఁడు తాఁగుశస్థలీ
పురమున యాదవప్రకర
ముల్భజియింపఁగ నున్నవాఁడు మీ
రరిగిన మిమ్ముఁజూచి విభుఁ
డప్పుడ యిచ్చునసూనసంపదల్.

కుచే:—సుశీలా! నీపలుకులంబట్టి నీయంతరంగము పవిత్రమైనది. నీచమగు యాచ్ఞావృత్తికి నన్నుఁ బురికొలిపితివి; కాని శ్రీకృష్ణునే వేఁడికొనుమంటివి. అతని యాచించుట నీచగుణము గానేరదు. ఇహాపరసుఖదాయకము. అగ్నిహోత్రమును, (యజ్ఞమును) గృహమును, పొలమును,

గర్భిణిని, వృద్ధుని, బాలకులను, రాజును, గురువును, దేవుని దర్శింప నేగువారు రిక్తహస్తులై పోరాదు. ఏదేని కానుక గొని చన మన కేమి గలదు?

అనుటయు సుశీల మంతనమున సంతసమంది దినము నకు నాలుగేసి గింజలుగా దాఁచియుంచిన యొక పిడికెఁ డడుకులను గొనితెచ్చి నాథుని శిథిలవస్త్రపుఁ గొంగున ముడిచి సాగనంపెను.

సుధాముఁడు దారిని బలుకష్టముల కోర్చి ద్వారకఁ జేరెను. తత్పుర సౌభాగ్యముంగాంచి యానంద పరవశుఁ డయ్యెను. అప్పై నతని డెందమందుఁ బెక్కు సందియంబు లుదయించెను. "ఈ నాగరు లింద్రసభవైభవమునఁ దుల దూఁగువారు. నిఱుపేదనగు నన్నుఁ బురములోనికి రానిత్తురా? రానిచ్చిరిపో, ద్వారపాలకులు నగరిలోనికిఁ బోనిత్తురా? పోనిచ్చిరిపో, దక్షిణనాయకుఁడైన శ్రీకృష్ణు నెచ్చట గనుఁ గొనఁగలను? కనుఁగొంటిఁబో, స్నేహవాత్సల్యమున నన్నుఁ బలుకరించునా?.........అతఁ డక్కొల చేయును? అయిన నాభాగ్యము! అతని దయ!" అని యనుకొనుచుఁ బురము ప్రవేశించి కృష్ణసందర్శనోత్సుకతఁ జనుదెంచిన జనలోకముం గాంచి యబ్బురపడి "దినములు మాసములు కాచియున్న యీ మహారాజులకు మహర్షులకు దర్శనమీయని యీ పురు షోత్తముని సందర్శనభాగ్యంబు నా కెట్లు లభ్యంబగును?" నని

సంశయించుచు ద్వారపాలకుల యొద్దికేగి వారి నాశీర్వదించి వారికి దయ పుట్టునట్టులు తన వృత్తాంతమును శ్రీకృష్ణ సందర్శనాకాంక్షయుఁ దెల్పెను.

వార లాతని యపేక్ష నుపేక్షసేయక రాక్షస శిక్షా దక్షునకు నివేదించిరి.

పట్టపుదేవియగు రుక్మిణితో వేడుకనొడువులు నుడువు చుండిన పుండరీకాక్షుండు వానినెల్ల మాని లేచి యెదురుగ నడతెంచెను. తన్ను నగరికిఁ గొనిపోవ స్వయముగ నేగుదెంచిన దయాళు చేలునిఁగాంచి కుచేలుఁడు మైపులకలతో, నానందాశ్రువులతో నిమీలితనేత్రములతోఁ, గృష్ణసందర్శనానందాపరిమితోన్మత్త నాట్యంబులతోఁ బరవశుఁ డయ్యెను. కృష్ణుఁ డతని గాఢాలింగనము గావించి తోడుకొనిపోయి తన తల్పంబునఁ గూర్చుండఁబెట్టి పాదంబులఁ గడిగి తన్నీరము శిరంబునఁ బ్రోక్షించికొని శ్రమవాయఁ దాళవృంతమున విసరి వివిధోపచారము లొనరించెను. కృష్ణుని భార్య లది గాంచి యాతఁ డెంత మహాత్ముఁడో యని యెంచి తాముసు సుధామునకుఁ బరిచర్య లొనర్చిరి. వాసుదేవుఁ డతని యెడలెల్లఁ బుడుకుచు క్షేమంబు లడిగి తాము బాల్యంబున గురు నింట విద్దె గఱచునాఁ డొనరించు చెయ్దములఁ గొన్నిటి జ్ఞప్తిపఱచి "మిత్రమా! నన్నుఁజూడ నింతదూరము వచ్చితివే! నాకేమి తెచ్చితివి?"- అని ప్రియమారఁ బృచ్ఛించెను.

తాఁ దెచ్చిన పృథుక తండులముల నివేదింప సుధాముఁడు లజ్జించెను. అది గ్రహించి సర్వజ్ఞుండగు కృష్ణుండు కుచేలుని చంకనున్న యడుకుల నందికొని "ప్రేమమీఱ నాకొసఁగినది పిడికెఁడైనను దానిని మేరుతుల్యముగ గ్రహింతును" అని వచించుచు నందు సగము భక్షించెను. రుక్మిణి లేచి "మహాత్ముల ప్రసాదము మాకు వలదా? మీయర్ధాంగుల మగు మాకు మీకు లభించిన దాన సగ మిచ్చుట న్యాయ్యము" అనుచు నతని కరకమలంబులఁ బట్టికొన శ్రీవిభుండు నగుచు రుక్మిణీదేవి వాక్యంబుల మన్నించి యట్లు చేసెను.

తదనంతరము భక్తప్రియుఁడు మూఁడు దినంబులు కుచేలుఁ దన గేహమున నిలిపికొని వివిధవినోదములఁ దేలించి నాలవనాఁడు కొంతదూరముతోడువచ్చి సాగనంపి మరలెను. కుచేలుండు కృష్ణుని వీడుకోలు వడసి పయనించుచుఁ దన మనంబున,

"ఉ. శ్రీనిధి యిట్లు నన్ను పచ
రించి ఘనంబుగ విత్తమేమియు
న్నీని తెఱంగుగానఁబడె.
నెన్ను దరిద్రుఁడు సంపదంధుఁడై
కానక తన్నుఁ జేరఁడని
కాక శ్రితార్తిహరుండు సత్కృపాం

భోనిధి సర్వవస్తు పరి
పూర్ణునిగా ననుఁ జేయకుండునే?"

అని వితర్కించుచుఁ జని చని ముందట బహువిధఫల పుష్పసముల్లసితంబైన వృక్షలతాగుల్మంబులచేతను, శుక పిక శారికా నికరకూజితంబులచేతను, జంద్రకాంతోపల వేదికల చేతను, వికచ హల్లక కల్హార కైరవ రాజీవ సహిత కాసార ములచేతను రామణీయకమై యొప్పు విశాలోద్యాన వన మొండుగాంచి సందర్శించు కుతూహలంబునఁ దదుద్యాన ప్రవేశ మొనర్చెను. అప్పైఁ గలిగిన చిత్ర మేమనవచ్చు!!!

ఎమ్ములు బయల్పడుచుండిన యాతని దేహము పుష్టమై యపరంజివన్నెఁ గేరుచుండెను. జీర్ణ చేలంబులు స్వర్ణ చేలంబు లయ్యెను. తులసిపేరులు రత్నహారములుగ మాఱెను. దర్భ ముడులన్నియు భర్మముద్రికలుగఁ బరిణమించెను. నేను గుచే లుఁడనా యను శంకయు నతనికిఁ దోఁచెను. నిజముగ నతఁ డిప్పుడు భర్మచేలుఁడుగాక కుచేలుఁ డెట్లగును?

తన్నుఁదా సంశయించుచుఁ దదుద్యానరామణీయకము గాంచి యచ్చెరువు మున్నీట మునుంగుచు, నివ్వనమహిమం బిట్టులగునేమో యనుకొనుచుఁ గలయఁదిరుగుచుఁ దన్మధ్యం బునఁ బటికంపు గోడలును, బద్మరాగ స్తంభములును, మరకతమయ కవాటంబులును, నింద్రనీలజాలకములును, శశి కాంత శిలావేదులును మౌక్తిక తోరణంబులును గలిగి చెలు

వొండు భవన మొకండు గాంచెను. కనకమణి మయాభరణ విభూషిత దాస దాసీజనంబు లట నిట విహరించుచుండిరి. ఇది యెట్టి పుణ్యాత్ముల నిలయమో యనుకొనుచుఁ గుచే లుఁడు నూఁగుచుండునంతఁ బలువురు చెలువలతోఁ గుచేలు నిల్లాలు కలుములచెలింబోలె నెదురేతెంచి యతని లోనికిఁ గొని చనెను. కుచేలుఁ డా వైభవమెల్లఁ దిలకించి "యిది యెల్ల హరి దయావలోకనమునఁ జేసికాదె యబ్బె. నా వచ్చిన కార్యంబు విచారింపక ననుఁ బంపి యీ సంపదలెల్ల నా కొడఁగూర్చి నన్నింతవానిం జేసె. ఆ పురుషోత్తముఁడు భక్తినిష్ఠులైన సజ్జనులు లేశమాత్రంబగు పదార్థంబైన భక్తి పూర్వకంబుగా సమర్పించినది కోటిగుణితంబుగాఁ గైకొని మన్నించుటకు నిదియు దృష్టాంతంబుగాదె. అట్టి కారుణ్య సాగరుండైన గోవింద చరణారవిందంబులయందుల భక్తి ప్రతి భవంబున నాకుఁ గలుగుఁగాక" యని సతీ సుత సమేతుండై భోగములయందాసక్తిం బొరయక యనంతు ననంతధ్యాన సుధారసంబునఁ బొక్కుచు విగతబంధనుండై శాశ్వతసుఖం బనుభవించె.

బాలకులారా! "విష్ణుభక్తిలేని విబుధుండు విబు ధుఁడే పాదయుగముతోడి పశువుగాక!" యను ప్రహ్లా దుని వాక్యమును జ్ఞప్తియందుంచుకొనుఁడు.

# 3. ప్రేమ



ప్రేమ యనునది యొక తీగవంటిది. అది చక్కఁగా నల్లుకొనినపిదపఁ బెరుగుటగాని నశించుటగాని యెఱుఁగు. ప్రేమలత యెంత కోమలముగా నుండిన దాని ఫలము లంత మధురములై యుండును. ప్రేమకంటె మనుజుఁ డాశింపఁదగిన దీ భువి మఱొం డేదిగలదు? నిష్కళంకప్రేమగలవాని కెందును శాత్రవులు లేరు. ప్రేమ మృత్యువునే జయింపఁగలదన్నచో దాని కసాధ్యమెద్ది? కత్తి నెత్తి కుత్తుకఁ గత్తిరింప గమకించు కఠినాత్ముని కరవాలమును సైతము దించి వాని మనస్సును గరఁగించి లోఁబఱచుకొనఁగలదు. కపటప్రేమఁజూపి వంచింప నుంకించు ధార్తరాష్ట్రులుచేయు వైభవోపేతసపర్యలను, సంసిద్ధముచేయించిన రాజభోజనమును నిరాకరించి శ్రీకృష్ణుని విదురునింట బీద విం దారగింపఁజేసిన దీ ప్రేమయే. సీతా రాములక్ష్మణులు గంగానది నుత్తరించువేళ గుహుఁ 'డోరి రామా' యని సంబోధించెనను నెపంబున లక్ష్మణుండు క్రుద్ధుండుకాఁగా "అతఁ డెట్లాడినను మాననీయుంబ. అతని దూఱకుము. ప్రేమవిరహిత గౌరవవచనములకంటెఁ ప్రేమాపూర్ణ గ్రామ్యవచనంబులు నా కతి ప్రియకరంబులు" అని రామునిచే ననిపించిన దీ యవ్యవహిత ప్రేమయే. పితృ

పతిచేఁ గొంపోఁబడుచుండిన పతి ప్రాణములను మరలఁ గైకొన్నదియు నీ యవిచ్ఛిన్నప్రేమయే. విమలమైన ప్రేమము విధినిగూడ లక్ష్యపెట్టదు.

నిషధదేశాధీశుఁడగు నలుఁడు కలి ప్రేరణముచేఁ బుష్కరునితో జూదమాడి తనకున్న సర్వస్వముం గోలుపోయి భార్యతో నరణ్యములకుఁ బోయెను. అట గుట్టలు మిట్టలు ముండ్లు గండ్లు దాఁటలేక దమయంతి పడు దురవస్థం గాంచి నలుఁడు తన యిల్లాలిని బుట్టినింటికిఁ బొమ్మనియెను. వైదర్భి యాపలుకుల కులికిపడి యిట్లనియె. "నాథా! అర్ధాంగిని మీ రిట్లాడ నుచితమే? ప్రాణనాయిక ప్రాణేశ్వరుని వదలి యెటకుఁ బోఁగలదు? మీ రడవుల నిడుమలు పడుచుండ నేఁ బట్టణముల సుఖింపఁగలుగుదునే? మీరు కాననములఁ గాయలాకులు దినుచుండ నేను మేడలలో మృష్టాన్నమునఁ దృప్తి నొందఁగలనే? కీకాటవుల మీ రేకాకులై యేఁకరుచుండ సఖులు పరివేష్టింప సమ్మతించి సంచరింపనేర్తునే? నన్నుఁ బాణిగ్రహణము సేయువేళ మజ్జనకునితో వచించిన పవిత్ర వచనముల నొకసారి స్మరించుకొనుఁడు. ప్రాణప్రియా! నేను మీవెంట నుండిన మీకేమిభారము? మీరు నడచునపుడు త్రోవ కడ్డుపడు కంటకముల నవ్వలికి గెంటువా రెవ్వరు? మీ రలసినవేళ నాయాస ముపశమింప నుపచరించువా రెవ్వరు? తాత్కాలిక దుస్థితిం దలంచుకొని దురపిల్ల ధైర్య వాక్కుల నొదార్చువా రెవరగు?

హింసుc మడిచికుcడు వాని కిరుభుజంబులై పొల్చిరి. ఇcక నతని కార్యనిర్వహణమునకు లోటెక్కడిది? ప్రజలు భూభుజు లొక్కపెట్టున మొఱలిడుచు శ్రీకృష్ణభగవానునకుc దమ యిక్కట్టుల నివేదించుకొనిరి.

ఆ సమయంబున శ్రీకృష్ణమూర్తి పాండవులచే సాహాయ్యమానంతైరె రాజసూయాధ్వరమునకు విజయము చేసియుండెను. జరాసంధుని బిలుకుమార్పనంగాని యజ్ఞము సాకల్యముగ నెఱవేఱదని కృష్ణుcడు ధర్మరాజును హెచ్చరించి వాని దుశ్చరిత్ర మాద్యంతము నెల్లడించి భీమార్జునుల నా కైవసము చేసిన వానిc బరిమార్చు టెంతపని యని నొక్కి పలికెను. యుధిష్ఠిరుc డందుల కొడcబడి "కృష్ణా! మహాధ్వర క్రియాసిద్ధియ కాక సర్వరాట్కారాగార మోక్షణంబును నకల్పిపశక్తియు విస్తరిల్లు నికార్యంబునకు వెను దీయుదుమే? మఱియు భవదీయాశ్రయమున నున్న మాకు శత్రుజయం బొక పెద్దయే? ఇప్పుడ వెడలి విజయసిద్ధిం బడసి రం" డని భీమార్జునుల నతని కప్పగించెను.

కృష్ణ భీమార్జునులు సుస్నాతులై స్నాతకవేషులై వీర శ్రీ విభాసితముఖులై వీరయాత్ర వెడలి పర్వతంబులు నదులు పట్టనములు గడచి గిరివ్రజపురంబును సమీపించి చైత్యకాద్రి నెక్కి దురాసదంబైన యప్పురి విలోకించిరి. కృష్ణుcడు భీమ పార్థులం గాంచి యా పురవృత్తాంతంబుc జెప్పcదలంచి

యిట్లనె. "గోరథము, ఋషభము, వైహారము, ఋషిగిరి, చైత్యకాద్రి యను చౌపంచముల లీ నగరంబును జుట్టి శూర భటులంబోలెఁ గాచియుంటచే నీ పురము గిరివ్రజంబునాఁ బ్రసిద్ధంబయ్యె. మఱియు నీ మూఁడు భేరులఁ గనుఁడు. తొల్లింటి మాగధులు మానుషాదంబగు ఋషభంబును వధి యించి దాని చర్మంబున వీని నిర్మించిరి. ఇవి యిప్పురంబున వింతవా రెవ్వరేఁ జొచ్చునప్పుడు తమంత మ్రోఁగు"

అంత నాముగ్వురు భుజదండంబుల నమ్మూఁడు భేరుల వ్రచ్చి తద్ద్వారంబున నగరంబుసొచ్చి బలాత్కారంబున మాలా కారుల మందిరంబుల కరిగి మాల్యాలంకృతమౌళులై, గంధ కర గృహంబులకుఁ జని చందనాగరు రజోభూషిత వక్షులై విస్మయ మాన మాగధ నిరీక్ష్యమాణులై, విప్రులకు సుప్రవే శంబగు జరాసంధ మందిరద్వారంబు దఱిసిరి. బార్హద్రథి యెదురేగుదెంచి వినయపూర్వకంబుగ మధుపర్కంబీయఁ జేకొనని మహోపాయుల గర్వంబు నభిప్రాయంబు నెఱిఁగి యిట్లనియె. "మీరు చందనమాల్యాలంకార శోభితులగుటం జేసి స్నాతకులు గారని తోఁచెడి. మఱియు మీరలు చైత్య కాద్రితటమున భేరులు వ్రచ్చి తద్ద్వారంబునఁ జులకనఁ బ్రోలు సొచ్చితిరి. మీవేషంబుల బ్రాహ్మణత్వంబును మహాసత్త్వ దీర్ఘబాహు పృథుల వక్షోలక్షణంబుల క్షత్త్రియత్వంబును బ్రకాశించుచున్నయవి. మీరెవ్వరు? ఎందుల కిందే తెంచితిరి? వివరింపుఁ" డనవుడుఁ గృష్ణుఁ డుత్తర మిట్లు సెప్పఁబూనె.

కృష్ణ:—మేము క్షత్రియస్నాతకులము. ద్వారంబున మిత్రనివాసంబును నద్వారంబున నమిత్రనివాసంబును జొచ్చుట బాహువీర్యసంపన్నులైన క్షత్రియులకుఁ గర్తవ్యంబు. గంధమాల్యంబుల లక్ష్మియుండుం గావున బలాత్కారంబునఁ గొంటిమి.

జరా:—అపరిచయులమై పరస్పరము హితమాచరింపము. సద్గుణయుక్తుండనిరాగసుండ మీకు నమిత్రుండ నెట్టులైతి?

కృష్ణ:—అకారణంబుగ సాధుహింస యొనర్చు కుజనుఁ డెల్లవారి కప్రియుండ. నిర్దయుండవై నిర్దోషులైన సవర్ణుల వధియించునంతకంటె మిక్కిలి పాపంబొండెద్దియుండు? నీ యట్టి పాపకర్ము నుపేక్షించిన నఖిలధర్మరక్షణాక్షములమైన మమ్ముఁ దత్పాపంబునొందు. ఇట్టు లుద్ధతిని దారుణ భైరవపూజ సేసిన సత్కీర్తియేని సద్గతియేని గలదే?

జరా:—పండితమ్మన్యులరై నన్నిట్లాక్షేపింపవచ్చిన మీర లెవ్వరు?

కృష్ణ:—నేను గృష్ణుండ. వీరలు పవనమఘవతనయులు. పాండవులు. నా మాట వినుము. నిన్ను మేలొందెడిని. బంధితులైన పృథివీపతుల విడిచిపుచ్చుము. విడువవేని సమరంబున నీ యుక్కడఁచి కడిమిఁ బుడమితేడుల విడిపించుట తథ్యంబు.

జరా:—దేవార్థముగాఁ దెచ్చిన విషయాధీశుల మీ యాటోపంబునకు నడలి వదలువాఁడనే? రండు భండనము నకు. మీ కండ క్రొవ్వడఁగింతు.

కృష్ణ:—ఒక్కనితోఁ బలువురు బవర మొనరించుట పాడిగాదు. మాలో నొక్కని గోరుకొనుము. అతఁడు నీతో మల్లయుద్ధ మొనర్పఁగలవాఁడు.

జరా:—పదుమూఁడుమాఱు లెత్తివచ్చిన నిలువ నోపక పాఱిన పిఱికిపందవు నీవు. అర్జునుండు పిన్న. ఈ కడు వలిపట్టియ నాకుఁ దగువాఁడు. వీనితో మల్లరణ మొనర్చెద.

భీమసేన జరాసంధు లిరువురు సన్నద్ధులై యొండొరు వులఁ బ్రతిఘటించి నిలిచిరి.

క. కర్షితరిపు లన్యోన్యా
కర్షణ సంకర్షణాప కర్షణముల సా
మర్షులయి పెనఁగి రాహవ
హర్షంబునఁ బవనసుత బృహద్రథపుత్రుల్.

ఇట్లు కార్తికమాస ప్రథమదివసంబునం దొడంగి వా రిరువురెడయకుడుగక యొండొరులఁబట్టియుఁ గిట్టియు నడిచియుఁ బొడిచియుఁ దాఁచియుఁ ద్రోచియు మహాయుద్ధంబు సేయుచుఁ బదుమూఁడు దినంబు లెడ్రతెవ్వక పోరిరి. వజ్ర వజ్ర సన్నిభంబులగు నితరేతర ముష్టిఘట్టనల భిన్నాంగులై రక్తసిక్తగాత్రంబులతోఁ బుష్పితాశోకంబుల వీఁకను జేకుఱుఁ

గొండల వడుపునను జూపట్టి యహోరాత్రంబులు వదలక మోహారంబున మోహరించి యాహారవాంఛ విసర్జించి మల్లయుద్ధకౌశలం బేర్పడఁ బెనఁగు నెడఁ జతుర్దశినాఁటిరాత్రి జరాసంధుం డతి శ్రాంతుండగుట నుపేంద్రుం డుపలక్షించి "విరోధి విరహితసత్త్వుఁడయ్యె. అశేషధారుణీశ్వర నికరాపరాద్ధు వీని వధించి నీ తండ్రి బలంబును నీ బలంబును జగంబు లెఱుంగ మా కానంద మాపాదింపు" మని ప్రబోధించి ప్రభంజనపుత్రుండు సూచుచుండ నొక్క శాఖాగ్రంబు రెండుగాఁ జీల్చి విరోధి నిట్టుల చీరి చంపుమని సంజ్ఞగాఁ జూపిన నతండును నా కీలు దెలిసి యవక్రపరాక్రముండై విజృంభించి మాగధుం బడఁద్రోచి యొక్క పదంబు పదంబునఁ ద్రొక్కి బాహుయుగళంబున రెండవపదంబు గదలకుండఁ బట్టి మస్తకపర్యంతంబు పెళపెళ యను చప్పుళ్ళుప్పతిల్ల మత్తదంతావళంబు తాళవృక్షంబుఁ జీఱుచందంబున బాద జానుజంఘోరుకటిమధ్యోదరాంస కర్ణ నయనంబులు వేఱువేఱు భాగంబులుగా వ్రయ్యలువాపి యార్చె. పౌరజనంబు లుభయాకులురై హాహాకారంబులు సేసిరి. అనిలజుని గృష్ణ జిష్ణులు గవుంగిలించి కొనియాడిరి.

తరువాత శ్రీకృష్ణుండు దయామయుండు గావున జరాసంధసుతునకు సహదేవునకు మగధరాజ్యంబు పట్టంబు గట్టి, చెఱసాలల మహాదుఃఖముల నొగులుచున్న రాజుల

విడిపించె. షదపడి ముప్వురు మగిడి కతిపయదినంబుల కింద్ర ప్రస్థంబుఁ జేరి జరాసంధు మరణవార్త యజాతశత్రునకుం దెలిపి యతనిచే మన్ననలు దీవనలు వడసిరి.



# 13. పెద్దలఁ దిరస్కరింపరాదు



ఎట్టివారినిగాని తిరస్కరించి పలుకరాదు. దానిచే మాత్సర్యము వృద్ధియగును. మాత్సర్యమువలనఁ గలుగని చెడుగొక్కటి లేదు.

ఉ. మచ్చరమున్నచో మదిని
మానఁగ మందునులేని రోగముర్,
గుచ్చితబుద్ధి, దాన సభ
కుం గొఱగామియు, దూష్యబుద్ధి, పె
న్రచ్చలిహంబునందునఁ, బ
రమ్మున సౌఖ్యమునున్న, యంచు నీ
మచ్చరముం ద్యజింపఁగల
మానిసి ధన్యుఁడు భూతలంబునర్.

పెద్దలఁ దిరస్కృతిసేఁత భావ్యభివృద్ధికి భంగకారి. బాగుపడఁగోరువాఁడు మొదలంట నీగుణమును మాన వల

యును. పరదోషాన్వేషణమే తిరస్కృతికి మూలకందము. కుమార్గగాముల సాహచర్యంబున వారి గుణసంపర్కము చేతను దోషాన్వేషణ మతి యుత్పత్తిల్లును. దుష్టసాంగత్యము గలవారి కేదిపట్టువడదు? ప్రయత్న మెటవలయు? తిరస్కృతి యెంతువలయు ననుప్రశ్నకు శంకరాచార్యులవా రిట్లు లుత్తర మిచ్చిరి.

తే. గీ. అడఁకువయు యత్నమును నెందు ◊ సడరవలయు?
దానమందు, సాపథమున, వి ◊ ద్యాగటించునెడ;
నెట్టికార్యంబులం దిర ◊ స్కృతి వలయును?
పరధనాంగనాది భ్రాంతిఁ ◊ బాపిమైత్రి;

చేది భూపతియగు తముఘోషుండనువానికి (వసుదేవుని చెలియలైన) సాత్వతి యను భార్యయందు శిశుపాలుం డను కుమారుం డుదయించెను. అతఁడు పుట్టినప్పుడు చతుర్భుజంబులతో లలాటనేత్రంబుతో నుదితుండై రాసభస్వరంబున బిట్టేడ్చుచున్నంజూచి పితరులు భయవిస్మయాధీన మనస్కులైన, వారల కశరీరభూతం బిట్లు వచించె. "ఇబ్బాలకు నెవ్వరెత్తికొనుడు నెక్కుడు బాహుచక్షు లడంగు వానిచే నీఁడు ద్రుంగు"

ఆమాటలు విని వారలద్భుతంబంది కుమార దర్శనోత్సుకులై వచ్చినవారికెల్ల నెత్తికొన నిచ్చుచుండిరి. మేనత్త కతి వికృతస్వరూపుండగు కుమారుండు జనించినవార్త విని

బలరామకృష్ణులు చూడవచ్చిరి. ఎప్పటియట్ల తల్లిదండ్రు లా పుత్త్రకు మొదట బలరాముని చేతికిచ్చి పిదప దామోదరు చేతి కిచ్చిన,

క. అక్కొమరుకు నబ్జనాభుం
డక్కజముగ నెత్తికొనుచు నాదటఁ జూచెన్
గ్రక్కున నొక్కట నడఁగెను
మిక్కిలి చేతులును వాని మిక్కిలి కన్నుల్.

తచ్చిత్రం బుపలక్షించి సాత్వతి యశరీర వాక్యప్రకారము కుమారునకు మురవైరివలన మరణంబని యెఱింగి జనార్దను నుద్దేశించి,

క. "కుపథప్రవృత్తుఁడయి వీఁ
డపనయమున నీకనిష్టుఁ డయినను గరుణా
నిపుణుఁడవై నీ మఱఁదికి
నపరాధశతంబు సైఁపు మయ్య ముకుందా!"

అని యర్థించిన నట్లకాక యని కొన్నిదినంబులు చేదిపురి నుండి కృష్ణుండు రామునితో నిజపురంబునకు మరలె. శిశుపాలుండు బాల్యమునుండి కంసకాల యవన జరాసంధ దంతవక్ర సాళ్వ విదూరథుల సహవాసంబునఁ బ్రమత్తుండై యెల్లవేళలఁ గృష్ణుని ద్వేషించుచుండె. తల్లి యెన్నివలనుల హృషీకేశునిపై ద్వేషము పూనవలదని యొప్పఁజెప్పినను వినినవాఁడు కాఁడు. ఇట్లుండ శిశుపాలుఁడు ప్రేమించిన రుక్మిణిని

కుశువివాహంబున నర్థోక్షుజుండు గ్రహించుటచే విరోధము చాలింత ప్రబల మయ్యెను. చైద్యుండు కృష్ణుని కార్యము లన్నింటికి కష్టపడుచుఁ దిరస్కరించుచు నెల్లిదము సేయుచుఁ గాలముఁ గడుపుచుండెను. శ్రీకృష్ణుండును మేనత్త కిచ్చిన మాట మీఁదికపై తృప్తసేయు క్షమించుచునచ్చె.

జరాసంధ వధానంతరము ధర్మజుండు సేయు రాజ సూయమునకు సకలరాజన్యు లాహూతులైరి. యజ్ఞంబు నిరభ్యంతరంబుగఁ బరిసమాప్తిఁ జెందె. అప్పుడు యాజకసదస్య గురుద్విజకోటిం బూజించునాఁడై ధర్మతనయుండు కురువృద్ధు లగు భీష్మాదులంజూచి యిందగ్రపూజార్హు లెవ్వరని యడిగిన నందఱుఁ దమకుఁదోఁచినరీతుల వచింప వారిపలుకులవారించి యాపగాతనయుండు "యజ్ఞపురుషు నచ్యుతు నఖిలలోక పూజ్యుఁ బూజింపు మదియ యజ్ఞఫలం" బనిన యమనందనుండు సహదేవోపనీతంబైన యర్ఘ్యంబం బర్హణీయుండైన వాసుదేవునకు శాస్త్రోపదిష్ట విధానంబున నొసంగిన దానింజూచి సహింపనోపక శిశుపాలుండు పాలంభనపరుండై యధోక్షజు నాక్షేపించుచు నిట్లనియె.

"విశిష్టాచార భాసురులగు భూసురులు నకుంఠిత విక్రములైన రాజకంఠీరవులు ననేకులుండ గాంగేయు దుర్వ్యవసాయంబునం జేసి కష్టచరిత్రు, నికృష్టు, కృష్ణుఁబూజింపఁదగునే? వీనిని వృద్ధుని తలంచితిరేని వసుదేవాదులులేరా? ఆచార్యుఁ

డంటివి కేని కృపద్రోణాదులుగల్ల రే? ఋత్విజుండందు రేని కృష్ణ ద్వైపాయనుఁ డుండలేదా? రాజని వచింతు రేని యాదవులు రాజు లగుదురే? పూజనీయులైన పురుషులలో వీఁడెవ్వఁడు? ధర్మజా! భీష్ముని యోగంబున బేలవయితి వేల? నీ వెఱుఁగక యిచ్చినను ధగుఁడునని యీగోవిందుండు లజ్జావిహీనుండై కైకొన నొప్పునే? క్లీబునకుఁ గన్యాదానంబు సేయుట బధిరునకు శ్రావ్యగీతాశ్రవణంబు సేయుట యూషరక్షేత్రంబున బీజావాపంబు సేయుట కృష్ణున కిట్లు విధిదృష్ట విశిష్టపూజనంబు సేయుట. భూవరప్రవరులెల్ల నగంగ ధర్మరాజాభిధేయుంబు నిరర్థకంబుగాఁగ వర్తిల్లితివి. ఇట్టి సదస్సున మాబోఁటి కుండం బోలునే?" యని యెగ్గులాడుచు సహపుత్త్ర మిత్రబలుండయి సభఁదొఱఁగి చనియె.

అతని పిఱుందన ధర్మనందనుండు చనుచుఁ బ్రియ వచనంబుల ననునయించుచు "ననుజా! భూరిగుణోన్నతులకు ధీరులకు వాక్పారుష్యంబొప్పునే? అది విషముకంటె దహనముకంటె దారుణంబని నీ వెఱుంగవే? బ్రహ్మోత్పత్తికాస్పదుండును వేదాది సమస్తవాఙ్మయములందుఁ బ్రకాశితుఁడైన వాఁడును త్రిలోకైక పూజ్యుఁడును నగు కృష్ణుని లోకగురునిగా భీష్ముఁ డెఱిఁగియే చెప్పె. అతని నతనికంటె నెఱిఁగి పలుక నీకరిది. ఇందు దోస మేమున్నది?" అని శిశుపాలుం బటువఱుచుచున్న యన్నృపాలునకు నదీసూనుం డిట్లనును.

“రాగ కోప పరిభూత హృదయమునకు, నల్పరాజ్యరమూంధ బుద్ధికి, ననిమిత్త మహత్పరివాద శీలునకు, బాలునకు, శిశుపాలునకు ధర్మ మెఱుంగఁబోలు నే? వాని నేల పట్టువఱితువు?” అని చైద్యునుద్దేశించి “శిశుపాలా! అవినయబుద్ధివై యేల కాఱు లఱచెదు?

క. వృద్ధులోక లక్ష యున్నను
బుద్ధియె యెవ్వరికి, వారిఁ జే బూజింపంగా
నిద్ధరణీశులలో గుణ
వృద్ధని పూజించితిమి త్రి జే విక్రము భక్తిన్.

అమ్మహాత్ము సంతుష్టుం జేసిన భువనంబు లన్నియుఁ బరితృప్తినొందు” ననినఁ దామఘోషుండు దీమసంబునఁ గత్తి కటంబడి “కులగోత్రహీనుని, మాయకాని, జారుని, చోరునిఁ, బరమేశ్వరునిగా, నిమ్మది వెట్టి కొని యూడుటయు, ధర్మజుం డూఁకొనుటయుఁ, గృష్ణుఁ డందుల కొడంబడుటయు, నాహా! ఎట్లున్నది? పురోడాశంబు సృగాలంబున కర్హంబగు నే? అన్య కాంత యయిన యంబనపహరించి తెచ్చి యన్నివిధంబుల గోడుగుడిపినవాఁడును, ననపత్యత యను నధర్మంబు గలవాఁడును నగు భీష్ముఁడాడు వచనంబులు ధర్మ్యంబులయ్యెఁ గాఁబోలు!” నని పరుషోక్తుల వాసుదేవ శాంతనవులఁ దూలనాడుచుండ,

చ. ఎడపక యర్ఘ్య మచ్యుతున
కిచ్చితి మిచ్చిన దీనికే మొడం
బడమని దుర్జనత్వమునఁ
బల్కెడు వీరుని మస్తకంబుపై
నిడియెదనంచుఁ దాఁజరణ
మెత్తె సభన్ సహదేవుఁ డట్టిచో
నుడిగి సభాసదుల్ వలుక
కుండిరి తద్దయు భీతచిత్తులై.

భీమసేనుండును రౌద్రమూర్తియై నిఖిలక్షత్రియ సంత్రాస జనకంబుగా నలిగి దంతసందష్ట దారుణముఖుండై శిశుపాల నిర్మూలనాభీల సంరంభుండయ్యె. తమ్ముఁడైన నేమి? కొడుకైన నేమి? దుష్టుఁడయి పెద్దలఁ దిరస్కరించి నీచపరుష భావంబుల నెగ్గులాడిన నెవ్వరు సైరింతురు?

భావికాలజ్ఞుఁడగు భీష్ముఁడు భీమ సహదేవులఁ గను సంజ్ఞల వారింప శిశుపాలుండంతటఁబోక రాజలోకంబు నాక్షేపించుచు రక్షశ్శిక్షకుహాక్షేక్షణంబులపేక్షించి "స్త్రీగోవధంబు లొనరించిన కతమ్మున లోకేశ్వరుండవైతివే? మఱిదికి మాటవైన బోటిని దాటించుకొని పోవుటచే నాచారశీలురలో మేటివైతివేమి?" యని వాక్శూలమ్ములనా యమ్ముల నెత్తి క్రుమ్మి "రండు. మీరెల్ల రేకమై రణంబున నాకెదురై కడం గుఁడు. మీ యోగ్యత లించుక చవిచూతుఁగాక" యని

గర్వించి పలికిన చక్రధరుం డఖిల రాజచక్రమ్ము విన నిట్టు లనియె. "తొల్లి మాయత్త మనం బుత్తలపాటు నెందనీక వీని యపరాధశతంబు సహింతునని వాక్రుచ్చియుంటి. వీని యపకృతులు మేరమీఱె. ఇప్పుడును మీరంద ఱెఱుంగ నాయందపకార్య వ్యతిక్రమణం బుపక్రమించి యత్యంత శత్రుండయ్యె. వీని నింక క్షమింపఁజాల" నని శిశుపాలుని వంకఁదిరిగి "సుభ్రూ! నీవే గొప్పవాఁడవు. రమ్మామర్యాదఁ దైకొ" మ్మని తన చరణమ్ములకడ ధర్మజుం డునిచిన పళ్లె రమ్ముఁ గొని విసరివైవ, నది చక్రాకారంబునఁ దిరుగుచుఁ బఱతెంచి వానిశిరమ్ము కటుక్కునఁ ద్రెంచె. వజ్రహతాద్రి తుల్యుఁడై శిశుపాలుఁడు భూమింద్రెళ్లె. అంతఁ బ్రశాంత విఘ్నంబై శుభావహంబై ప్రభూత భక్ష్యాన్న ధనధాన్య సమ న్వితంబై జగన్నాథ రక్షితంబై రాజసూయ మహాధ్వరంబు సమాప్త ప్రయోగంబయ్యె.



# 14. మ త ము

ప్రపంచమునఁ గల మతములకు లెక్కలేదు. ఒక్కొక్క మతమునందు నంతశ్శాఖలు గలవు. హిందూదేశమున వైష్ణ వము, మాధ్వము, స్మార్తము నని, లేక యద్వైతము, విశిష్టా

ద్వైతము, అద్వైతము నని మూఁడుమతములు ముఖ్యమైనవి గలవు. వైష్ణవము, శైవము, శాక్తము, గాణపత్యము, సౌరము, కాపాలికము నని యాఱుమతములును బ్రసిద్ధము లైనవియు. బౌద్ధ క్రైస్తవములును బ్రాముఖ్యత నొందినవియు. మతమన నేమి? ఇన్ని మతములు గలుగఁ గారణమేమి?

మత మనఁగా ననుష్ఠేయధర్మముల బందుకట్టు. అనుష్ఠేయ ధర్మములలోఁ గొన్ని తమ మదికి నచ్చకపోవుటచేఁ గొందఱు వానివిడిచి తమ యాచరణీయముల కొక క్రొత్త పేరు గల్పించి మఱికొందఱ కిందు రుచి చూపి తమ సంఘమున కీడ్చుకొని యభివృద్ధి చేయుచుందురు. శాఖోప శాఖలుగా మతములు వృద్ధియగుట కిది ముఖ్యకారణము. ఇట్లెన్ని శాఖలైనను గలిగిన ప్రత్యవాయ మేమియు లేదు గాని వాని మూలమునఁ గలుగు మతాంతర ద్వేషము, కలహములు మున్నగునవి హేయములును బాపభాజనములు నగుచున్నవి.

మతస్థాపకులు మహాధీమంతులు. భగవత్సాన్నిధ్యముం బొంద సులభము సమీపము నని వారి కనుభవపూర్వకముగఁ గలిగిన నమ్మకముచే నేర్పఱచిన మార్గములవి. ఇట్టు లుండ నొకమార్గమునఁ బోవువారిని మఱొక మార్గగాము లధిక్షేపించినఁ గలుగు ఫలమేమి? గమ్యస్థాన మందఱ కొక్కటే.

శ్లో. అల్లాదేవో పూజానమాజః
ఖాజీ విద్వాన్ పండిత స్తతముల్లా

ఖల్వామంత్రం వేదశాస్త్రం ఖురాణాం
భాషాభేదో నైవశాస్త్రేషుభేదః.

మహమ్మదీయులు, దేవు నల్లా యని, పూజను నమాజని, విద్వాంసుని ఖాజీయని, పండితుని ముల్లాయని, మంత్రమును ఖల్వాయని, వేదములను ఖురానని, వ్యవహరింతురు. భాషాభేదమైనంతమాత్రమున శాస్త్రభేదము పొసఁగునే? బియ్యమునకుఁ దండులము, అరిసి, చావల్, రైస్ అని భాషాంతర పర్యాయపదములు గలిగినంతమాత్రమున వస్తువుగాని వస్తుతత్త్వముగాని మాఱనియట్టులు మతము లెన్నియైనను నందలి ధర్మములు పవిత్రములయియే యున్నవి. సర్వజన సమ్మతములుగాని మతధర్మము లున్న నవి మతములనిపించుకొనఁజాలవు. వామాచార్య మతాదులు కొన్ని నామావశిష్టములు గాలేదా!

చ. దయయును సత్యముఁ మనుజ
ధర్మము సర్వమతంబులందుఁ బెం
పయి విలసిల్లుఁ గావునఁ బ్ర
పంచమునందు మతంబులన్నియుం
బ్రియమున నాదిదేవుని స్మ
రించెడు నట్టివెయంచు నందఱన్
నయమునఁ జూచునాతఁడె జ
నంబుల ధన్యుఁడు భూతలంబునన్.

క. అన్నిమతంబులు ప్రియమను
చున్నను నొకమతమునందె యుండఁగవలయున్
గ్రన్నన నొక త్రోవను బో
కున్నను గమ్యమును జేర నోపునె యెవఁడేన్.

పాండురంగని దివ్యక్షేత్రంబున శివభక్తియుక్తుండగు నొక కమసలి యుండెను. అతఁ డెల్లవేళల విఠలుఁడు శంకర కింకరుఁ డనియుఁ బాండురంగని భక్తులు వివేకవిహీనులనియు నీచులనియు నెంచి యెల్లిదముగఁ బ్రల్లదములాడుచుండువాఁడు.

శ్లో. మద్భక్త శ్శంకరద్వేషీ మద్ద్వేషీ శంకరప్రియః
తావుభౌ నరకం యాంతి యావచ్చంద్ర దివాకరౌ

అను భగవద్వాక్యమును లక్ష్యపెట్టఁడు.

చ. రసము నెఱుంగు కోకిల తి
రంబుగ మావిచివుళ్ళ మెక్కెడిన్
విసువక కాకి రావులను
వేములఁ బొడ్చు రసం బెఱుంగమిన్
వసుధఁ గుతర్కవాంఛ గల
వారలు దేవు నెఱుంగరంచు దు
ర్వ్యసనముఁ దర్కమున్విడెడు
నాతఁడె ధన్యుఁడు భూతలంబునన్.

అను నుత్తమనీతివాక్యమును సంస్మరించువాఁడుకాఁడు.

ఇట్లుండ నప్పత్తనమున రుక్మిణీరమణ చరణ కమల సేవామధుపానమత్తద్విరేఫుండగు నొక భక్తశిఖామణి భక్త వత్సలునకు ముకుట మొకండు చేయించి యర్పింపఁ గుతూ హలుఁడై శైవుఁడగు సొన్నారికడ కరుగుదెంచి రత్నభర్మంబు లొసంగి రత్నమకుటము రంగనాథునకుఁ జేసియిమ్మని కోరెను. కంసలి కొంతవఱకుఁ జేసి యొసఁగనని పట్టుపట్టి తుట్టతుదకుఁ గొలత తెచ్చి యిచ్చినఁ జేసియిచ్చెద నని వాక్రుచ్చెను. భాగ వతుఁ డందుల కొడంబడి కొలత తెచ్చి యిచ్చెను. రత్నకిరీ టము పూర్తియయ్యెను. భక్తుఁ డదిగొని భగవంతునకుఁ గైంకర్యముసేయ సమకట్టి పూజాద్రవ్యములుగొని మంగళ వాద్యములతోఁ గొంపోయి స్వామిని సేవించి పూజానంత రము బొమిడికము నలంకరింప నది చాలకుండెను. మిగులఁ జింతతో మరల బత్తునియొద్దకాకిరీటముంగొంపోయి "అయ్యా! ఎంతయుఁ దమకంబున నీ చేసియిచ్చిన మకుటము గొనిపోయి విఠలునకు ధరింప నది చాలకపోయె. నేనిచ్చిన మానము నిట్లు తగ్గించి నలుగురిలో నా మానము తగ్గింపఁజూచితివే! ఇది నీకు ధర్మమే!" నానాకమ్మటీఁ "డిదియేమిచిత్ర మిట్లాడు చున్నావు! నీ విచ్చిన కొలతకే చేసితిని నా దోషములేదు. పోనిమ్ము మరలఁ జేసియిత్తు. ఎంత చాలకున్నది?" యన రెం డంగుళములు చాలదని యతఁ డనియె. తరువాతఁ జెడఁ గొట్టి మఱిరెం డంగులముల వలయ మధికముచేసి యిచ్చెను.

అదియు నింకను రెండంగులములు కడమపడియెను. తిరుగు వచ్చెను. ఇదేమి చిత్రమని యగసాలి మరల గట్టించి యీయగ నా బొమిడికము బుడుంగున దలదూఁటిపోయెను. మరలఁ దెచ్చి వదులని చెప్పి యీయఁ గమసాలి విసిఁగి 'నా వలనఁ గాదు. నా యొద్దికిరాకుపో' మ్మనియె. మఱికొందఱు భక్తు లటఁజేరి వారి వివాదముంగని కమ్మటీనిం గాంచి "ఓయీ! నీవ రంగనాథు నాలయమునకుం జని యతని తల కొలతగైకొనుటొప్పు" నని చెప్ప నతండు "నా ప్రాణము పోయినను నా యాలయముం బ్రవేశింప" ననియె. కడకు వారి ప్రార్థనములఁ ద్రోసివేయఁజాల కియ్యకొని కన్ను లకు గంతగట్టికొని పాండురంగని యాలయముంజొచ్చి స్వామి సన్నిధి నిలిచి రుక్మిణీశుని శిరంబును దన కరంబునఁ దడవెను. ఏమనఁగల మప్పటి చిత్రము! రంగనాథుఁడు లింగాకారుఁడైనట్టు లతని కరస్పర్శనమువలన నేర్పడెను. "ఏమిది! నా కుల దైవమగు వామదేవుని వాసుదేవునిగా నెంచి కన్నులఁ గప్పి కొని ద్రోహినైతినే" యని కొలతగొనుట మఱచి కనుల గంతఁ దొలఁగఁద్రోచెను. చూచునుగదా కనులు తెఱచి! లింగమూర్తి మరల రంగనాథమూర్తియై పొడకట్టెను. తటాలున నతఁడు నయనముల మూసికొనెను. పొరపడి పాప మార్జించితినిగదా! యని పరితపించెను. పదపడి ప్రాయ శ్చిత్తముచేసికొందునని మదిని సమాధానపఱచుకొని మరలఁ

గొలతగొన గమకించెను. మరల మాధవుఁడు మాధవరూపుఁడయి హస్తంబులకుఁ దగిలెను. కమసలి నమ్మక చక్కఁగఁ దడవి చూచెను. సంశయములేదు. ఇతఁడు శివుఁడే యని నిశ్చయచిత్తుఁడై కనులఁ దెఱచెను. అంతలో విఠలుఁడై కానిపించెను. ఇపు డాతఁడు మరలఁ గనులు గప్పికొనలేక పోయెను. శరీరము గడగడ వడఁకఁ దొడఁగెను. అతని హృది నొక మెఱపు మెఱసెను. ఎన్నియో యోజనలొకటి నొకటి వెన్ను దన్నుచు లేచెను. ఊహాపోహాల కొకింత సంగరమయ్యెను.

క. హరి హర భేదము లెంచక
హరి హర నామమ్ము లొకని కైనవయని యా
హరి హర నామము మదిలో
నిరతము భజియించు సుగుణ నిధిగఁ గుబుద్ధీ!

అని తన్నుఁ గుబుద్ధీ! యని సంబోధించుకొనెను. నా పాపమునకుఁ బ్రాయశ్చిత్తము లేదనుకొని కడుంగడుఁ బరిదేవనము చేసెను. హరిహర తత్వ మప్పు డతనికి సుబోధమయ్యెను.

మహమ్మదీయవంశ్యుఁడై శ్రీరామచంద్ర పదసేవారతుండైన కబీరు రామనామ సంకీర్తనా పరవశుఁడై యొకప్పుడు గోలకొండవాడల సంచరించుచుండ నబాబు విని హర్కారులతో "నన్నచ్చ్రితిపుట భేదసంబుగ మనపుట భేద

నంబున మస్మత వ్యతిరిక్త దైవస్మరణము సేయు నీ నామ మాత్ర తురుష్కుని గారాగారంబున బాధింపుఁ" డనఁ దానీషాగారి శాసనము ననుసరించి కబీరును గొంపోయి భటులు చెఱసాలఁ జేర్చి కావలిగాచి యుండిరి. మఱునాఁడు వఱువాతఁ గబీరుఁడు తంబుర చేఁగొని యథారీతిగ వీథుల వెంటఁ బోవుచుండ నబాబు గని కారాశాలకడకుఁ బోయి పాఁగావాంఁడ్రను, శాలకువైచియుంచిన ముద్రలను జూచి శంకితుండై తెఱచిచూడ నందుఁ గబీరు లేమిం జేసి యద్భు తాశ్చర్య నిమగ్నుఁడై రామనామ మహిమంబును సంస్మ రించుచుఁ బరుగునఁ గబీరుని కడ కరుగుదెంచి యతని చరణ ముల కెఱఁగి తచ్ఛాత్రవర్గంబునఁ జేరె.

మఱియొక వేడుక కతం జవిచూఁడుఁడు.

ఒక యగ్రహారమున వేదాధ్యయ సంపన్నుఁడగు నొక వైష్ణవాచార్యుఁడు శిష్యసంతతికి సంత చెప్పుచుండ నొక యద్వైతి యచ్చట కభ్యాగతుండయ్యె. అతనింగని యయ్యా చార్యుఁడు "కృష్ణ! కృష్ణా!" యని కనులు మూసికొనెను. అది గని యా యద్వైతి 'శివశివా' యనుచుఁ జెవులు మూసికొనెను. ఆచార్యుఁ డందులకుఁ గటకటపడి శిష్యులతో "చూడుఁడు వీని పోతరము! వీనిఁ జూడరా దని ముకుళిత నయనుండఁ గాఁగాఁ జెవుల సూదులుగ్రుచ్చునట్లు పాపనామో చ్చారణము గావించి మనలనే గాక యీ స్థలమునుసైత

